# దక్షిణదేశములు - నాట్యము

[తెలుగు భాషాసమితి ద్వారమున మద్రాసు ప్రభుత్వమువారు
నిర్ణయించిన ఉత్తమ గ్రంథ రచన పోటీకి పంపబడినది.]

రచన

**తుమ్మలపల్లి సీతారామారావు**

మద్రాసు




ఉమా పబ్లిషర్సు

విజయవాడ 1.

# మున్నుడి

శ్రీ తుమ్మలపల్లి సీతారామారావు గారు రచించిన "దక్షిణ దేశములు - నాట్యము" అను గ్రంథమును పూర్తిగా ఆమూలాగ్రముకాకపోయినను అక్కడక్కడ పెక్కుభాగములు చదివి చూచినాను. చూచిదానిని బట్టి గ్రంథకర్తగారు ఎక్కువగా శ్రద్ధవహించి పెక్కు ప్రాచీన నవీన గ్రంథములను పరిశోధించి అనేక ముఖ్యవిషయములతో తమ గ్రంథరచన సాగించినారని తెలిసికో గలిగినాను.

నాట్యకళ మన భారతదేశములో ఎప్పుడెట్లు ఉదయించి వృద్ధిపొందినదో వీరు ప్రమాణములతో వివరించినారు. భరతనాట్య లక్షణములు ఆలక్షణముల విశిష్టత సవిస్తరముగా తెలియజేసినారు. ఆంధ్ర కర్ణాటకతమిళ మలబారు దేశములందు దేశకాల పాత్రముల ననుసరించి ఏయే రీతుల పరిణమించినదో విశదపరచినారు. ఏయే రాజులు ఈ నాట్యకళను పోషించియుండిరో, వారి యాదరమున ఇది యెట్టి ఉత్కృష్టతను పొందియుండెనో సూచించినారు పదకర్తలు రచించిన పదములను విషయానుకూలముగా ఉదాహరించి, అందేవేవి నాట్యమునకు పొందుపడియున్నవో లక్ష్యలక్షణ సహితముగా నిరూపించినారు. నాయికానాయక లక్షణములను అభినయ, విశేషములను, రాగసాహిత్యసారసభావ విషయములను వివరించినారు. యక్షగానముల లక్షణములను ప్రత్యేకించి ఒక ప్రకరణము

నందు విశదపరచినారు. దేవదాసీ వ్యవస్థ ఎట్లు ఉదయించి దేవాలయములందును రాజాస్థానములందును గౌరవస్థానమును పొంది రానురాను నిందాస్పదమై పతనము పొందినదో అందువలన నాట్యకళయెడల లోకములో ఎట్టి వైముఖ్యము అనాదరము కలిగినవో వీరు చక్కగా వివరించినారు. దేవదాసీవృత్తిని నిరసించిన పెద్దలు ఇటీవల నాట్యకళా ప్రాశస్త్యమును గుర్తించి ఈ కళను పునరుద్ధరించినారు. అందుచేత ఈ కళనుగూర్చి తెలిసికోవలెనను అభిలాష దేశమందెక్కువయినది. ఇట్టి తరుణములో ఈ గ్రంథము రచితమగుట కొనియాడదగినది.

నాట్యప్రదర్శనములను చూచువారందరికిని ఆనందము కలుగుట సహజమే. అయినా నాట్యలక్షణములను లెస్సగా తెలిసికొన్నవారికి కలిగే ఆనందము ఉత్కృష్టమైనది. అట్టి ఆనందమును పొందగలుగుటకు ఈ గ్రంథము తోడ్పడగలదని నా అభిప్రాయము. ఇంతచక్కని గ్రంథమును రచించిన శ్రీ సీతారామారావు గారు తెలుగువారి ఆదరానురాగములకు కృతజ్ఞతకు అర్హులు కాగలరని నా నమ్మకము. వీరికి నా ధన్యవాదములు.

| తెలుగుభాషాసమితి<br>యూనివర్సిటిబిల్డింగ్సు,<br>మద్రాసు.<br>2—5—1956. | డాక్టరు. గిడుగు వెంకటసీతాపతి, డి.లిట్.,<br>ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము,<br>ప్రధాన సంపాదకులు. |
|---|---|

# ఉపశ్రుతి

మానవ చరిత్ర సృష్టిలో ప్రాచీనమైనది. మానవ చరిత్ర కంటె ప్రాచీనమైన చరిత్ర కలిగినది నాట్యకళ. దైవకర్తృత్వము కలిగిన ఈ కళ మొదట దేవలోకము నందుదయించినది. వారికి కలిగిన ఆనందమును, ఉత్సాహమును, కోపమును, విచారమును, ప్రేమను, వారివారి సత్వరజస్తమో గుణములకు అనుగుణముగా నృత్త,నృత్య గీతా గానాభినయములతో వెల్లడించిరి. అట్టి ఉదాత్త నాట్యప్రయోగములను జూచుట వారికొక వినోదముగ నుండెను అలోకప్రతిభావిలసితమైన భిన్న నాట్య వృత్తులను అభ్యసించిన భరతముని నాట్యశాస్త్రమును రచించెను. ఆయన జరిపిన నాట్యప్రయోగములను గురించి పూర్వగాథలు దెలుపుచున్నవి. నాట్యశాస్త్రమును మొదట రచించిన భరతమునిని గురించిగాని, ఆయన జీవించిన కాలమును గురించిగాని దెలిపెడి ఆధారములు మనకు లభించుటలేదు. అందువలన భరతుని నాట్యశాస్త్రము రచించబడిన కాలమును నిర్ణయించుటకు వీలు కలుగకున్నది. క్రమేపి నాట్యకళను ఋషులు వారి శిష్యులు మానవలోకమునందు ప్రచారము జేసిరి.

మానవ జీవితముతో సన్నిహిత సంబంధము కలిగిన నాట్యకళ వాస్తవిక జీవితమునకు ప్రతిబింబమైనది. ఆనందమే పరమావధిగా గల ఈ కళ మానవ జీవితముతో మేళవించుకుని వారి యూహాలకు ఆశయములకు రూపులుదిద్ది జీవితమునకు

అన్వయానందము కలిగించినది. మానవుని ఆశలు, ఆదర్శ ములు ఈ కళలోని భిన్నస్వరూపములలో ప్రతిఫలించినవి వీటి సమగ్ర స్వరూపమే వాటి కళాచరిత్రయైనది.

భారత దేశమును మన దేశము యొక్క నైసర్గిక పరిస్థి తులు ఉత్తర దక్షిణ దేశములను రెండు భాగములుగ విభ జించు చున్నవి. ఉత్తరదక్షిణ దేశములు రెండును ప్రాచీన కాలమునందు వేటికవి ప్రత్యేక చరిత్రను కలిగి ఒకదానితో నొకటి సంబంధము లేకుండగ స్వీయమార్గమున కృషి సలుపుచు అభివృద్ధి గాంచినవి. ఈ రెండు భూమిఖండముల సమైక్యచరి త్రయే భారతదేశ చరిత్ర.

దేశచరిత్రను రచించెడి చరిత్రకారునకు ఏయాధార ములు తోడ్పడుచున్నవో నాట్యకళా చరిత్రను క్రమమార్గమున సంఘటిత మొనర్చుటకుగూడ ఆ యాధారములే యిచ్చట పరిగ్రహించ బడినవి. పూర్వచరిత్రను దెలుసుకొని రచించుటకు కాలనిర్ణయము జేయుట ప్రధానము. గ్రంథములు, ఆయాగ్రంథ కర్తలు జీవించిన కాలము, నాణెములు, పురావస్తువులు, పూర్వీకు లుపయోగించిన యాభరణములు, కాలగర్భమునుండి త్రవ్వ బడిన శిల్పకళాఖండములు, తామ్రశిలా శాసనములు, దాన పట్టములు, కైఫీయతులు, సమకాలిక చరిత్ర, మొదలగునవి చరిత్రను రచించుటకు, కాలనిర్ణయము చేయుటకు తోడ్పడు చున్నవి. వీటినే ఆధారములుగా గ్రహించి దేశచరిత్రకు నాట్య కళాచరిత్ర సమన్వయము జేయబడినది.

దక్షిణదేశమునందు నివసించెడి ప్రజలు దాక్షిణాత్యు లని వ్యవహరించ బడుచుండిరి. అనాదినుండియు దక్షిణదేశ

మున నివాస మేర్పరచుకొని ప్రత్యేక నాగరికతను, మతాచార సంప్రదాయములను కలిగినవారు ద్రవిడులు. వీరు నివసించెడి దేశమునకు ద్రవిడదేశమని పేరుకలిగినది. తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము మొదలగు భాషలు మాట్లాడెడి ప్రజలు ద్రవిడజాతికి చెందినవారు. వీరి ప్రాచీన నాట్యకళా చరిత్రను తెలుసుకొనుటకు దక్షిణదేశమందలి దేవాలయములలోని శిల్పములు లెస్సగ దోడ్పడుతున్నవి. నాట్య శాస్త్రమునకు, నాట్యప్రయోగమునకు, నాట్యశాలా నిర్మాణమునకు సంబంధించిన అనేక అపూర్వశిల్పములు శిథిలములై కాలగర్భమున మరుగుపడి యుండవచ్చునని, నేటికిని సజీవముగ నిలిచి అపార నాట్య పరిజ్ఞానమును వెల్లడించుచున్న చిదంబరం, కంచి, మధుర, లేపాక్షి మొదలగు ప్రాంతములలోని దేవాలయములలోని శిల్పములవల్ల నూహింపవచ్చును. క్రైస్తవ శకారంభమునకు బూర్వము మహోన్నత స్థితియందుండిన నాట్యకళ నాట్యశాస్త్రము మొదలగువాటి పూర్వరూపములు క్రీ వె. 10వ శతాబ్దారంభము నాటికి గూడ గాన వచ్చుటలేదు. అప్పటివరకును నాట్యకళా చరిత్రను అంధకారము ఆవరించినది. ఆ వెనుక దేశమునందు ఏర్పడిన రాజ్యములు, వాటిని పాలించిన రాజులు, వారు నాట్యకళాపోషణమునకు అభివృద్ధికి చేసిన కృషిని సమకాలిక దేశచరిత్రతో సమన్వయించుచు విషయ పరిచ్ఛేదము చేయబడినది.

ఈ దృక్పథముతో పూర్వ క్రైస్తవ యుగమునుండి క్రీ. వె. 9 వ శతాబ్దాంతము వరకును పూర్వచరిత్ర యుగమనియు, క్రీ. వె. 10 వ శతాబ్దమునుండి క్రీ. వె. 15 వ శతాబ్దాం

తము వరకును చరిత్రయుగమనియు, క్రీ. శె. 16 వ శతాబ్ద ప్రారంభమునుండి క్రీ. శె. 18 వ శతాబ్దారంభము వరకును మధ్యయుగమనియు, క్రీ. శె. 18 వ శతాబ్దమునుండి క్రీ. శె. 20 వ శతాబ్దారంభము వరకును ఆంగ్లేయ యుగమనియు నాలుగు భాగములుగ విభజన చేయబడినది. విషయ వివరణములో కొన్ని చారిత్రక యంశములు నాట్యకళతో ప్రత్యక్ష సంబంధము కలిగియున్నవి. మరికొన్ని ఉదంతములు, శిక్షికలు నాట్యకళపైన పరోక్షముగ ప్రభావము జూపిన చారిత్రక సంఘటనలు, సాంఘిక వ్యవస్థలు, మొదలగు వాటి చరిత్రను వివరించుచున్నవి. ఆయాకాలములందు వెలువడిన నాట్యాభినయ, అలంకార శాస్త్రగ్రంథములు, భిన్నకాలములందు నాట్యకళ పొందిన పరిణామమును సూచించుట కనువుగ పరిశీలింపబడినవి. అట్లే పూర్వశిల్పములు, శాసనాదికములు నాట్యకళా చరిత్ర కుపకరించునవి మాత్రము పేర్కొనబడినవి. అనాదినుండియు మన దేశమున కప్పుడప్పుడు వచ్చిన విదేశయాత్రికులు నాటి రాజకీయ సాంఘిక పరిస్థితులనుగురించి, ప్రజల ఆచార వ్యవహారములను గురించి, చేసిన రచనలవలన మనకు అనేక పూర్వ విషయములు తెలియుచున్నవి. అట్టివాటిలో నాట్యకళకు సంబంధించిన వివరములు సమకాలిక చరిత్ర ననుసరించియు, శాస్త్ర సంప్రదాయముల ననుసరించియు చారిత్రక కథనము సాగినది.

నటరాజ రామకృష్ణ [illegible]

# విషయానుక్రమణిక

*

## పూర్వచరిత్ర యుగము

(క్రీ. పూర్వమునుండి క్రీ. వె. 9 వ శతాబ్దాంతమువరకు)



## చరిత్ర యుగము

(క్రీ. వె. 1000 – క్రీ. వె. 1300)



## మధ్య యుగము

(క్రీ. వె. 1600 – క్రీ. వె. 1800)

## ఆంగ్లేయ యుగము

(క్రీ. శ. 18 వ శ. ప్రారంభమునుండి క్రీ. శ. 20 శ. ప్రారంభము వరకు)



*

## అనుబంధము

# భారతీయ నాట్యకళ

భారతదేశమునందు ప్రాచీన కాలమునుండియు భిన్న జాతుల ప్రజలు నివసించుచుండిరి. వారు వేరు వేరు భాషలు మాట్లాడుచు వివిధ మతములను అవలంబించిరి. అట్టి జాతుల అభివృద్ధి వాటివిస్తరణ అనేకరాజ్యములు ఏర్పడుటకు కారణమైనది. ఆరాజ్యములయొక్క ప్రజల మత సాంఘికాచారములయొక్క చరిత్రయే భారతదేశ చరిత్రయైనది. అంతే గాదు, భారతదేశపు భౌగోళిక పరిస్థితులకు దేశచరిత్రకు గూడ సన్నిహిత సంబంధముండినట్లు తెలుస్తున్నది.

శీతోష్ణ పరిస్థితులలోను, జాతులలోను, మతములలోను, భిన్నత్వముగల దేశము భారతదేశము. బహుముఖములుగా వ్యాపించిన భిన్నత్వమునుంచి భారతీయ సంస్కృతి ఏకత్వమును రూపొందించుచున్నది. ఇదే భారతీయ సంస్కృతికి గల విశిష్టత. భారతదేశపు ప్రజలు విశేషముగ హిందువులు అగుట చేత వారు నివసించెడి దేశమునకు హిందూదేశమని పేరు కలిగినది. వారిమతము హిందూమతము. వేదములు, పురాణములు, ఇతిహాసములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు వారికి ప్రామాణికములు. పవిత్రమైన నదులు, పుణ్యతీర్థములు, అందరికిని శిరోధార్యమైనవి. హిందూమత సిద్ధాంతములను, నాగరకతను

సమన్వయపరచుచు హైందవ సంస్కృతి పెంపొందినది. కళల వలన విజ్ఞానమువలన ఏర్పడిన చరిత్రయే భారతీయుల ఉదార సంస్కృతి. ఆచరణయోగ్యము, అనుభవ పరిష్కృతము, అయిన ఈ సంస్కృతి అనేక శతాబ్దులనుంచి రాజకీయఉద్యమముల, సాంఘిక విప్లవముల ఆటుపోటులకు తట్టుకొని ప్రత్యేక విశిష్టతను నిలుపుకొనినది.

నైసర్గికముగ భారతదేశ సరిహద్దులు దేశమును మూడు భాగములుగ విభజించుచున్నవి. హిమాలయ పర్వతప్రాంతమునుంచి గంగ బ్రహ్మపుత్రానదులకు మధ్యనున్న దేశమునకు ఉత్తరదేశమనీ, నర్మదానదికి దక్షిణమునగల దేశమునకు దక్కను పీటభూమియనీ, మధ్య దక్షిణదేశమనీ, కృష్ణ కావేరి నదుల మధ్యనున్న దేశమునకు దక్షిణదేశమనీ పేరు కలిగినది.

తొలుత ఆదిమవాసులు భారతదేశమునందు నివాసమేర్పరచుకొనిరి. వారి వెనుక దేశములోనికి వచ్చిన ద్రావిడులు ఆదిమవాసులను అరణ్యములలోనికి తరిమివేసిరి. పూర్వము ఆదిమవాసులు ఆక్రమించుకొనిన ప్రాంతములను ద్రవిడులు స్వాధీన పరచుకొనిరి. మొట్టమొదట ద్రవిడులు సింధునదీ ప్రాంతమున నివసించుటచేత వారి నాగరికతకు సింధు నాగరికత అని ప్రసిద్ధికలిగినది. పూర్వము వారు నిర్మించిన మొహంజోదారో, హరప్ప పట్టణములలోని ప్రాచీన శిథిలములవల్ల వారి నాగరకత కొంతవరకు తెలుస్తున్నది. వారికి వాస్తు శాస్త్రము నందు అభినివేశముండినట్లు వారు నిర్మించిన మంటపములు,

భవనములు చాటుతున్నవి. తమ పూర్వికులవలె ద్రవిడులు చెట్లనేగాక శివుని, శివలింగమును, నందిని పూజించుచుండిరి. ఉత్సవములందు, పూజాదినములందు, జాతరలందు, నాట్యము చేయుట, చిందు ద్రొక్కుట, వారి యాచారము. ఆ కాలము నందు వారు తప్పెట్లను ఉపయోగించినట్లు తెలియుచున్నది.

## దక్షిణ భారతదేశము

భారత దేశమునందు ప్రత్యేకజాతిగ పరిగణింపబడిన వారిలో ద్రవిడులు ముఖ్యులు. వీరు నివసించెడి దేశమునకు ద్రవిడదేశమనీ, దక్షిణ భారత దేశమనీ, ప్రసిద్ధి కలిగినది. దక్షిణ దేశమందలి తెలుగు, అరవము, కన్నడము, మళయాళము మొదలైన భాషలు ద్రవిడభాషనుంచి పుట్టినవనీ, ఆయాభాషలు మాట్లాడువారు ద్రవిడులనీ చెప్పబడుతున్నది. ద్రవిడదేశమగు దక్షిణభారతదేశమున బహు ప్రాచీన కాలమునుంచి చోళ, చేర, పాండ్య రాజ్యములుండినట్లు తెలియుచున్నది. ఆరాజులు తరుచుగా ఒకరితో నొకరు యుద్ధములుచేయుచు సార్వభౌమత్వము స్థాపించుటకు కృషిచేయుచుండిరి.

చోళరాజ్యము నేలిన రాజులలో కరికాలుడు ప్రసిద్ధుడు. అతని రాజ్యమునకు కావేరి ముఖ్యపట్టణము. ఆయన గొప్ప శివభక్తుడు. అనేక దేవాలయములు ఆయనకాలమున గట్టించబడినట్లు దెలియుచున్నది. కృష్ణానదికి దక్షిణమునందున్న దేశమంతయు అతని పరిపాలన క్రిందయుండెను. ప్రాచీన పాండ్య

రాజ్య చరిత్రవలన నెడుంజెలియన్ ప్రసిద్ధుడని తెలియుచున్నది. అతని పరిపాలనమునందు పాండ్యులు కొంతకాలమువరకు సార్వభౌమాధికారము వహించిరి. ఆయన విద్యాభూషణుడు. తమిళ కవులను పోషించెను. ఆయన కాలమునాటికి ఉత్తరదేశమున దక్షిణదేశమునగూడ హిందూమతము పూర్తిగ నాటుకొనెను.

ప్రాచీన దక్షిణదేశమునందు విజ్ఞానము నాగరకత ఎక్కువగ అభివృద్ధిపొందెను. అప్పటికి ద్రవిడులకు ఉత్తరదేశపు ఆర్యులతో సంపర్కము కలుగలేదు. ఆకాలమున ప్రజలు వృక్షములను, సర్పములను పూజించుచుండిరి. వారు "అమ్మతల్లి" దేవతను కొలిచిరి. లోకమాత, ఆదిశక్తి, భూదేవి, పోలేరమ్మ వారి దేవతలు. వారు పూజించెడి ముఖ్యమైన పురుష దేవతకు నాలుగు ముఖములు, మూడు కండ్లు, అనేక జంతు పరివారము ఉండినవి. ఈ దేవతనే, కాలక్రమమున శివుడని, పశుపతియనీ, త్రినేత్రుడనీ వేరువేరు పేర్లతో వారు పిలచుటయేగాక పులి, ఏనుగ, మహిషము మొదలైన జంతువులను పూజించిరి. వారికి రావి, వేప వృక్షములు పవిత్రములైనవి. పైవానితో బాటు వారు లింగమును, సూర్యునికూడ ఆరాధ్య దేవతలుగ స్వీకరించి కొలిచిరి.

## ఉత్తర భారతదేశము

మధ్య ఏషియాలో మొట్టమొదట నివసించిన ఆర్యులు, భారతదేశములోని పంజాబుప్రాంతము నాక్రమించుకొని ఉత్తర

భారతదేశమునందు ప్రవేశించిరి. వారికి ఇండో ఆర్యులని పేరు కలిగినది. క్రమేపి వారు గంగా యమున ప్రాంతములను గూడ నాక్రమించుకొని, ఉత్తరభారతదేశ మంతటిని జయించి, వారు నివసించెడి ప్రదేశమునకు ఆర్యావర్తమని పేరిడిరి. ఉత్తర భారతదేశమునందు కురు, పాంచాల, కోసల, విదేహి, కాశీ, మగధ, అంగ రాజ్యములు ఏర్పడినవి. అప్పటికే దక్షిణదేశమున ద్రవిడులు ప్రత్యేకరాజ్యములు నెలగొల్పి, పట్టణములు నిర్మించిరి. ద్రవిడుల ఆచారములు, సంప్రదాయములు, నాగరకత ప్రత్యేక విశిష్టత పొందినవి. దక్షిణరాజ్యములకు వింధ్యపర్వత శ్రేణి శత్రుదుర్భేద్యమైన రక్షణమైనది.

ఉత్తర దక్షిణదేశములందలి రాజ్యములు వేటికవి ప్రత్యేకముగ భిన్న దృక్పథములతో స్వీయాభ్యున్నతికి కృషి జేయుచు పటిష్ఠతను చేకూర్చుకున్నవి. సువిశాలమైన భారత దేశమునందు ఆకాలమునందొకప్రాంతమునుండి వేరొక ప్రాంతమునకు రాకపోకల సౌకర్యములు లేకపోవుట వలన అప్పటివరకు నాగరికతాసమన్వయమునకు కృషి జరుగలేదు. కాని ఉత్తర దక్షిణ దేశముల నాగరికతా సమన్వయ కృషి క్రీస్తుశకారంభమునకు పూర్వమునుండి నాలుగు శతాబ్దముల వరకు దక్కనులో గొప్ప సామ్రాజ్యమును స్థాపించి దేశమును పాలించిన ఆంధ్ర శాతవాహనుల కాలమునందు జరిగినది.

ఉత్తరదేశమునందు వసించిన ఆర్యులు దక్షిణదేశము పైన దండయాత్ర చేయలేదు. కాని ఆర్యులు తమవిజ్ఞానమును

వేదములను, పురాణములను. ఉపనిషత్తులను దక్షిణదేశమందు వ్యాపింపజేసి గొప్ప వైజ్ఞానిక విజయమును పొందిరి. ఆర్యుల మతసిద్ధాంతములు, ఆచారములు ద్రవిడ దేశమందు ప్రచారము చేసినవారిలో అగస్త్యఋషి ముఖ్యుడని తెలిపెడి నిదర్శనములు చాల కలవు.

క్రమేపి దక్షిణదేశమునందు ఆర్యసంస్కృతి ప్రభావము ముద్రాపితమైనది. నాగరకతయందు, సాంఘికాచారములందు, వర్తకవాణిజ్యములందు ప్రత్యేకవిశిష్టత పొందిన ద్రవిడులు ఆర్యసంస్కృతిని స్వీకరించిరి. హిందూమతమునందు భక్తి ప్రభావమును ద్రవిడులే ప్రబోధించిరి. భారతీయసంస్కృతి ఆర్య అనార్యజాతుల సంసర్గమువలన ఏర్పడినది. ధర్మము మీద యాధారపడిన ఈ సంస్కృతి ఉత్కృష్టమై అనుభవ యోగ్యమైనది. వైజ్ఞానికముగ, ఇండోఆర్యుల సంస్కృతి వేద విజ్ఞానమునుండి పుట్టినదని చెప్పవచ్చును. ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అధర్వణవేదము అనెడి నాలుగు వేదములు బ్రహ్మముఖమునుండి వెలువడినవి. పరంపరానుగతముగ ఋషిసంతతి వేదములు గరపుచుండిరి. పురాణములు ఇతిహాసములు, ఉపనిషత్తులు, సంహితలు, బ్రాహ్మణములు, సమాదరించబడినవి.

వేదయుగమునందు యజ్ఞయాగాది క్రతువులు జరిగినవి. యజ్ఞకాలమున సోమపానము జేయుట, ఉత్సవాదికములలో నాట్యములు జరిపి వినోదించుట ఆ కాలమునందు ఆచార

ముగ నుండినది. రాజ పట్టాభిషేక, వివాహసమయములలో నాట్యములు జరుపుట విధాయక కృత్యమైనది. యజ్ఞఋక్కు లను తెలిపెడి సామవేదాధ్యయనపరులకు ఒక విధమగు వాచికాభినయము, మంత్రపఠనమందు గానము ఆవశ్యకమైనవి. సామవేదమునుంచి సంగీతము పుట్టుటచేత వేదాధ్యయన పరు లకు గానమునందు కూడ విశేషమైన ప్రతిభ కలిగినట్లు తెలియు చున్నది.

ప్రజలు ఆ కాలమునందు ఇంద్రాది అష్టదిక్పాలకులను ఆరాధించిరి. క్రమేపి వారు త్రిమూర్తులను, పార్వతిని, విఘ్నే శ్వరుని పూజించిరి. కర్మ సిద్ధాంతము, ఆత్మానాత్మ విచారము ప్రబలినది. ఆర్యులు ద్రవిడదేశమందు వ్యాపింపజేసిన వేదవిజ్ఞా నమును ద్రవిడులు పటిష్టమొనర్చిరి. దక్షిణదేశమున అనా దిగా నెలకొనిన జనులయందు గూడ ఒక విధమగు నాట్యాభి నివేశ ముండినట్లు ఇదివరకే ధ్రువపడినది. ప్రాచీన మైనట్టి భిన్ననాట్య సంప్రదాయముల పూర్వరూపములు దక్షిణదేశ కొరవంజులలో కనుపించుచున్నవి. క్రమక్రమముగా దాక్షిణా త్యులకు ఆర్యులతో ఏర్పడిన సంబంధమువలన భారతదేశ సంప్ర దాయములుకూడ దాక్షిణాత్యులకలవడినవి. దాక్షిణాత్యుల నాట్యపద్ధతిని దేశినాట్యమని, ఆర్యుల నాట్యపద్ధతిని మార్గదేశి పద్ధతి అని చెప్పకొనవచ్చును. దేశినాట్యము, దేశములోని భిన్న భాషాప్రయుక్త ప్రాంతములలో వంశపారంపర్యముగా, అనుశ్రుతముగా, ఆచారమునందుండి అనుసరించబడుతున్న

నాట్యపద్ధతి. ఇది సామాన్య ప్రజారంజకమైనది. రాజప్రాసాద ములందు, దైవోత్సవములందు దైవపరముగ జరిపెడి నాట్య మునకు మార్గదర్శి అని పేరు. ఈ ప్రదర్శనము రాజులు, పండి తులు, బ్రాహ్మణులు మొదలగు ఉత్తమజాతులవారి సమక్ష మున జరుపవలెనని నిర్దేశించబడినది.

దేశినాట్యపద్ధతి దక్షిణదేశమందే అభివృద్ధి పొందుట కొక కారణము కలదు. నటరాజగు శివుడు దాక్షిణాత్యులకు ముఖ్యదైవతము. ఆయన "తిలై" అరణ్యములందు అసురులను సంహరించి మొట్టమొదట చిదంబరము నందు నాదంతనృత్యము చేసెనని ప్రసిద్ధికలదు. కాబట్టి నాట్యకళ ప్రాచీనకాలము నుండి అభివృద్ధి జెందినది. బహుప్రాచీన కాలమందు అక్కడ నిర్మించిన నటరాజాలయము భారతీయులప్రాచ్యశిల్పకళానైపు ణిని ప్రదర్శించుచున్నది. అక్కడ నటరాజ విగ్రహమునకు యెదుటనున్న 46 స్తంభముల మండపము పూర్వకాలమున నాట్య సభామండపమై యుండెనని ఫెర్గూసన్ అను చరిత్ర కారుని రచనవలన తెలియుచున్నది. "నటరాజు" అను పేరు జనసామాన్యములో నొకపేరుగా వ్యవహారములోనుండుట వల్ల వారికి ఆ దైవతమందుగల భక్తిప్రపత్తులు స్పష్టపడు తున్నవి.

తమిళమున ప్రాచీన నాట్యగ్రంథమగు శిలప్పదికారము నందు దేశి నాట్య సంప్రదాయములు, కొరవంజులకు మూల మగు అనేక నాట్యకృతులు వివరించబడినవి. కాలక్రమమున

భరతముని ఉపదేశించిన నాట్యశాస్త్రమునందు దేశీయ సంప్రదాయములకన్న ఆర్య సంప్రదాయములే వ్యాపించినవి. ఆర్య సంస్కృతి ప్రభావము దక్షిణదేశ ప్రజలలో లీనమై ప్రకృష్ట స్థానము వహించినది.

---

# నాట్యోదయము

ప్రపంచ సృష్టిలో మానవుడు పురాతనుడు. అట్లే నాట్యకళగూడ పురాతనమైనది. కాని యాదార్థ్యమునకు నాట్యకళ మానవసృష్టికి పూర్వమే దైవలోకమునందుద యించినదని తెలియుచున్నది. దైవలోకమున నాట్యోదయ మును గురించి ప్రాచీనగాథల వలన తెలియుచున్నది.

అది త్రేతాయుగారంభము. "జంబూద్వీపమునకు దక్షిణ ప్రాంతమందున్న ఏషియా ఖండమున కపుడు భారత దేశమని పేరు కలిగినట్లు మార్కండేయ పురాణమువలన తెలియుచున్నది. ఆ కాలమున జంబూద్వీపమునందు దేవతలు దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, లోకపాలకులు నివసించుచుండిరి. ఆనాడు ఈర్ష్యాసూయలు, కామక్రోధములు దుఃఖవిచారములు లోకము నావరించినవి. ఇంద్రాది దేవతలు తమ స్థాయికి అర్హమగు విలాసయుతమైన ఉదాత్తవినోదము

గావలెనని సృష్టికర్తయగు బ్రహ్మను ప్రార్థించిరి. అప్పుడు చతుర్ముఖబ్రహ్మ వేదవిజ్ఞానమును చిల్కరించి ఋగ్వేదము నుండి పాఠ్యమును, సామవేదమునుండి గానమును యజుర్వేద మునుండి అభినయమును, అధర్వణ వేదమునుండి రసమును, గ్రహించి రమణీయమగు నాట్యశాస్త్రమును సృజించెను. దీనికి పంచమవేదమని, నాట్యవేదమని ప్రసిద్ధికలిగినది.

నాట్యమును భారతి, సాత్వతి, ఆరభటి, కైశికి అను నాలుగు వృత్తులుగా విభజించి వాటిని బ్రహ్మ భరతమునికి తెలిపెనని చెప్పబడుచున్నది. భరతుడు తన నూర్గురు పుత్రులకు, శిష్యులకు వారివారి సమర్థతలను బట్టి భారతి, సాత్వతి, ఆరభటి అను మూడు నాట్యవృత్తులను నేర్పి నాట్యప్రయోగ మందు సమర్థులుగా జేసెను. భరతాదులు గావించు నాట్యము మహోద్ధతమైన అంగహారములతో కూడిన పురుషనాట్యము. ఆయన కైశికీ నాట్యమునుగూడ సాధనముచేసెను. కైశికీ నాట్యము శృంగార రసప్రధానమైనది. అది సుకుమార అంగ హారములు కలిగిన విలాసయుతమగు స్త్రీ నాట్యము. కావున కైశికీ నాట్యసాధనమునకు, ప్రయోగమునకు దివ్యాంగనా జనము గావలయునని ఆయన బ్రహ్మను ప్రార్థించెను. అప్పుడు బ్రహ్మ మానస పుత్రికలగు అప్సరసలను సృజించెను.

ఆయన నారదాది గంధర్వులనుకూడ అప్పుడే సృజించి సంగీత మార్గాభ్యాసము గావించుటకు వారిని భరతమునివెంట

బంపెను. సౌదామిని, దేవదత్త, దేవసేన, మనోరమ, సురభి, సుందరి, విదగ్ధ, విబుధ, సుమాలి, సంతలి, సునందన, సుముఖ యగు మాతలి, అర్జున, సరళ, కేరళ, ధృతి, మంజుకేశి, సుకేశి, మిశ్రకేశ, సులోచన, వామ, కలభ యను ఇరువదినాల్గు మంది కోమలాంగులగు అప్సరసలు నాట్యసాధనము జేయుటకు భరతుని వెంట జనిరి. భరతుడు తన శిష్యులకు ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికములను చతుర్విధ నాట్యభేదములును, శృతి స్వరరాగములతో గూడిన సంగీతమును, నాలుగు విధములగు వాద్యవిభేదములను స్వర లయ జ్ఞానయుతముగా నేర్పెను.

నటరాజగు శివుని ఆజ్ఞ మేరకు ఆయన శిష్యుడగు తండు భరతునకు తాండవలక్షణమును, పార్వతి స్త్రీ జనోచితమగు కోమలలాస్యమునుగూడ ఆయన కుపదేశించినట్లు పూర్వగాథల వలన తెలియుచున్నది. ఇంద్రోత్సవమునాడు భరతుడు తన శిష్యబృందముతో గలిసి కైశికీ నాట్యప్రయోగము గావించెను. ఆ ప్రదర్శనమునకు ఇంద్రుడు మొదలగు దేవతలు విచ్చేసి ఆనందించి భరతుని యధిక సన్మానములతో గౌరవించిరి. భరతుని నాట్యకౌశలము మన్ననలు పొందినది.

చతుర్ముఖ ధ్వజోత్సవమునాడు, భరతముని మరియొక నాట్యప్రయోగము గావించుటకు నిర్ణయించబడినది. బ్రహ్మ పనుపున విశ్వకర్మ నాట్యశాలను నిర్మించి దానిని రమణీయముగ నలంకరించెను. ఆ నాట్యప్రయోగమును వీక్షించుటకు దేవతలు, దానవులు, వచ్చిరి. దానవ పరాజయమును ప్రద

ర్యించెడి నాట్యమును గాంచి అచ్చటికి వచ్చిన దానవులు క్రుద్ధులైరి. వారికిగల మాంత్రిక శక్తులతో నాట్యప్రయోగ సమయమునందు నటకుల స్మరణాశక్తిని పోగొట్టి మనోవైకల్యమును కలిగించిరి. దానవ మాయను గ్రహించి బ్రహ్మ వారికి నాట్యలక్ష్యమును వివరించి సమాధానపరచెను. తత్రాపి నాట్యశాల జీవితమునకు, సత్యమునకు ప్రతిబింబమై యుండవలెననెడి ఉన్నత లక్ష్యము ఏర్పడినది. ఇట్టి నాట్యప్రయోగములు దేవతాగణములోని మంచి చెడు గుణములు రెంటిని వివరించుటయేగాక, జరామరణములకు గురియగు మానవులకుగూడ ఉన్నత ఆదర్శములను, జీవిత లక్ష్యములను నిరూపించుచున్నవి. నాట్యము సకలలోక వ్యవహారాను కరణమని, ధర్మార్థకామ మోక్షములను నాలుగు విధములగు పురుషార్థములను సమకూర్చగలదని బ్రహ్మ నుడివెనని ప్రమాణవచనము దెలుపుచున్నది. నాట్యప్రయోగమునకు పూర్వము రంగమంటపమును ఆరాధించవలెనని ఆదేశించెను. దేవతారాధనము, హోమములు జేయుట సకల మంగళప్రదము.

పార్వతీదేవి కైశికీ నాట్యమును బాణాసురుని పుత్రికయగు ఉషాకన్యకు నేర్పెననియు, దాని నామె ద్వారకయందలి గోపికలకు నేర్పెననియు ఒక ప్రాచీన గాథవలన తెలియుచున్నది. సదాశివుని శిష్యుడగు తండు భరతునికి తాండవమునందు 32 అంగహారములు, 108 కారణాలు, 4 రేచకలు వివరించెను. వాటియందీ అంగహార భేదములు దెలిపెను. స్థిరహస్త,

పర్యాప్తక, సూచివిద్ధగ, అపవిద్ధ, ఆక్షిప్తక, ఉద్ఘటిత, విష్కంభ, అపరాజిత, విష్కంభహాస్త్రిత, మత్తక్రీడ, పార్శ్వ స్వస్తిక, స్వస్తికరేచిక, వృశ్చిక, భ్రమర, మత్తశాహాలిత, మదవిలాసిత, గతిమండల, పరిచ్ఛిన్న, పరివర్తిరేచిత, వైశాఖ రేచిత, పరావర్తిత, అలాటక, పార్శ్వభేద, విద్యుద్భ్రాంత, ఉద్వర్తిత, ఆవిద్ధరేచిత, ఆచురిత, అక్షిప్తరేచిత, సంభ్రాంత, అపసర్ప, అర్ధనిగూఢ.

కుమార నందికేశ్వరులు పరమేశ్వరుని తాండవమునందు మృదంగ వాద్యవాదనముచేసి శివుని మెప్పించెనని తెలియు చున్నది. మృదంగవాద్యమునకు నందికేశ్వరుడు అధినాయ కుడు. నాట్యమునందు గంట, జామంట, చిరుగంట, గజ్జలు మొదలగు కంచువాద్యములు, మర్దళ, డమరు మొదలగు శబ్ద వాద్యములు, శంఖు, ఏకతార, మురళి,వీణ, నాదవాయు పూర తంత్రీవాద్యములు దేవనాట్యమునం దుపయోగించినట్లు తెలియు చున్నది.

యాజ్ఞవల్క్యుడు, ఆంజనేయుడు సూర్యుని కృపవలన నాట్యము నభ్యసించిరి. నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు గానమునందుగూడ అసాధారణ ప్రజ్ఞావంతులైరి. నాట్య శాస్త్రము దేవతాదికర్తృత్వకమైనది. ఇందలి నాయికానాయక వ్యాపారములు జ్ఞానాపార్ధమునందు గురుశిష్యులయొక్క సేవకసేవ్య భావమును ప్రబోధించుచున్నవి. గనుకనే నాట్యము, పురుషార్థసిద్ధికి కారణమని చెప్పబడుచున్నది.

సదాశివుడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు దత్తిలుడు, కోహాళుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్య నాట్యశాస్త్రమునకు ప్రామాణికులని ప్రమాణశ్లోకము నుడువుచున్నది.

క్రమేపి భరతముని పుత్రులు, ఆయన శిష్యులు నాట్య విద్యను జంబూ ద్వీపవాసులకు నేర్పిరి. కాలక్రమాను గతమున, నాట్యకళ దేవలోకమునుండి మానవప్రపంచమునకు వ్యాపించినది. నాట్యమువలన అమరులుపొందిన యానందమును మానవులుగూడ యనుభవించుచుండిరి. జగత్సృష్టి కర్తయగు పరబ్రహ్మ ఆనందస్వరూపి. ఆ మూర్తినుండి ఉదయించిన ఈ కళ, ఆ యానందమూర్తికి అచ్చపు ప్రతిబింబము.

---



# నాట్యాభినయము

అభినయము నాట్యమునకు బహిఃప్రాణము. నాట్యమును గురించి అభినయమును గురించి దెలుపునది నాట్యశాస్త్రము. భరతనాట్య శాస్త్రకారులలో ప్రసిద్ధుడగు నందికేశ్వరుడు నాట్యాభినయమును గురించి 'అభినయ దర్పణము' అను నాట్యశాస్త్రమునందు విపులముగ చర్చించెను.

ఋషి సంప్రదాయముల ననుసరించి నందికేశ్వరుడు నాట్యమును మూడు భాగములుగ వివరించెను. అవి నాట్య, నృత్త, నృత్యము లనబడుచున్నవి. నాటకమునందు పూర్వకథతోడ వివరింపదగినది నాట్యము. రసము, భావము ప్రధానముగా గలది నృత్యము. రాగతాళ యుక్తమైనది నృత్తము. నాట్య, నృత్త, నృత్యములు మూడును తిరిగి రెండుపద్ధతులుగా జెప్ప బడినవి. వీటిలో సుకుమారమగు నర్తనము లాస్యము. ఉద్ధతమగునది తాండవము. నాట్య, నృత్తములు రెండును పర్వకాలములందు జూడ దగినవి. నృత్యమును రాజపట్టాభిషేకము, తిరునాళ్ళు, ఊరేగింపు, మిత్రసమాగమము, పురప్రవేశము, గృహప్రవేశము, పుత్రోత్సవము మొదలగు సమయములందు ప్రయోగించవలెను.

రాజున కెదుట నర్తనము జేయుస్థలమునకు రంగస్థలమని నందికేశ్వరుడు నామకరణము చేసెను. రంగమండపమున

పాత్రము, నటోత్తముడు, కుడిపార్శ్వమునందు తాళగాడు, ఇరు ప్రక్కల మర్దళవాద్య వాదనకారులు, వారినడుమ గాయకులు, వారినెనుక శ్రుతిపోయువాడు యుండవలెనని ఆయన వివరించెను. నాట్యమునకు ముఖ్యవాద్యములుగా మృదంగము, మంచినాదముగల తాళములు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణె, చెప్పబడినవి. నాట్యప్రయోగమునకు పూర్వము ఇష్ట దేవతా ప్రార్థనము జేయవలెననియు, లేనియెడల అట్టినాట్యము నీచనాట్యమై దానిని జూచువారు పుత్రహీనులై పశుజన్మము పొందెదరనియు ప్రమాణవచనము నుడువుచున్నది.

అభినయమునకు రసభావ పరిజ్ఞానము ప్రధానముగ నుండవలెను. అభియను ఉపసర్గము పూర్వమునందుగల 'నీ' అనెడు ధాతువునకు చెప్పుటయని అర్థము. అది పదార్థములను వివరించును గనుక అభినయమని పేరు కలిగినది. సామాజికులను రసజ్ఞానము కలిగించి రంజించునది అభినయము.

అభినయము ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము అని నాలుగు భాగములుగ విభజించబడినది. అంగములచే ప్రకటించు భావమునకు ఆంగికాభినయమని పేరు. మాటలతో జెప్పునది వాచికాభినయము. హారములు, ఆభరణములు మొదలగు శరీరాలంకరణలతో భావమును దెలుపునపుడు ఆహార్యాభినయమగును. సాత్వికాదిభావముల సహాయమున జేసెడి అభినయమునకు సాత్వికాభినయమని పేరు కలిగెను.

ఆంగికాభినయము తిరిగి మూడువిధములుగనున్నది. ఇవి అంగాభినయమని, ప్రత్యంగాభినయమని, ఉపాంగాభినయ మని అనబడుచున్నవి. తల, చేతులు, చంకలు, పార్శ్వములు నడుము, పాదములు ఈ ఆరును అంగములు. మూపులు, భుజము, వీపు, కడుపు, తొడలు, పిక్కలు ఈ ఆరును ప్రత్యం గములు. మణికట్టు, మోకాళ్ళు, మోచేతులు, కూడ ప్రత్యం గములేయని కొందరు చెప్పుచుండిరి. చూపు, రెప్పలు, నల్ల గ్రుడ్డు, చెక్కిళ్ళు, ముక్కు, దవుడలు, అధరములు, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరసు ఈ 12 ను ఉపాంగములు. అంగములు కదలుటవలన ఉపాంగములకు గూడ చలనము కలుగుచున్నది.

నృత్యమునకు శిరోభేదము, దృష్టి భేదము, గ్రీవాభేదము, హస్తభేదము ఉపయోగించవలెను. సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆళోళితము,ధుతము, కంపితము,పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము అను తొమ్మిది శిరోభేదములు జెప్పబడినవి. కాని భరతాచార్యుడు 24 శిరోభేదములు పేర్కొనెను.

కనుబొమ్మల చతురత్వము భ్రూవిక్షేప మనబడుచున్నది. సహజ, పతిత, ఉత్క్షిప్త, చతుర, రేచిత, కుంచిత అని ఆరు విధములగు భ్రూవిక్షేపము లున్నవి.

సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత, అను నాలుగు గ్రీవాభేదములు ఉన్నవి. నందికేశ్వరుడు 12 హస్తప్రాణములు

వివరించెను. అవి ప్రసారణము, కుంచితము, రేచితము, పుంఖితము అపవేష్టితకము, ప్రేరితము, ఉద్వేష్టితము, వ్యావృత్తము, పరివృత్తము, సంకేతము, చిహ్నము, పదార్థటీక అనబడుచున్నవి,

హస్తములు అసంయుతములు, సంయుతములు అని రెండు విధములు. 23 అసంయుత హస్తములు, 24 సంయుత హస్తములు చెప్పబడినవి. బ్రహ్మ మొదలగు దేవతలయొక్క మూర్తి భేదముల ననుసరించి మరికొన్ని దేవతాహస్తములున్నవి. పదునెనిమిది జాతులకు వారివారి క్రియలకు తగినట్లు హస్తములు చెప్పబడినవి. నవగ్రహములకు, గంగాది నదులకు, సప్తలోకములకు గూడ హస్తములు వివరించబడినవి. వృక్షములను సింహశార్దూలాది మృగములనుగూడ అభినయమునందు దెలుపుటకు హస్తములున్నవి.

## అసంయుత హస్తములు

ఒకే చేతితో పట్టెడి హస్తములు అసంయుతహస్తములనబడుచున్నవి. ఈ హస్తములకు జననము, జాతి, వర్ణము, ఋషి సంప్రదాయము, అధిష్టానదైవతము ఉన్నవి. వీటిలో కొన్ని దైవహస్తములున్నవి. ప్రతిహస్తమునకు వినియోగములు గూడ వివరించబడినవి. పతాకము, త్రిపతాకము, అర్ధపతాకము, కర్తరీముఖము, మయూరము, అర్ధచంద్రము, అరాళము, శుక

తుండము, ముష్టి, శిఖరము, కపిత్థము, కటకాముఖము, సూచి, చంద్రకల, పద్మకోశము, సర్పశీర్షము, మృగశీర్షము, సింహ ముఖము, లాంగూలము, సోలపద్మము, చతురము, భ్రమరము, హంసాస్యము, హంసపక్షము, సందంశము, ముకుళము, తామ్ర చూడము, త్రిశూలము అను 28 అసంయుత హస్తములు.

పతాకము : అన్ని వ్రేళ్ళనుచేర్చి చాచి బొటనవ్రేలిని వంచి పట్టునది.

నాట్యారంభము, కుచస్థలము, రాత్రి, నది, శయనము, ఖండించుట, ప్రసాదము, చంద్రిక, తలపుతట్టుట, ఏడు విభక్తులు, గంధముపూయుట, చెంపపెట్టు, సంబోధనము, పదార్థ మును స్పృశించుట, మాసము, సంవత్సరము, వర్షము, దినము, తుడుచుట మొదలగునవి దీని వినియోగములు.

ఈ పతాకహస్తము బ్రహ్మవలన పుట్టెను. అందువలన ఈపేరు కలిగెను. ఇది హస్తములకు మొదటిది. దీని జాతి బ్రాహ్మణజాతి. వర్ణము తెలుపు. ఋషి శివుడు. అధిదేవత బ్రహ్మము.

త్రిపతాకము : చిటికెన వ్రేలికి ముందువేలు వంచబడెనేని త్రిపతాకయగును.

కిరీటము, వృక్షము, వజ్రాయుధము, ఇంద్రుడు, మొగలి పువ్వు, దీపము, చెక్కిలి, స్త్రీ పురుషుల చేరిక, బొట్టుపెట్టు కొనుట మొదలగునవి సూచించుటకు దీనిని వినియోగించవలెను.

ఇది ఇంద్రునివలన పుట్టినది. ఎరుపురంగు. క్షత్రియజాతి. ఋషి. గుహుడు. అధిదేవత శివుడు.

అర్ధపతాకము: త్రిపతాకహస్తమందు చిటికెనవ్రేలు వంచబడె
నేని యది అర్ధపతాకయగును. చిగురు, పలక, గట్టు, ఇద్దరని జెప్పుట, ధ్వజము, గోపురము, కొమ్ము మొదలగునవి వినియోగములు.

కర్తరీ ముఖము : అర్ధపతాకహస్తమందలి చిటికెన వ్రేలును, చూపుడు వ్రేలును బయటచాచుట.

స్త్రీ పురుషుల యెడబాటు, వ్యత్యస్తస్థానము, దొంగి లించుట, కడకన్ను, చావు, మెఱుపు, ఏకశయ్యా విరహము, తీగ వీటిని చూపుటకు వినియోగించవలెను.

ఇది శివునివలన పుట్టినది. క్షత్రియజాతి. ఋషిపర్జన్యుడు. రక్తవర్ణము. అధిదేవత చక్రపాణి.

దంపతుల విరహము, చామరము, రక్తవర్ణము మొద లగువాటిని జూపుటకు కూడ ఈ హస్తమును ఉపయోగించ వలెను.

మయూరము: కర్తరీ ముఖహస్తమందు అనామికను అంగుష్ఠతో
జేర్చి తక్కిన వ్రేళ్ళనుజాచి పట్టుట.

నెమలి, ముఖము, తీగె, పక్షి, నొసలు, తిలకము, కన్నీరు ఎగజిమ్ముట, ప్రసిద్ధి మొదలగునవి ఈ హస్తమునకు వినియోగములు.

అర్ధచంద్రము : పతాక హస్తమందు అంగుష్టము చాచబడిన యెడల అర్ధచంద్రమగును.

కృష్ణాష్టమి చంద్రుడు, మెడపట్టి గెంటుట, దేవాభిషేకము, ధ్యానము, ప్రార్థించుట మొదలగునవి ఈ హస్త వినియోగములు.

భూషణేచ్ఛగల శివునికొరకు చంద్రుని నుండి పుట్టినది. ఇది అవిసిమొగ్గవలె నుండును. దీని జాతి వైశ్యజాతి. ఋషి అత్రి. గౌరవర్ణము. అధిదేవత మహాదేవుడు.

ముంజేతి కడియము, అద్దముజూచుట, ఆశ్చర్యము, తాళమానము, సిగ ముడివేయుట, అభిషేకము, కనుబొమ్మ, అంగము, కాళ్ళను జూపుట, వీపు, తెలుపు మొదలగువాటిని సూచించుటకు గూడ ఈ హస్తము నుపయోగించుదురు.

అరాళము : పతాక హస్తమునందు చూపుడువ్రేలు వంచుట. విషము, అమృతము మొదలగు వాటిని త్రాగుటను జూపుటకు ఈ హస్తమును వినియోగించవలెను.

పూర్వము అగస్త్యముని సప్తసముద్రములను ఆపోసనము చేయునపుడు ఈ హస్తము పుట్టెను. ఇది మిశ్రమజాతికి చెందినది. ఋషి అగస్త్యుడు. పాటల వర్ణము. అధిదేవత వాసుదేవుడు.

బ్రాహ్మణుల ఆపోశనము, ఆశీర్వాదముచేయుట, విటుల ప్రియవైముఖ్యము, వేగము రమ్మనుట, నొసటి చెమట తుడు

చుట, కన్నులకు కాటుక పెట్టుట, మొదలగు వాటిని చూపుట కుపయోగించవలెను.

శుకతుండము : అరాళ హస్తమునందు అనామికను వంచుట. బాణప్రయోగము, ఈటె, తీక్ష్ణభావములు సూచించుట దీని వినియోగములు.

సదాశివునియందు పార్వతీదేవి ప్రణయకలహము కలిగి నపుడు పార్వతీదేవి ఈ హస్తమును బట్టెను. ఇది బ్రాహ్మణ జాతి. ఋషి దూర్వాసుడు. రక్తవర్ణము. అధిదేవత మరీచి.

ప్రణయకలహము, ప్రీతి లేకపోవుట, ఉగ్రభావము, మరోక్తి మొదలగువాటిని ప్రకటించుటకు ఈ హస్తము నుప యోగించవలెను.

ముష్టి : నాలుగు వ్రేళ్ళను జేర్చి అరచేతిలోనికి వంచి అంగుష్టమును మీద జేర్చుట. స్థిరమనుట, దృఢత్వము మొదలగునవి దీని వినియోగములు.

మహావిష్ణువు మధుకైటభునితో యుద్ధము చేయు సమయమున ఆయన ఈ హస్తమును బట్టెను. ఇది శూద్రజాతి హస్తము. ఋషి అమరేంద్రుడు. వర్ణము నీలము. అధిదేవత చంద్రుడు.

సంకేతము, క్షేమము, ప్రాకృతజనుల నమస్కారము, మొదలగునవి సూచించుట కుపయోగించును.

శిఖరము : ముష్టి హస్తమునందు అంగుష్టమును పొడవుగా నెత్తుట.

మన్మధుడు, భర్త, ప్రశ్న, అవయవము లేదనుట, ఇతరాభినయము, కౌగలింత, ప్రియుడు, ఘంటానాదము మొదలగునవి వినియోగములు.

శివుడు త్రిపురాసురులతో యుద్ధము చేయుటకు మేరు పర్వతమును విల్లుగా జేసి దాని నడిమిభాగమును పట్టునపుడు శివునివలన ఈ హస్తము పుట్టెను. ఇది గంధర్వజాతికి చెందినది. ఋషి జితనుడు. చామన వన్నె. అధిదేవత మన్మధుడు.

సిగ్గు, విల్లు, మన్మధుడు, బోగమాట, అర్ధచంద్రతిలకము, నాయకుడు, శిఖరము మొదలగువాటిని సూచించుటకు గూడ నీ హస్తము నుపయోగింతురు.

కపిత్థము : శిఖరహస్తము అంగుష్టముపై చూపుడు వ్రేలు వంచుట.

లక్ష్మీదేవి, సరస్వతి, తాళమును పట్టుట, పాలు పిదుకుట, కాటుక బెట్టుకొనుట, వినోదముగా పూలచెండ్లు ధరించుట, కొంగు మొదలగువానిని బట్టుకొనుట, ధూపదీపార్చనము మొదలగువాటిని జూపుటకు ఉపయోగించవలెను.

ఈ హస్తము శివునివలన పుట్టెను. ఇది ఋషిజాతి. ఋషి నారదుడు. వర్ణము తెలుపు. అధిదేవత పద్మగర్భుడు.

నాట్యమును జూపుట, తామరపువ్వును వినోదముగా చేతబట్టుట మొదలగునవిగూడ దీని వినియోగములు.

కటకాముఖము : కపిత్థహస్తమందు చూపుడు వ్రేలు నడిమి వ్రేలితోను, బొటనవ్రేలితోను జేర్చిపట్టుట.

పువ్వులుకోయుట, దండలు ధరించుట, బాణమును మెల్లగా ఆకర్షించుట, ఆకుమడుపులిచ్చుట, వాసనద్రవ్యములు చేర్చుట మొదలగునవి వినియోగములు.

శివునివద్ద కుమారస్వామి విలువిద్యనేర్చునపుడీ హస్తము పుట్టినది. ఇది దేవజాతి. ఋషి భార్గవుడు. స్వర్ణ వర్ణము. అధిదేవత రఘురాముడు.

ముత్యాలసరము, పూలదండ, వింజామరము, భోగము వారి కౌగలింత, బంగారువన్నె, మొదలగునవి సూచించును.

సూచీముఖము : కటకాముఖహస్తమందలి చూపుడువ్రేలు పొడుగుగా జూచుట.

ఒకటియనుట, పరబ్రహ్మ నిరూపణము, సూర్యుడు, నగరము, విసనకర్ర, దేహము, ఆశ్చర్యము, సాయంకాలము మొదలగునవి దీని వినియోగములు.

బ్రహ్మ ఒకడేయని నిర్దేశించునపుడు ఈహస్తము ఆయనవలన బుట్టెను. ఇది దేవజాతి. ఋషి సూర్యుడు. వర్ణము శ్వేతము. అధిదేవత విశ్వకర్మ. శ్లాఘించుట, నాయకుని రహస్యముగా జూపుట, విరహము మొదలగువాటిని దెలుపుటకు గూడ ఈహస్తము నుపయోగింతురు.

చంద్రకల : సూచీహస్తమున బొటనవ్రేలిని విడిచిన చంద్రకలాహస్తమగును.

దీనిని కలామాత్రయగు చంద్రునియందు మాత్రము వినియోగింతురు.

పద్మకోశము : అయిదువ్రేళ్ళను ఎడముగా చాచి కొంచెము వంచి అరచేయి పల్లమగునట్లు పట్టుట.

ఇది మహావిష్ణువువలన పుట్టెను. యక్షజాతి. పద్మధరుడు ఋషి. భార్గవుడు దైవము. మారేడుపండు, వెలగపండు, స్తనములు, వర్తువ, చెండు, పూమొగ్గ, పూగుత్తి, పాములపుట్ట, మంకెన పువ్వు, నల్లకలువ మొదలగునవి దీని వినియోగములు.

సర్పశీర్షము : పతాకహస్తముయొక్క అరచెయ్యి కొంచెము పల్లముగ నుంచవలెను.

గంధము, పాము, దేవర్షి తర్పణములు మొదలగునవి సూచించును.

శ్రీ మహావిష్ణువు వామనావతారమెత్తినపుడు, వామనునివలన ఈ హస్తము పుట్టెను. ఇది దేవజాతి. ఇంద్రుడు ఋషి. పసుపువర్ణము శివుడు అధిదేవత.

కుంకుమ, గంధము, స్నానము, సిగ్గు, దాచదగిన వస్తువు మొదలైనవి జూపుటకు ఈహస్తమును బట్టవలెను.

మృగశీర్షము : సర్పశీర్షహస్తమందలి చిటికెనవ్రేలును, బొటనవ్రేలును జూచుట.

స్త్రీ విషయము, చెక్కిలి, మర్యాద, అలంకారము, ఎదురెదురు, కాళ్లుపిసుకుట, ప్రియులను బిలచుట దీని విని యోగములు.

మహేశ్వరునికూర్చి పార్వతీదేవి త్రిపుండ్రమును ధరించి నపుడు ఈ హస్తము పుట్టెను. ఋషిజాతి. ఋషి మార్కండే యుడు. వర్ణము తెలుపు. అధిదేవత మహేశ్వరుడు.

విచారము, సమయము, స్త్రీల అభినయము, గంధము పూత, సైగచే గ్రహించుట మొదలగువాటిని సూచించుట కుపయోగించవలెను.

సింహాముఖము : నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు, ఈరెంటి కొనలను బొటనవ్రేలితో జేర్చి తక్కిన వ్రేళ్ళను జాచి పట్టుట.

పగడము, ముత్యము, మంచివాసన, ముంగురులుదిద్దుట, నీటిబొట్లు, మోక్షవిషయము, మొదలగునవి వినియోగములు.

లాంగూలము : పద్మకోశ హస్తమందు ఉంగరపువ్రేలు వంచి పట్టుట.

గజనిమ్మపండు, పడుచుల చన్నులు, చిరుగజ్జెలు, పోక, చకోరము, చాతకపక్షి, మొదలగువాటిని జూపుటకు ఉపయోగించవలెను.

పాలసముద్రమునందు బుట్టిన కాకోలవిషమును మ్రింగుటకు శివుడు గుళికగా జేసినపుడు, ఈహస్తమును ఆయనబట్టెను.

ఇది సిద్ధజాతి. ఋషి కుమారస్వామి. బంగారువన్నె. అధిదేవత లక్ష్మీదేవి.

ద్రాక్షపండు, చిరుగజ్జెలు, మల్లెపువ్వు మొదలగునవి దీని వినియోగములు.

సోలపద్మం: చిటికెనవ్రేలు మొదలగు వేళ్ళు సందులు గల విగా విప్పుట.

విరిసిన తామర, తిరుగుడు, అద్దము, పూర్ణచంద్రుడు కొప్పు మొదలగువాటిని సూచించును.

పాలు దొంగిలించిన శ్రీకృష్ణునివలన ఈ హస్తము పుట్టెను. గంధర్వజాతి, ఋషి వసంతుడు. శ్యామవర్ణము. సూర్యుడు అధిదేవత.

విరహము, పూగుత్తి, వర్తులము, చక్రదనము, నర్తనము, మాధుర్యము మొదలగునవి దెలుపుట కుపయోగించును.

చతురం: తర్జని మొదలైన మూడు వేళ్ళను చేర్చి వ్రేలును చాచి, అంగుష్టమును అనామిక మూలమందు, అడ్డముగ నుంచుట.

కస్తూరి, రసాస్వాదనము, కన్నె, స్వారస్యము, నేయి నూనె, మొదలగునవి సూచించును.

గరుత్మంతుని సుధను హరింపుమని హస్తము చేతజూపిన కశ్యపునివలన ఈహస్తము పుట్టెను. మిశ్రమ జాతి. వాలఖిల్యుడు ఋషి. వైనతేయుడు అధిదేవత. దుమ్ము, సరసము,

నొసలు, ప్రియవస్తువు, కడగంటి చూపు మొదలగువాటినిగూడ తెలుపును.

భ్రమరం : నడిమివ్రేలిచేత బొటనవ్రేలిని తాకి, చూపుడు వ్రేలిని వంచి, తక్కిన వ్రేళ్ళను జాచిపట్టుట.

తుమ్మెద, చిలుక, యోగాభ్యాసము మొదలగునవి దీని ఉపయోగములు.

కశ్యపబ్రహ్మ అదితిదేవికి కమ్మలు చేయునపుడు ఈ హస్తము ఆయన వలన బుట్టెను. గంధర్వజాతి. ఋషి కపిలుడు. చామనచాయ. మౌనవ్రతము, ముల్లుతీయుట, పోకముడి విప్పుట మొదలగునవి గూడ దీని ఉపయోగములు.

హంసాస్యము : నడిమివ్రేలు మొదలు మూడువ్రేళ్ళను ఎడము గలవిగా చాచి, అంగుష్ఠమును చూపుడు వ్రేలితో జేర్చిపట్టుట.

ఉపదేశము, నిశ్చయము, గగుర్పాటు, చిత్రము వ్రాయుట, నీటిబొట్టు, దీపపు వత్తి, మల్లెమొగ్గలు మొదలగునవి దీని వినియోగములు.

మర్రిమానుక్రింద మునులకు జ్ఞానోపదేశము చేయునపుడు దక్షిణామూర్తి వలన ఈహస్తముపుట్టెను. ఋషి శుకుడు విప్రజాతి. వర్ణము తెలుపు. బ్రహ్మ అధిదేవత. జ్ఞానోపదేశము, పాడుట, గగుర్పాటు, పిల్లనగ్రోవియూదుట, ముద్దుపెట్టుట మొదలగు వాటిని సూచించుట కుపయోగించును.

హంసపక్షము : సర్పశీర్షమందలి చిటికెనవ్రేలిని బాగుగా చాచి పట్టుట.

కట్టుకట్టుట, గోటినొక్కు గురుతు మొదలైనవి సూచించును. శివుని సన్నిధిని తండువు తాండవము నభ్యసించు నపుడు ఆ తండువువలన ఈ హస్తము పుట్టెను. ఇది అప్సర జాతి. ఋషి భరతుడు. నీలవర్ణము. మన్మధుడు అధిదేవత. శుభనాట్యము, నలుపునన్నె, అప్సరోజాతి మున్నగువాటిని సూచించును.

సందంశము : పద్మకోశహస్తము, వ్రేళ్ళను మాటిమాటికి చేర్చి విడిచిపెట్టుట.

త్యాగము, బలినిచ్చుట, మనసునందలి భయము, అయిదు, మొదలగునవి ఉపయోగములు. సరస్వతీదేవి అక్షమాల ధరింపగా ఆమెవలన ఈ హస్తము పుట్టెను. విద్యాధర జాతి. ఋషి విశ్వావసుడు. వర్ణము గౌరవర్ణము. అధిదేవత వాల్మీకి, పాట, లాస్యము, జ్ఞానముద్ర దంతక్షతము జందెము, గీర శోధించుట, నిజము, లేదనుట, వేదమతము రత్నము మొదలైనవి వినియోగములు.

ముకుళము; అయిదువ్రేళ్ళనుచేర్చి పట్టునది ముకుళ హస్తము.

మన్మధుడు, ముద్రలు ధరించుట, కలువపువ్వు, మొదలగు వాటిని దెలుపును. పూర్వము ఆంజనేయుడు సూర్యుని జూచి పండనుకొని పట్టబోయినపుడు ఆయనవలన ఈ హస్తము

పుట్టెను. సంకీర్ణ జాతి విశాఖులుడు ఋషి. కపిలవర్ణము చంద్రుడు అధిదేవత. దానము, జపము, దీనవాక్యము, కాముకుని మాట, దేవపూజ మున్నగువాటిని దెలుపును.

తామ్రచూడము : ముకుళహస్తమందలి తర్జనిని వంచిపట్టుట.

కొంగ, కాకి, ఒంటె, దూడ వ్రాయుటను సూచించును. పూర్వము మూడువేదములు ఆకృతులు ధరించి బ్రహ్మ యెదుట నిలిచినపుడు దానివలన పుట్టెను. దేవజాతి.

దేవేంద్రుడు ఋషి. శంఖువర్ణము. బృహస్పతి అధిదేవత మూడులోకములు, శూలా యుధము, మూడువేదములు, దేవ జాతి దీని వినియోగములు.

త్రిశూలము : బొటనవ్రేలిని. చిటికెనవ్రేలిని వంచి తక్కిన వ్రేళ్ళను చాచి పట్టుట.

దీనిని మారేడు పత్రిని సూచించుట కుపయోగింతురు.

ఈ హస్తములకు ప్రయోగార్థములు ఎన్నికలవో అన్ని హస్తభేములుఉన్నవి.

అంజలి, కపోతము, కర్కటము, స్వస్తికము, డోల' పుష్పపుటము, ఉత్సంగము, శివలింగము, కటకావర్ధనము' కర్తరీస్వస్తికము, శకటము, శంఖము, చక్రము, సంపుటము' పాశము, కీలకము, మత్స్యము, కూర్మము, వరాహము, గరుడము, నాగబంధము, ఖట్వా, భేరుండము, అవహిత్థము అనునవి సంయుతహస్తములు. అసంయుత హస్తముల సంయో

గము వలన సంయుతహస్తము లేర్పడుచున్నవి. రెండువిధము లగు హస్తములకు ఉత్పత్తి యొకటే కాని సంయుతహస్తము లకు అధిదేవతలుమాత్రము వేరుగానుందురు.

అంజలి : రెండు పతాకహస్తముల అరచేతులు చేర్చవలెను.

దేవతలకు, గురువులకు, బ్రాహ్మణులకు నమస్కారము చేయునపు డుపయోగించవలెను. అధిదేవత క్షేత్రపాలుడు.

కపోతము : అంజలిహస్తము మొదలు, తుదలు, పార్శ్వము చేర్చియుంచిన కపోతహస్తమగును.

ప్రమాణము, పెద్దలతో మాట్లాడుట, వినయము, సంగ్రహించుట, సంపుటము మొదలైనవి ఉపయోగములు అధిదేవత చిత్రసేనుడు.

కర్కటము : కపోతహస్తమందు వ్రేలి వ్రేలి సందున వ్రేళ్ళను చొప్పించి లోపలికి గాని వెలికిగాని చాచిపట్టుట.

గుంపును, లావైనదానిని చూపుట, ఒడలు విరచుట చెట్టుకొమ్మ వంచుట, దుఃఖము, ఆవులింత మొదలగునవి ఉపయోగములు. అధిదేవత విష్ణువు.

స్వస్తికము : రెండు పతాక హస్తములందలి మణికట్టులను చేర్చి పట్టుట.

భయముతో మాట్లాడుట. వాదులాడుట, పొగడుట. మొదలగునవి దీని ఉపయోగములు.

పుష్పపుటము : రెండు శీర్షహస్తముల మణికట్లు, మొదటి చిటి
కెన వ్రేలువరకు గల అరచేతి యంచులందు
చేర్చిపట్టుట.

కర్పూరహారతి, మంత్రపుష్పము, అర్ఘ్యప్రదానము, దీని వినియోగములు. అధిదేవత కిన్నెరేశ్వరుడు.

డోల : రెండు పతాకహస్తములను తొడమీదికి వ్రేలునట్లు
పట్టుట డోలాహస్తమగును.

మోహము, మూర్ఛ, మదము దీని వినియోగములు. అధిదేవత సరస్వతి.

ఉత్సంగము : రెండు మృగశీర్షహస్తములను పరస్పరము
మూపులను సోకునట్లు పట్టుట.

కౌగిలింత, సిగ్గు, భుజకీర్తులను జూపుట, చలి, అంగీకారము, స్తనములను కప్పుకొనుట మొదలగునవి వినియోగములు. అధిదేవత గౌతముడు.

శివలింగము: ఎడమచేతి అర్ధహస్తమందు శిఖరహస్తమునుంచుట.
దీనిని శివలింగమును జూపుట కుపయోగింతురు.

కటకావర్ధనము : కటకాముఖహస్తములయొక్క మణికట్లు
స్వస్తికముగా చేర్చిపట్టుట.

పట్టాభిషేకము, పూజ, పెండ్లిదీవన, విచారము, శృంగారము, కోపశాంతి, కోలాటము, నిశ్చయము మొదలైనవి ఉపయోగములు. అధిదేవత యక్షరాజు.

కర్తరీస్వస్తికము: కర్తరీముఖహస్తములను స్వస్తికముగా పట్టుట చెట్టుకొమ్మలు, పర్వతశిఖములు, వృక్షములు మొదలగు నవి సూచించును.

శకటము : రెండు భ్రమరహస్తములతో బొటనవ్రేలిని,నడిమి వ్రేలిని చూచుట.

రాక్షసులు మొదలైనవారి అభినయము నందీహస్తము నుపయోగించవలెను.

శంఖము : శిఖరహస్తమందలి అంగుష్టముతో రెండవ చేతి అంగుష్టమును చేర్చి తక్కిన వ్రేళ్ళను ఆశిఖర హస్తము పైకి జేర్చుట. శంఖము మొదలైన వాటిని జూపుటకు ఉపయోగించవలెను.

చక్రము : అర్ధచంద్రహస్తములను అడ్డముగా రెండు అరచేతులను జేర్చిపట్టుట.

దీనిని చక్రమును సూచించుట కుపయోగింతురు.

సంపుటము : చక్రహస్తము వ్రేళ్ళను ముడిచిపట్టుట.

వస్తువులను దాచుట, సంపుటము మొదలగునవి వినియోగములు.

పాశము : సూచీహస్తముల చూపుడు వ్రేళ్లను వంచి చేర్చి పట్టుట.

పరస్పరకలహము, త్రాడు, సంకెల, మొదలైనవి సూచించును.

కీలకము : మృగశీర్షహస్తముల చిటికెనవ్రేళ్లు వంచి చేర్చిపట్టుట.
ఇది స్నేహము, ప్రియవచనము సూచించును.

మత్స్యము : పతాకహస్తములను ఒకదానిమీద నొకటిచేర్చి చిటికెన వ్రేళ్ళను, బొటనవ్రేళ్ళను, కొంచెము చాచి పట్టుట.
దీనిని మత్స్యార్థమునం దుపయోగింతురు.

వరాహము : మృగశీర్షహస్తమును ఒకదానిపై నొకటి చేర్చి చిటికెన, బొటనవ్రేళ్ళను కూడబట్టుట.
ఇది వరాహార్థమునకే యుపయోగించవలెను.

గరుడము : అర్ధచంద్రహస్తములు రెండును అడ్డముగా బొటన వ్రేళ్ళ చేరికతో పట్టుబట్టుట.
గరుడునియందు ఉపయోగము.

నాగబంధము : రెండు శీర్షహస్తములు స్వస్తికా కారముగ బట్టుట.
పాముల పెనవంటి రతిబంధమందు, పాముల పెనయందు, పొదరిండ్ల జూపుటయందు, అథర్వణ మంత్రమందు ఉపయోగించవలెను.

ఖట్వ : చతుర హస్తముపై చతురహస్తమునుంచి, చూపుడు వ్రేలిని, బొటనవ్రేలిని చాచిపట్టుట.
ఇది మంచము మొదలగువాటిని సూచించుట కుపయోగించును.

భేరుండము : కపిత్థ హస్తములు రెండును మణికట్టులతో చేర్చి పట్టుట.

దీనిని భేరుండపక్షి దంపతులను జూపుటకు వినియోగించవలెను.

అవహితము : రెండు సోల పద్మహస్తములు రొమ్మునకెదురుగా పట్టుట.

శృంగార నటనము, స్తనము మొదలైన వాటిని సూచించును.

ఇవిగాక గ్రంధాంతరములందు చెప్పబడిన 26 సంయుత హస్తములు, వాటి భేదములను నందికేశ్వరుడు తెలిపెను. అట్లే 11 బాంధవ్య హస్తములు, 16 దేవతాహస్తములు, దశావతార హస్తములు, చాతుర్వర్ణ హస్తములను ఆయన అభినయ దర్పణమునందు వివరించెను.

---

# దక్షిణ రాజ్యములందలి నాట్యపద్ధతులు

దక్షిణ దేశమున క్రీ. వె. 2వ శతాబ్దమునందేర్పడిన ప్రాచీన రాజ్యములగు చోళ, చేర, పాండ్య రాజ్యములచరిత్ర 'సంగం' సాహిత్యమువలన తెలియుచున్నది. అప్పటి గ్రంథములు ఆ కాలమునాటి సాంఘికాచారములను, సంప్రదాయములను, నాట్యపద్ధతులను కొంతవరకు వర్ణించినవి. సంగం కాలమందు జీవించిన కవులలో 'పరణన్' ప్రసిద్ధుడు. నెడుంజెలియన్ మధురను రాజధానిగ నేర్పరచుకుని పాండ్యరాజ్యమును పరిపాలించుచుండిన కాలమందు, తమిళమున ప్రాచీనమగు "శిలప్పదికారం" వెలువడినది. సాహిత్య కళాప్రియుడగు సేరన్ సెంకుట్టువాన్ చేర రాజ్యమును పాలించుచుండిన కాలమునం దీ గ్రంథము రచించబడినది. ఆయన కవులను కళాకారులను పోషించెను. "కూత్" అను నాట్యము ఆయనకు ప్రీతిపాత్రమైనది. కావుననే, ఆయన ఈ నాట్యపద్ధతిని విశేషముగ నాదరించి ప్రోత్సహించెనని తెలియుచున్నది. ఒకమారు ఆయన ఉత్తర దేశముపై దండయాత్ర వెడలి, విజయుడై స్వీయరాజ్యమునకు మరలివచ్చెడి మార్గమధ్యమునందు, తిరువాన్కూరునకు ఉత్తర దిశయందున్న ఒక పట్టణములో, అచ్చటి నటకులు త్రిపుర సంహారం, అను నాట్యప్రయోగమును రాజసమక్షమున జరిపిరి. ఆ రాజేంద్రుడు నటకుల అభినయ కౌశలమును మెచ్చి



ప్రాచీన ఆభరణములు, కంఠ హారములు

( బేలూరు శిల్పము )



ముఖారవిందమును దర్పణమునందు చూచుకొనుచు
అలంకరించుకొనుచున్న కామిని.

వారికి "అంబర్ కాడ్" అను గ్రామమువలన ప్రభుత్వమునకు వచ్చెడి ఆదాయమును శాశ్వతదానము గావించెనని తెలియు చున్నది.

రణరంగమునకు పోవుటకుముందు ఆ కాలమున ప్రజలు ద్రవిడదుర్గను గొలిచి పూజలు జేసిరి. నగరములందే గాక గ్రామములందుగూడ ప్రజలు నాట్యగానములందభిరుచి కలిగి, నాట్యప్రయోగములు జరిపి వినోదించుచుండినట్లు పూర్వ చరిత్రవలన దెలియుచున్నది. 'సంగం' సాహిత్యమునందు 'యాళ్' అను సప్తతంత్రీ వాద్యమొకటి పేర్కొనబడినది. దీనివలన సంగీతకళ రాజాదరణమును బొంది,నాడు మహోన్నత స్థితియం దుండెనని స్పష్టమగుచున్నది. ఆకాలమునందు సంగీత నాట్యములను జీవితాలంబనములుగా గ్రహించి కొందరు జీవించినట్లు "పాణర్" "విరళి" అను పదప్రయోగములవలన నూహింపవచ్చును. అప్పటి జనులు శివుని, విష్ణుదేవుని, కృష్ణుని సుబ్రహ్మణ్యేశ్వరుని పూజించిరి.

పాండ్యరాజులకు ముఖ్యపట్టణమగు మధుర, సకలైశ్వ ర్యములతో దులదూగినది. రాజధానీనగరము లోతైన కంద కములతోడను, ఎత్తైన ప్రాకారములతోడను శత్రు దుర్భేద్య మైనవి. ఆ పట్టణమందలి దేవాలయములు శిల్పకళా సౌందర్య మును మలచుకుని నేత్రోత్సవము కలిగించుచుండెను. రమ్య మైన నగరశాలలు, విశాల చతుష్పథములు, ఆరామములు, పట్టణసౌందర్యమును,ప్రజల సాంఘికౌన్నత్యమును ప్రకటించు

చుండెను. ఆ కాలమునాటికే పణ్యాంగనలు సంఘమునందు ప్రధానస్థానము వహించిరి. సంగీతనాట్యకళకు వారు ఆధారము లైరి. ప్రతిదినము ఉషఃకాలమున బ్రాహ్మణులు వేదపారాయణము, గాయకులు జంత్రగాత్ర సాధనము జేయుట పరిపాటి యైనది.

అప్పుడు బౌద్ధమతము దక్షిణదేశమునందు వ్యాపించినది. ప్రాచీనకాలమున జీవించిన తమిళఋషి 'మాణిక్యవాసగర్' గొప్ప శివభక్తుడు. దైవసిద్ధాంతములను కీర్తనల రూపమున గానముచేయుచు ఆయన దక్షిణదేశమందు ప్రచారము జేసెను. ఈ కాలమునందే "తిరుజ్ఞాన సంబందర్" అను మరియొక శివభక్త శిఖామణిగూడ నుండెను.

తమిళదేశమునందు క్రీస్తుశకము రమారమి 1900 సంవత్సరములక్రితము ఆధారమందుండిన జంతగాత్ర పద్ధతులను "శిలప్పదికారం" అను గ్రంథము వివరించుచున్నది. అప్పటి సంగీత వాద్యములలో వీణె, ఫ్లూట్, మృదంగము మొదలగు తంత్రి -వాయుపూర శబ్దవాద్యములు ప్రచారమందుండినట్లు తెలియుచున్నది. తమిళ ప్రబంధమున పేర్కొనబడిన 'మాదవి' యనెడు వారకామిని నృత్య గానాభినయ శాస్త్రములందు సుప్రసిద్ధాచార్యులయొద్ద శిక్షణము పొందినట్లు వర్ణించబడినది. ఆమె గొప్ప వైణికురాలనిగూడ జెప్పబడినది. నృత్తగీతాగానము లందును, అభినయమందును, ప్రజ్ఞావతియగు నామెకు వశంవదముగాని సంపదలు లేవు.

నాట్యాచార్యునకు ప్రధానముగా నుండవలసిన లక్షణములు ఆ గ్రంథమునందు తెలుపబడినవి. నాట్యాచార్యుడు 'ఆహ కూత్' భేదములు బాగుగనెరిగి యుండవలెను. భిన్న నాట్యపద్ధతులందును ప్రవీణతకలిగి వాటిని 14 'విళక్కు'లతో మేళవించగలిగి యుండవలెను. ఆ కాలమునందాచారములో నున్న ఏకాదశ నాట్యపద్ధతులు కరతలామలకము గావలెను. పూర్వలక్షణ గ్రంథములందు దెలిపిన నవరసములను వారు అభినయమునందు అభివ్యక్తము గావించిరి.

'సంగం' కాలమునాటికి జెందిన 'కలిత్తొగె' అను మరియొక తమిళ్ గ్రంథమునందు శివతాండవ లక్షణములు వివరించి ఉన్నవి. తాండవమును మూడుదశలలో వివరించిరి. వీటిలో మొదటి దశకు 'కొడుకొట్టి' యని పేరు. లయకాలమందు సదాశివుడు ఉద్ధతనాట్యము చేసినపుడు, ఆ నాట్యమునకు మహామాతయగు కాళికాదేవి తాళము వేసినది.

రెండవదశ 'పండరంగం' అని వ్యవహరించబడుచున్నది. ధరాధిపతులలో తుది వానిని సంహరించినపుడు శివుడు ఆనంద తాండవము జేసెను. అప్పుడు ఉమాదేవి తాళము వేసినది.

మూడవదశలో జెప్పిన నాట్యపద్ధతికి 'కాపాలి' యని పేరు బ్రహ్మదేవుని అయిదవ శిరస్సును ఛేదించి ఆ పుర్రెనొక చేత ధరించి, సదాశివుడు విజయోత్సాహముతో నాట్యముచేసినపుడు పార్వతి తాళము వేసినది. ఈనాట్యపద్ధతులకు నిర్దేశమైన నృత్తగీత తాళములు గూడ తెలిసియుండవలెను. రాగ తాళ

ములతోబాటు ఆంగికాభినయమునకుపకరించెడి హస్తభేదములు, వాటి ప్రయోగములందు లాఘవమును నాట్యాచార్యున కుండవలెను.

"కూత్" అను శబ్దమునకు తమిళమున నాట్యమని అర్థము. ఆ కాలమునందు విరివిగా ప్రచారమందున్న నాట్యపద్ధతులు పదకొండు విధములని తెలియుచున్నది.

"ఇశై, పుగల్, వెట్టియాళ్ లి" వీటిని రాజసమక్షమునందే ప్రయోగించవలెను. పొడువియల్, ఇది సామాన్య జనులకొరకు నిర్దేశించబడినది. వరై, వారిసంతి, వినోదం, ఆర్య, ఇయల్‌బు, దేశి అనునవి ఆకాలమందలి నాట్యపద్దతులు. ఇవిగాక 108 మార్గదేశి నాట్యపద్ధతులుగూడ చెప్పబడినవి. వీటికి 'చాక్క్యం' అను పేరుయున్నది.

వాచికమునందు దెలిపిన భావమును అంగములతో బ్రకటించుట అభినయ మనబడుచున్నది. పురాణమునుండి స్వీకరించిన కథావృత్తమునకుగాని, సంఘటనకుగాని నాటకమను పేరు కలిగెను. పైన దెలిపిన 'వినోదం' రెండుపద్ధతులుగ విభజించబడినది. వీటిలో 'కురవై' నాట్యపద్దతికి ప్రేమను కథావస్తువుగా గ్రహించిరి. యుద్ధము, విజయము మొదలగునవిగూడ కథావస్తువులైనవి. ఈ నాట్యమునందుపయోగించెడి పదములు "కురవై" ఛందము ననుసరించి యున్నవి.

నాట్యమునే వృత్తిగా స్వీకరించిన "దొంబరులు" చేయు నాట్యముకు 'కాళీనాట్టం' అను పేరు కలిగినది. శిరస్సుపై నీటి

కుండల నుంచుకుని చేయు నాట్యమునకు "కుడం" అను పేరు యున్నది. శృంగారయుతమగు స్త్రీనాట్యము "నోకు" అనబడు చున్నది. ఇవిగాక ఆ కాలమునందు మరికొన్ని దేశి నాట్య పద్ధతులుగూడ ప్రచారమునం దుండినట్లు తెలియుచున్నది. వీటిలో "తోల్‌పావై" ప్రధానమైనది. బహు ప్రాచీనకాలము నుండియు తెలుగుదేశమునందు సామాన్య ప్రజానీకమును రంజించిన 'తోలుబొమ్మలాట' ఇదేయని తెలియుచున్నది. ఈబొమ్మలాట రెండు పద్ధతులుగ నున్నది. వీటిలో ఒకపద్ధతి ననుసరించి కొయ్యతో చేయబడిన బొమ్మల నుపయోగింతురు. తోలును మనుష్యాకారములలో కత్తిరించి, వాటికి రంగులు వేసి ప్రదర్శించుట రెండవపద్ధతి, వీటి ప్రదర్శనమునకు రంగస్థలముపై నొకతెల్లని అవనికనుగట్టి, దాని వెనుకభాగమున ఆముదపు దీపములుబెట్టి ఆ యవనికను ప్రకాశనంతముగ జేయుదురు. తోలుబొమ్మలను తెరవెనుకనుండి ప్రదర్శించినపుడు వాటి చాయలు తెల్లనితెరపై అనేకరంగులలో ప్రతిబింబించును. ఈ నటకులకు భాషాజ్ఞానము, రాగాభినివేశము అవసరమైనది. ఈ ప్రయోగమునకు రామాయణము కథావస్తువైనది.

ఆకాలమునందు హాస్య ప్రధానమగు వినోదము "విదూషక కూత్తు" యనబడినది. ఇది రెండు విధములు. మొదటిది రాజుల సమక్షమునందు ప్రదర్శించబడినది. రెండవది జనసామాన్యమును రంజించినది.

అప్పుడు చేరరాజ్యమునందు మలబారొక భాగముగ నుండెను. మలబారు పర్వత ప్రాంతములలో భిన్న శాఖలకు చెందిన ప్రాజ్ఞులు నివసించుచుండిరి. అరణ్య ప్రాంతములందు నివాస మేర్పరచుకొనిన వారిలో నాయాదులు, మలయనులు, పెరయాలు, ముఖ్యులు. నాయాది అను పదమునకు వేటకాడని అర్థము. వారు మంత్రవిద్యయందు ప్రవీణులైయుండిరి. ప్రత్యేక కులదేవతలను వారు పూజించిరి. పల్లెలందు నివసించెడి ప్రజలలో అనేక శాఖాభేదము లున్నవి. వారిలో చెరుమానులు, కన్నకనులు, కడపటి తెగలకు జెందిరి. పల్లెలలోను, పట్టణములలోనుగల భూస్వాములవద్ద కొలువుచేయుచు, సేద్యము ప్రధానవృత్తిగా గలిగియుండిరి. వారికి జన్మతః నాట్యమునం దభినివేశమున్నది. సంవత్సరపర్యంతము సేద్యవృత్తిలో వారు జీవితమును గడపి, పంటల తరుణమున యజమాని ధాన్యమును వారికి జీవనగ్రాసముగా నిచ్చినపుడు వారు ఆనందముతో నొకవిధమగు చిందుద్రొక్కుచు, నాట్యము చేయుచు గీతములను బాడుదురు. కాళికాలయములవద్ద జరిగెడి ఉత్సవములందు వారు పాల్గొనిరి. వారికి నాట్యము చేయుటయందును, గీతములను బాడుటయందును, సహజమగు అభినివేశమున్నది. తాళజ్ఞానము వారి కపారముగ నున్నది. గుంపులుగా జేరి నాట్యము చేయుట వారి ఆచారము. ఎందరు నాట్యము చేసినను, మద్యమును ద్రాగి నాట్యము చేసినను వారికి అడుగు తప్పదు. ఇదే వారి తాళజ్ఞానములోని ప్రత్యేకత. కొబ్బరియాకులతో గొడుగులు

చేయుట వృత్తిగాగల "పాన్నియనులు" చాకలివారగు "వన్నియనులు"గూడ ప్రత్యేక దేశినాట్య సంప్రదాయములను కలిగియుండిరి. నాయరులు, నంబూద్రీలు అను శాఖలవారు మధ్యతరగతికి జెందిన ప్రజలు. కాళీ ఉత్సవములందు, పూజా దినములందు నాట్యములుచేయుట వీరి కులాచారముగ నున్నది. "పురం" అను కాళీకోత్సవమునందు వీరిలో నాట్యమునందు ప్రవీణులైనవారు, అర్ధ చంద్రాకారముగ మూడు, నాలుగు అడుగుల యెత్తున చేయబడిన శిరోవేష్టములు ధరించి కాళికా లయ సమీపమునందున్న ప్రతి గృహమువద్దకు వెళ్ళి నాట్యము చేయుచుందురు.

సంఘములో వీరితోపాటు సమాన గౌరవ ప్రతిపత్తులు కలిగిన "ఇజువన్‌లు" అను మరియొక శాఖవారు డాలు,కత్తి ధరించి "పాలిశ" నాట్యమును చేయుచుందురు. ఇది 'ముత్తుకలి' యని పిలువబడుచున్నది.

హిందూమతమునందు అంబలవాసీలు, నాయరులు, నంబూద్రీలు, అగ్రశాఖలకు చెందినవారు. వీరిలో "అంబల వాసీల"కు అనాదినుండియు దేవాలయ పూజాదికములలో ప్రమేయమున్నది. దేశములోని భిన్నజాతుల ప్రజల సాంఘిక మతాచారములనుండియు, అనువంశిక సంప్రదాయములనుం గియు, కూత్, కూత్తియాట్టం, పఠాకం, పాట్టు, అను వివిధ నాట్య సంప్రదాయములలోని విశిష్టగుణములను మలచుకొని క్రమేపి మరికొన్ని ఉదాత్త నాట్యవృత్తులు రూపొందినవి.

ద్రవిడ సంతతికి జెందిన ఆంధ్ర శాతవాహనులు క్రీ. పె. 450 సంవత్సరముల కాలమున నర్మదా తుంగభద్రానదులకు మధ్యగల దక్షిణ దేశమును పరిపాలించిరి. వారికి శాతవాహను లనికూడ పేరుయున్నది. ఐతరేయ బ్రహ్మణమునందు ఆంధ్రులు అతిప్రాచీన ద్రవిడసంతతి వారని తెలుపబడినది. విదేశ యాత్రి కుడైన మెగస్తనీస్ రచనలవలన అప్పటి సాంఘికపరిస్థితులు, ప్రజల మతాచార సంప్రదాయములు, కొంతవరకు తెలియు చున్నవి. ఆకాలమున ప్రజలు శివుని పూజించిరి. శివార్చన యందు నాట్యమొక భాగమైనది. అందువలన దైవప్రీతికొరకు వారు పూజాసమయములందు గీతాది గాన సంకీర్తనములు, నృత్యనాట్యములు జరిపిరి.

గ్రామదేవతల కొలువులు, ఉత్సవములు, తిరునాళ్ళు, అనేక జానపద నాట్యములకు దోహదము కలిగించినవి. ఈ యుత్సవములు జరుపుటయందు గ్రామీణులు ఉత్సాహమును శ్రద్ధాసక్తులును కలిగియుండిరి. పేరని, కుండలి, దండలశాక, చిందు, కావడిచిందు మొదలైన దేశినాట్యపద్ధతులు సామాన్య ప్రజలందరి యందుబాటులోనుండి, వారికి వినోదము కలి గించినవి.

ఈ భిన్న దేశి నాట్యపద్ధతులును సమాజములోని వివిధ శాఖలవారికిని వారి కుల సంప్రదాయముల ననుసరించి నిర్ణ యించబడినవి. కందుకనృత్తక్రీడ స్త్రీలకుగల నాట్యాసక్తికి దోహదము కలిగించినది. గొబ్బిపాట, ఊయలపాటలు, స్త్రీలకు

నాట్యమునందేగాక గానమునందుగూడ అభిరుచిని కలుగజేసి నవి. ఇవిగాక పరాసిక నర్తనమను ఒక విధమగు హాస్యము గూడ నాట్యమునందొక భాగమై యుండినట్లు తెలియుచున్నది.

ఆంధ్రుల వెనుక తూర్పు పల్లవులు, దక్షిణమున రాష్ట్రి కూటులు కొంతకాలము దేశమును పరిపాలించిరి. నాటికి దక్షిణదేశమందు శైవమతముతోబాటు వైష్ణవమతము, బౌద్ధ మతముగూడ బాగుగా వ్యాపించినవి. ఆకాలమున ప్రజలు, ఆర్యజాతికి జెందిన బలరామునిగూడ దైవతముగ నారాధిం చిరి. విగ్రహారాధనము ప్రబలినది. మధుర, కావేరి, కంచి మొదలగు పట్టణములు దేవాలయములకు నెలవులైనవి. దేవాలయములందు కేవలము దైవపూజలే జరుగలేదు. అవి నృత్యనాట్య ప్రయోగములకు రంగస్థలములైనవి. గంధర్వ కళయగు గానము సర్వజనాను రంజకమై, రాజాదరణముబొంది మహోన్నత స్థితియందుండెను. నృత్యనాట్యాభి నయములు ప్రాజ్ఞుల మెప్పు గాంచెను. పల్లవరాజులలో ప్రసిద్ధుడగు మహేంద్రవర్మ సంగీతశాస్త్ర పాండిత్యము కలిగియుండెను. ఆయన స్వయముగ కొన్ని స్వరములు కూడ కల్పించినట్లు తెలియుచున్నది. అనేకమంది గాయకులను ఆయన పోషించెను. ఆ కాలమున ద్రవిడులు విద్యావిజ్ఞాన సంపన్నులై మహోన్నత స్థితియందుండిరి. వారి సాంఘిక మతాచారములు, సంప్రదాయ ములు మానవజీవితమునకు ఉన్నతాదర్శములకు సూచించు చున్నవి. జీవితమును సమగ్రముగను, ఆనందప్రదముగను నెర పుటయందు వారు శ్రద్ధాదాసులై యుండిరి.

తమిళ భాషయందలి 'తేవారం' కంటె ప్రాచీన గ్రంథ మగు "తిరుమందిరం" అను గ్రంథము దైవపూజాదికములను గురించియు, దేవాలయముల వ్యాప్తిని గురించియు తెలుపుచున్నది. ఆధునిక సంగీత విద్వాంసులకుగూడ తెలియని అనేకరాగము లలో పూర్వకాలమున 'తేవారం' గానము చేయబడినట్లు తెలియుచున్నది. తమిళ దేశమునందు సంగీతకళ బహుప్రాచీన కాలమునందే బహుళముగ వ్యాపించినది. పల్లవుల కాలము నకు పూర్వమే దక్షిణదేశపు దేవాలయములు శిల్పకళాచరిత్ర యందొక నూతన సంప్రదాయమును నెలకొల్పెను. పల్లవుల అనంతరము దేశమును పాలించిన చోళరాజులు శిల్పకళాభి వృద్ధికి దోహదము కలిగించిరి. నృత్త నృత్యగీతాదికళలు, సాహిత్యాలంకార శాస్త్రములు అభివృద్ధిజెందినవి. ఆ నాటికి శైవవైష్ణవ మతములతో బాటు బౌద్ధమతముగూడ ప్రజలలో వ్యాపించినది.



# నాట్యోపాంగములు

నాట్యాభినయమునందు చెప్పబడిన భిన్న అభినయ విధానములలో వాచికాభినయ మొకటి. వాచికాభినయము శబ్దప్రధానమైనది. ఇట్టిశబ్దమును నాదమని చెప్పకొనవచ్చును. నాదప్రధానమైనది సంగీతము. ఈ నాదము రెండువిధములుగ నుండును వీటిలో మొదటిది మానవులకు ఈశ్వరుడు ప్రసాదించిన గాత్రము. రెండవది మానవుడు స్వీయ మేధాశక్తి వలన కల్పించిన శబ్దతంత్రి, వాయుపూర వాద్యములనలన నేర్పడు చున్నది.

గానమునకు గంధర్వవేదమని ప్రసిద్ధియున్నది. నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు మొదలగువారు నాదయుతమగు గానశాస్త్రమునకు ప్రాచీన ప్రామాణికులు. గానము శిశు, పశు, ఫణి, పక్ష్యాదులకు సహితము పారవశ్యము కలిగించును. ఇది ఐహికాముష్మిక సుఖసాధనమని వేదప్రమాణ వచనము. అవ్యక్తమధురమైన గానము నాదము, ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు మున్నగువాటి సంసర్గమువలన కలుగుచున్నది. ఈ గానము మార్గపద్ధతి, దేశిపద్ధతి అను రెండు సంప్రదాయములు కలిగియున్నది. ఈశ్వరప్రణీతమై ఋషులచేత చెప్పబడినది మార్గపద్ధతి. దేశమందలి భిన్నప్రాంతములలో వాడుకయందుండి జనులచేత వంశపారంపర్యముగ అనుసరించబడినది, దేశిపద్ధతి యనబడుచున్నది. వాల్మీకి రామాయణము రాగమునకు, నాట్యమునకు సన్నిహితముగ

నున్నది. దీనిలోని బాలకాండము గానముచేయుటకు మనోహర
ముగనున్నది.దీనినిమార్గపద్ధతికినిదర్శనముగ జెప్పవచ్చును.
ఇందలిగానము దైవప్రియమైనది. దీనిలో 7 జతులు ఉన్నవి.
కుశలవులు గంధర్వ వేదమగు గానకళా కోవిదులు. కొన్ని
ప్రాచీన గ్రంథములు రామాయణమందలి బాలకాండమును
జంత్రగాత్రములకు ప్రామాణికముగ దెలుపుచున్నవి. కాని
కుశలవులు బాలకాండమును ఎట్లుగానముచేసినది, అభినయించి
నది, తెలిపెడ యాధారములు మనకు దొరకనందున రామా
యణ గ్రంథమును గానమునకును, నాట్యమునకును, లక్ష్య
ముగ స్వీకరించుటకు వీలు కలుగకున్నది.

క్రీ. వె. 12 వ శతాబ్దమునందు ఉత్తర దేశమునుండి
దక్కనువచ్చి అక్కడ రాజాస్థాన విద్వాంసుడుగా నుండిన
సారంగదేవుడు "సంగీత రత్నాకరము" అను శాస్త్రగ్రంథ
మును వ్రాసెను. దీనిలో ఆయన ఉత్తర దేశమందలి మార్గ
పద్ధతినేగాక, దక్షిణ దేశమందు ఆ కాలమున ప్రచారమం
దుండిన వివిధగాన సంప్రదాయములను పరిశీలించి కొన్ని దేశి
రాగములను గూడ వివరించెను. ఆంధ్ర కర్ణాటక తమిళ దేశము
లందు భిన్న దేశీయ రాగములను సమన్వయము జేసి సంగీతము
నందు శుద్ధకర్ణాటక సంప్రదాయమును ఆయన నెలగొల్పెను.
తత్రాపి దక్షిణ దేశమందలి సంగీతము కర్ణాటక సంప్రదాయ
మని విశిష్టతను గాంచినది. నాటినుండి నేటివరకును భారతీయ
గానమునందు కర్ణాటక సంగీత సంప్రదాయము ఒకవిశిష్టాంగమై
వర్ధిల్లి గానకళకు అమరత్వము కలిగించినది.

నాట్యోపాంగములగు రాగతాళాది భేదములను వివరించు, దేశిరాగోత్పత్తిని దెలుపుచు గోవిందమంత్రి 1. "రాగతాళ చింతామణి"యను సంగీతశాస్త్ర గ్రంథమును రచించెను. ఇందలి విషయములు నాట్యసూత్రకారులు లక్షణ లక్ష్య గ్రంథములను శీర్షిక క్రింద వివరించబడినవి. గానమునందు మార్గ దేశి భేదములు కలిగినట్లే జంత్రవాద్యములందును పైన దెలిపిన భేదములుండినట్లు తెలియుచున్నది. నాట్యమునందు గానోపయుక్తములగు పదములు, కీర్తనలు, దరువులు, తరంగములు, యక్షగానములు, అష్టపదులు క్రమేపి ప్రచారముగాంచి శిష్టుల యామోదమును బొందినవి.

నర్తనము జేసెడి నటునకు జంత్రవాద్యములు బహిః ప్రాణములు. వాద్యములన్నియును సర్వ సామాన్యముగ కొయ్యతోడను, లోహములతోడను, జంతువుల చర్మముతోడను చేయబడినవి. మానవులు క్రమేపి తమ మేధాశక్తిని వినియోగించి స్వరకలితమగు నాదమును, సంగీతమును, కొమ్ములు, ఎముకలు, గాజు, ఘటము, రాతిపలకలనుండిగూడ వినుపించిరి. తంత్రీవాద్యములకు జంతువుల కేశములను, పట్టుదారములను, లోహతంత్రులను, కొన్ని వృక్షముల వేళ్లను, జంతువుల నరములను, ప్రేగులను ఉపయోగించిరి.

---

1. Madras Government Oriental Series "రాగతాళ చింతామణి."

మృదంగము భారతీయనాట్యవాద్యములకు పితృస్థానము వహించుచున్నది. ఇది మిక్కిలి పురాతనమైన వాద్యము. మోహదేవుడు, త్రిపురాసురుని సంహరించి విజయోత్సాహముతో ఇంద్రాదిదేవతల మధ్యమున, ఆనంద తాండవము చేసినపుడు మృదంగముపయోగించబడెనని పురాణములు తెలుపుచున్నవి. మోహదేవుని నాట్యమునకు గణేశుడు మృదంగ వాద్యవాదనముచేసెను. ఈ వాద్యము మొట్టమొదట మట్టితో చేయబడెనని దీనిపేరువలన తెలియుచున్నది. సంగీతవాద్యములు కాలక్రమాను గుణముగ మార్పుజెందిన కాలమున మృదంగము కొయ్యతో జేయబడి యుండవచ్చును 1 "సప్తస్వర" యను వాద్యవిశేషమునకు సప్తస్వరములుగల రాతిపలకలను దెచ్చి వాటిపై సుత్తెతో గొట్టుచు ఆయా స్వరములు బలికించిరి. ఆ కాలమున నృత్య, నాట్యగీతా గానములందు పలు విధములగు వాద్యముల నుపయోగించిరి. వాటియందివి విశేషముగ నుపయోగించబడినట్లు తెలియుచున్నది. పినాక (ఏక తంత్రీవాద్యములు), కాత్యాయన వీణ, మహతీవీణ, సుషీర యంత్ర, అలగోజా, మురళి, డమరు (శివుని ప్రీతికరమగు వాద్యము), ఢోల, ఘంట, ఝుర్ఝరిక, ఝుంఝుర (నాట్యకత్తెలు కాళ్లకు కట్టుకొనెడి గజ్జెలు), గోశృంఘు, కంసర (ఇది ప్రస్తుతపు కంజీరకు పూర్వనామమై యుండవచ్చును.) కిన్నర వీణ, లయమురళి, తుంబురవీణ, సప్తఘంటిక (తాళమును

1. "Hindu Musical Instruments." Sowrindra Mohan Tagore.

దెలుపుటకు ఉపయోగించెడి ఏడుఘంటలు కలిగిన సరము) మంచి శబ్దముగల తాళములు.

భరతనాట్య శాస్త్రము ననుసరించి భరతముని నాట్య సూత్రములను దెలిపెను. ఈ శాస్త్రములోని భరతములను అనేకమంది భరతాచార్యులు ప్రస్తరించిరి. నృత్త, గీతా, వాద్యములకు తాళము ప్రధానము, రెండు అరచేతుల సంయోగము తాళమనబడుచున్నది. భూలోకమునందు తాళమానమును దెలుపుటకు ఆరుతాళములు మాత్రము జెప్పబడినవి.

ఇవి అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము యనబడుచున్నవి. ఇందలి మార్గక్రియా విభేదములు, దేశ్యక్రియలు, గ్రహప్రాణములు, లయప్రాణములు, సప్తతాళములు, భరతకోవిదులు జెప్పిన భరతముల ననుసరించి పరిగ్రహించవలెను.



# నాట్యసూత్రకారులు - లక్షణలక్ష్యగ్రంథములు

నాట్యశాస్త్రమును రచియించినభరతమునియనంతరము క్రీస్తుశకము 10 వ శతాబ్దమువరకును నాట్యశాస్త్రమునకు లక్షణ లక్ష్యములు నిర్ణయించెడి శాస్త్ర ప్రామాణిక గ్రంథ ములు వెలువడలేదు. నాట్యప్రయోగములను వర్ణించెడి ఇతర ఆధారములు మనకు లభించుటలేదు. ఆ కాలమునందు నాట్యకోవిదులందు శాస్త్రలాలసత్వము లోపించెననిగాని, చిత్త సమున్నతి కొరవడెననిగాని యనజాలము. ఏ దురదృష్ట హేతువువలననో ప్రాచీన నాట్యకళా స్వరూపమును అంధ కార మావరించెను. అగుటజేసి ఆయాకాలములందలి నాట్య శాస్త్రములను గురించి మనకు దెలియుటలేదు.

క్రీ. శె. 11 వ శతాబ్దారంభమున జీవించియుండిన అభి నవ గుప్తాచార్యుడు" భరతుని నాట్యశాస్త్రమునకు వ్యాఖ్య రచించెను. నాటినుండియు నాట్యశాస్త్రము ప్రాజ్ఞుల దృష్టి నాకర్షించినది. అభినవ గుప్తాచార్యుడు ఉత్తరదేశమందలి కాశ్మీర్‌నకు జెందిన బ్రాహ్మణుడు. ఆయన తర్క, వ్యాకరణ, మీమాంస, అలంకార, వేదాంతశాస్త్రములందు పాండిత్యము కలిగియుండెను. సంస్కృత భాషయందు ఆయన 23 స్వతంత్ర గ్రంథములు రచన జేసెనని తెలియుచున్నది. భరతుని నాట్య శాస్త్ర విమర్శనమునందు ఆయన అనేక నూతన నాట్యపద్ధ

తులను, సిద్ధాంతములను వివరించెను. అభినవ గుప్తాచార్యుని నాట్యశాస్త్ర విమర్శనము, భరతుని శాస్త్రమునకు వన్నె దెచ్చుచున్నది. ఆనంద వర్ధనుని ధ్వన్యాలోకమునకు అభినవ గుప్తాచార్యుడు వ్యాఖ్యానము వ్రాసెను. అందలి నిదర్శనమువలన అభినవ గుప్తాచార్యుడు క్రీ. వె. 11 వ శతాబ్దారంభమున జీవించియుండెనని తెలియనచ్చుచున్నది.

భరతముని, నాట్యశాస్త్రమునందు బేర్కొనిన నాట్యశాలా నిర్మాణాది నియములు, మహాకవి కాళిదాసు సంస్కృత భాషయందు రచించిన "శర్మిష్ట విజయము" అను నాటకమునందు మాత్రము వర్ణించబడినవి. నాట్యాభినయ శిక్షణము, ప్రయోగవిధానము కూడ కాళిదాస కవిచేత వివరించబడెను.

జయదేవ కవి క్రీ. వె. 11 వ శతాబ్దమున వంగదేశమందు లక్ష్మణసేన మహారాజు ఆస్థానకవిగ నుండెను. ఉమాపతి ధరుడు, శరణికవి, గొవర్ధనాచార్యుడు, ధోయీకవి మున్నగువారు ఆ యాస్థాన విద్వాంసులుగా యుండినట్లు రాజసభాభవన ద్వారమందు చెక్కిన శిలాశాసనమువలన తెలియుచున్నది. జయదేవకవి గొప్ప కృష్ణభక్తుడు. ఆయన రచించిన "గీత గోవిదం" భక్తిశృంగార రసప్రధానమైనది. వీనిలో కృష్ణుడు గానము చేయబడెను. అగుటజేసి ఈ ప్రబంధము గీత గోవిందమని సార్థక్యము పొందినది. సంగీత ప్రియుల సాధనమునకు అనువుగ 8 చరణములు కలిగిన 24 అష్టపదులను గూడ ఆయన దీనియందు రచించెను. వాటిలో వర్ణించిన

రాధాకృష్ణుల శృంగార వర్ణనమును జ్ఞానాపార్ధమున సేవక సేవ్యభావమున గ్రహించినపుడు అది భాగవతార్యులకు గూడ సమాదరణీయమగును. ఈ ప్రబంధమున విప్రలంభ సంభోగ శృంగార రసములు సమగ్రముగ వర్ణించబడినవి. జయదేవుడు సాహిత్యాలంకార శాస్త్రములందు ప్రామాణికుడు. అందువల ననే ఆయన వెనుకవచ్చిన సాహిత్యకారులు లక్షణ గ్రంధము లందు ఆయన ప్రయోగములను ప్రమాణముగ స్వీకరించిరి. ఆయన చంద్రాలోకము, రతిమంజరి, కారకవాదము, తత్వ చింతామణి అను గ్రంధములు గూడ రచించెను.

జయదేవ కవి వ్రాసిన అష్టపదులు గానమునకేగాక, అభినయమునకుగూడ నుపకరించినవి. అభినయమునకు,నాట్యలా స్యమునకు అష్టపదులే లక్ష్యప్రామాణికములు. తెలుగు తమిళ దేశములందలిభాగవతులు అనాదినుండియు అష్టపదులను గాన ముచేసి అభినయించుచుండిరి. కేరళదేశమున నటకులు వీటినే లక్ష్యముగా గ్రహించి నృత్తరూపకములను ప్రదర్శించిరి.

శృంగార రసాలంబనకారులగు నాయిక, నాయకుడు, సఖి, దూతిక మొదలగు వారి లక్షణములకు లక్ష్యములుగ నుదహరించుటకు కొన్ని యష్టపది లిచ్చట పొందుపరచబడినవి. విరహార్తియగు రాధ నూరడించుటకు ఆమె చెలికత్తె ఈ యష్టపదియందు శ్రీకృష్ణుని విహారములను వర్ణించి, రాధను శ్రీకృష్ణుని చెంతకుబోవ ప్రేరేపించును. దీనియందు నాయిక ప్రౌఢ, నాయకుడు అనుకూలుడు.

వసంత రాగము

ఆదితాళము

లలిత లవంగ లతాపరిశీలన కోమల మలయ సమీరే
మధుకర నికరకరమ్బిత కోకిలకూజిత కుఞ్జకుటీరే,
విహరతి హరి రిహ సరసవసన్తే నృత్యతి.
యువతిజనేన సమంసఖి! విరహిజనస్య దురన్తే ధృవం.
ఉన్మద మదన మనోరథ పథిక వధూజన జనితవిలాపే
అలికుల సంకులకుసుమ సమూహ నిరాకుల వకుల కలాపే. 2.

మృగమద సౌరభ రభస వశంవద నవదళమాల తమాలే
యువజన హృదయ విదారణ మనసిజ నఖరుచి కిం శుకజాలే 3.

మదన మహీపతి కనక దణ్డరుచి కేసరకుసుమ వికాసే
మిళిత శిలీముఖ పాటలపటలకృత స్మరతూణవిలాసే 4.

విగళిత లజ్జిత జగదవలోకన తరుణ కరుణ కృతహాసే
విరహి నికృంతన కుంతముఖాకృతి కేతకదంతురితాశే 5.

మాధవికా పరిమళలలితే నవమాలతి జాతి సుగంధౌ
మునిమనసా మపి మోహనకారిణి తరుణాకారణ బంధౌ 6.

స్ఫురదతి ముక్తలతా పరిరంభణ ముకుళిత పులకితచూతే
బృందావన విపినే పరిసర పరిగత యమునాజల పూతే 7.

శ్రీ జయదేవ భణితమిదమిదయతి హరిచరణ స్మృతిసారం,
సరసవసంత సమయ వనవర్ణనమనుగత మదన వికారం 8.

శృంగార కనిత అంగహారములు కలిగిన లాస్యప్రయోగమున కీ యష్టపదిని లక్ష్యముగ గ్రహింపదగును.

రామప్రియారాగము

యతితాళము.

చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళిచలన్మణి కుండలమండిత గండ యుగస్మిత శాలీ
హారిరిహ ముగ్ధవధూనికరే - విలాసిని విలసతి కేళిపరే.
ధ్రువం. 1

పీనపయోధర భారభరేణ హరిం పరిరభ్య సరాగం
గోపవధూ రనుగాయతికాచి రుదంచిత పంచమరాగం
హారిరిహ ... ... కేళిపరే. 2

కాపివిలాస విలోల విలోచన ఖేలనజనిత మనోజం
ధ్యాయతి ముగ్ధవధూరధికం మధుసూదన వదన సరోజం
హారిరిహ ... ... కేళిపరే. 3

కాపికపోలతలే మిలితాలపితుం కమపి శ్రుతి మూలే
కాపిచుచుమ్బ నితంబవతీ దయితం పులకై రనుకూలే
హారిరిహ ... ... కేళిపరే. 4

కేళికళా కుతుకేని చ కాచిదముం యమునాజల కూలే
మంజుల వంజుల కుంజగతం విచకర్ష కరేణ దుకూలే
హారిరిహ ... ... కేళిపరే. 5

కరతలతాళ వలయావళి కలితకలస్వన వంశే
రాసరసే సహనృత్యపరాహరిణా యువతిః ప్రశంసే
హరిరిహ ... ... కేళిపరే. 6

శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపిరామాం
పశ్యతి సస్మిత చారుతరామ పరా మనుగచ్ఛతి వామాం
హరిరిహ ... ... కేళిపరే. 7

శ్రీజయదేవభణిత మిదమద్భుత కేశవ కేళిరహస్యం
బృందావన విపినే లలితం వితనోతు శుభానియశస్యం
హరిరిహ ... ... కేళిపరే. 8

శోఢలదేవుని పుత్రుడగు సారంగదేవుడు "సంగీత రత్నాకరము" అను లక్షణ గ్రంథమునందు భిన్న దేశి నాట్యసంప్రదాయములలోని విశిష్టగుణములను స్వీకరించెను. ఆయన, నర్తనమును లౌకిక ధర్మమనియు, నాట్యధర్మమనియు రెండు పద్ధతులుగ విభజించెను. అప్పుడు ఉత్తరదేశ సంప్రదాయమునకు శోమేశ్వరమతమని, దక్షిణదేశ సంప్రదాయమునకు హనుమాన్ మతమని ప్రసిద్ధి యుండినట్లు మరికొన్ని నిదర్శనముల వలన తెలియుచున్నది. లౌకికధర్మము, నాట్యధర్మము క్రమేపి తరువాత కాలమునందువచ్చిన లక్షణ కర్తలవలన లోకధర్మి యనియు, నాట్యధర్మియనియు జెప్పబడినట్లు గానబడుచున్నది. వీటిలో బ్రహ్మవృత్త్యాత్మకమైన విన్యాసములతో గూడిన నాట్యమును నాట్యధర్మమనియు, లోకవృత్తానుకరణ పురస్సరముగ జేయు నాట్యమును లోకధర్మమనియు నిర్ణయించిరి.

సారంగదేవుడు, భరతముని పేర్కొనని 36 కారణలు దెలిపెను. ఆయన 24 అసంయుత హస్తములు, 13 సంయుతహస్తములు పేర్కొనెను. నృత్తహస్తములు, రోమ్ముభేదములు, చాలన ములు 55 వివరించెను. ఆయన 108 కారణలు. 16 అంగహార ములు, 6 పురుషస్థానకములు, 7 స్త్రీ స్థానకములు దెలిపెను. నర్తనమును భారతి, సతివతి, ఆరభటి; కైశికి, అను నాలుగు వృత్తులుగ విభజించెను. దేశిలాస్య లక్షణమును ఆయన వివ రించెను. ఆ కాలమున నాట్యకూటమందలి సభ్యులకు ఆచా ర్యుడు, నటుడు, నర్తకుడు, వైతాళికుడు, చారణ, కోల్హహా టక యను నామధేయము లుండినట్లు దెలిపెడి నిదర్శనము లున్నవి. రసపరిచ్ఛేదమునందు భిన్నరసములు వాటిభేదములు విపులీకరించబడినవి. ఆయన 33 వ్యభిచారీ భావములను క్రోడీ కరించెను.

కాకతీయుల కాలమునాటికి దేశమునందు బహుళముగ వ్యాపించిన దేశినాట్యపద్ధతులలోని కొన్ని సంప్రదాయములను అప్పటి సూత్రకారులు మార్గదేశి పద్ధతులుగ పరిగణనజేసిరి. జాయసేనాపతి రచించిన "నృత్తరత్నావళి"యందు కుండలి చిందు, అను రెండు దేశి నాట్యస్వరూపములు నిర్వచనము చేయబడినవి. విద్యానాధుడు రచించిన "ప్రతాపరుద్రీయం" అను అలంకార గ్రంథము నాట్యాలంకార శాస్త్రములకు ప్రామాణికమైనది. విద్యానాధుడు రచించిన అలంకారశాస్త్ర ము, ప్రాచీనాలంకారికులకు దండి, మమ్మటుడు, అభినవగుప్తుడు

విద్యాధరుడు, జగన్నాధ పండితుడు, అప్పయ్య దీక్షితుడు మున్నగువారి రచనలకంటె శైలియందును, విషయ వివరణము నందును శులభ స్ఫోరకముగ నున్నదని జెప్పవచ్చును. విభావ అనుభావ, సాత్విక, వ్యభిచారీ భావములు కలిగిన స్థాయీ భావమే రసమని విద్యానాధుడు నిర్వచనముచేసెను. ప్రధాన రసములగు శృంగార, హాస్య, రౌద్ర, కరుణ, వీర, భీభత్స, భయానక, అద్భుత, శాంతరసములు, వీటి స్థాయీ భావము లగు రతి, హాసిత, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జిగుప్స, విస్మయ, శమాదిగుణములు మున్నగువాటిని విద్యానాధుడు సమగ్రముగ చర్చించెను.

గోవింద మంత్రి "రాగతాళ చింతామణి" యను నాట్య శాస్త్ర గ్రంథమునందు నృత్యగీతాది వాద్యములను గురించి వివరించెను. దీనిలో శ్రుతిజనకములైన త్రిస్థానములు, గాంధర్వ భేదలక్షణములు, దేశిరాగోత్పత్తి, శ్రుతిజాతి లక్షణము, శుద్ధ స్వర వికృతస్వర నిరూపణము. వాది సంవాద్యాది చతుర్విధ లక్షణములు, సప్తస్వర రూపము సాంగోపాంగముగ దెలుప బడినవి. గానమునకు ఇది లక్షణ గ్రంథముగ నున్నది.

# దేవదాసీ వ్యవస్థ

దక్షిణదేశమున విగ్రహారాధన మేర్పడి దేవాలయములు కట్టిన వెనుక, అచ్చట దేవతారాధనమునకు నాట్యమొక విశిష్టాంగమైనది. నాట్యముకొరకు ప్రత్యేకముగ కొందరు స్త్రీలు గుడి సేవకై నియమించబడిరి. వారినే దేవదాసీలని గుడి సానులని వ్యవహరించిరి. తూర్పుగోదావరి జిల్లాయందలి ద్రాక్షారామమను గ్రామమున ఇట్టి దేవదాసీలు యుండినట్లు తెలియుచున్నది. పూర్వకాలమునందు గుడి సేవకు వంశ పారంపర్యముగ జేసిన దేవదాసీలలో కొందరు "గుడిసేవ" అను ఇంటిపేరు గలవారు యుండిరనిగూడ స్పష్టమగుచున్నది. ద్రాక్షారామమున నివసించిన దేవదాసీలకు, మరికొన్ని ప్రాంతములందున్న వారలకు పెదముమ్మారు సానులని, చినముమ్మారు సానులని రెండు శాఖా భేదములున్నవి. బహు ప్రాచీన కాలమునుండియు నృత్యగానాభినయము,కళలు వీరినాశ్రయించి వర్ధిల్లినవి. దేవదాసీలు ఈ కళలయందేగాక సాంఘికముగ గూడ ఉన్నతస్థానము పొందియుండిరి. ప్రాచీనకాలమున మండలేశ్వరులు వీరినుండియే కన్యకలను గ్రహించి వివాహమాడెడి ఆచారము ఉన్నది. వీరినుండి ముమ్మాటి కులమని ఒకక్షత్రియ కులము బయలుదేరినది. వీరికి స్వయముగ నాణెములు వేయించి తూనికలు నియమించు అధికారముండెడివి. కాని నాట్యకళా పోషణమే వీరి ప్రధానవృత్తి.

భరత శాస్త్రి కోవిదులగు భాగవతులు, భాగవతాచులు మున్నగువారివద్ద దేవదాసీలు సుకుమార అంగహారములు కలిగిన శృంగార రసపూరితమైన సప్తవిధలాస్యనృత్తులను అభ్యసించిరి. అలంకారాది అభినయ శాస్త్రములు, గీతాదిగానములు నేర్చిరి. రమణీయమైన అభినయముతో, మధురగానముతో వారు శ్రోతలకు తన్మయత్వము కలిగించిరి.

దేశమందలి దైవ పూజామందిరములు దేవదాసీల నృత్తగీతాగానములకు ఆటపట్టులైనవి. దేవతలు ఎక్కడ పూజింపబడిరో వారు అక్కడ నర్తనమునుచేసిరి. వెన్నిస్ నగర వాసియగు మార్కోపోలో అను యాత్రికుడు క్రీ. శె. 1293వ సంవత్సరమున దక్షిణదేశమునకు వచ్చినపుడు ఆకాలమునాటి దేవదాసీలను గురించి ఇట్లు వ్రాసెను.

"స్త్రీ పురుష దేవతారాధనము జరిగెడి కొన్ని బౌద్ధ దేవాలయములందు, కొందరు బాలికలు దైవసేవకు అంకితము జేయబడిరి. ఆ బాలికల తల్లిదండ్రులు వారిని ఆకర్షణీయమగు దుస్తులతోడను, ఆభరణములతోడను సర్వాంగ సుందరముగ నలంకరించి, దేవాలయములకు గొనివెళ్ళివారికి ప్రియతమమగు దేవతలకు శ్రద్ధాభక్తులతో నంకితము జేసిరి. బౌద్ధమతాచార్యులు వారిదేవతలకు విందుచేయునపుడు అట్టి కన్యకలనందరిని ఆహ్వానించెదరు. అప్పుడు వారందరును దైవసమక్షమున నృత్యగీతాగానములు చేయుదురు. ఇట్టి ఉత్సవములను వారు మిక్కిలి వైభవముగ జరుపుదురు. ఆకన్యకలు దేవాలయ

మునకు వెళ్ళినపుడు ఫల, మధుభక్ష్యములను తెచ్చి దైవ నివేదనము జేసి పిమ్మట నాట్యము నారంభింతురు. నాట్య నృత్యగానములు సమాప్తమగు సంతవరకును వారు దెచ్చెడి కానుకలను దైవసాన్నిధ్యము నందుంచెదరు. నాట్యానంతరము వారు తిరిగి వాటిని తీసికొను నప్పటికి దైవమువాటిని పరిగ్రహించునని వారి విశ్వాసము. ఈ కన్యకలకు వివాహమగు పర్యంతము వారిట్టి దైవోత్సవములందు బాల్గొనుటవారికి సంప్రదాయ సిద్ధమగు కట్టుబాటు. ఇట్టిఉత్సవములను సంవత్సరము నం దనేకమారులు జరుపుచుందురు.

"పురుష దేవతలకు వారి భార్యలందు విసుగు జనించి వైముఖ్య మేర్పడుననియు, అందువలన ప్రజలు దైవకృపకు దూరస్థు లగుదురనియు వారి విశ్వాసము. దైవదంపతులయందు కలిగిన వైమనస్యమును దొలగించి వారికి వారి పరస్పరరాగోదయను కలిగించుటకు దైవసమక్షమునందు కన్యకలు నగ్న రూపమున నాట్యము చేయుదురు. అప్పుడు దైవము చిత్తశాంతిని పొంది ప్రసాదదృష్టితో సంఘ జీవులను ఆశీర్వదించునని వారి నమ్మకము."

మహమ్మదీయులు దేశముపై దండయాత్రలు జేయు కాలము నాటికి దేవదాసీలకు దైవసేవయందు శ్రద్ధాసక్తులు క్షీణించినవి. వారికి భోగలాలసత్వము కలిగినది. క్రమేపి వారు దేవాలయ వృత్తులు మానుకుని రాజాస్థానములు ప్రవేసించి కులవిద్యయగు నాట్యకళను పరిరక్షించుచుండిరి. కాని రాజస్థాన

ప్రవేశము అందరికిని లభ్యముగాకుండెను. అందువలన వారులో అనేకమంది సామాన్యప్రజానీకములో స్థానమేర్పరచుకుని జనాదరణము పొందిరి. దేవదాసీలు క్రీ. శ. 13వ శతాబ్ద మధ్యకాలమునుండియు కళావంతులను ప్రత్యేకశాఖగ నేర్పడిరి. అప్పటినుండియు కళావంతులు సంఘమునందు ఒక ప్రత్యేక స్థానము కలిగి వర్ధిల్లిరి.

## రాజస్థాన దేవదాసీలు

చోళరాజుల కాలమున రాజాస్థానమునందు 10,000మంది దేవదాసీలు యుండిరనియు,వారిలో ప్రతిదినమూ 3000 మంది వంతుల ప్రకారము ప్రతి నిత్యము రాజునకు కొలువు చేయుచుండిరనియు తెలియుచున్నది. రాజప్రాసాదములందు విందు జరుపుటకు పూర్వము రాజసింహాసనమున కెదుట రాజకుమారుడును నలుగురు ప్రధాన మంత్రులు రాజభక్తి ప్రమాణమును స్వీకరించిన పిదప, విందునకాహ్వానింప బడిన అతిధుల సమక్షమునందు నృత్యగానాది ప్రదర్శనములుజరుపుట వారి కాచారముగ నుండెను.

రెడ్డిరాజుల కాలమునందు కొండవీటిప్రభువు కుమరగిరి రెడ్డి కొలువుకూటమున లకుమాదేవియను సుప్రసిద్ధ నర్తకి యుండినట్లు తెలియుచున్నది. నృత్త, గీతాభినయములందు ఆమె ప్రతిభావంతురాలై భాసించినది.

ఆమె రాజసత్కారములను పొందినది. అప్పుడు దేవదాశీలు కౌర్యత్రికమందు ప్రతిభా సంపన్నులై యుండిరి. నాట్యప్రయోగములందు వారు మహ్మదీయకాంత లుపయోగించెడి 'పైజామాలను'లను పట్టు జాకెట్లను ఆహార్యముగ నుపయోగించిరని తెలియుచున్నది.

విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన రాయల కాలమున దేవదాసీలు మహదైశ్వర్యవంతులై, సకల శుభోప భోగములును కలిగి సామాజికులవలన మన్ననలందు చుండిరి. రాజసభా భవనములందు ధరణీపతుల సన్నిధిని, వారు నాట్యాభినయ ప్రయోగములు గావించి ప్రాకృతి పండితుల ప్రశంసలు బొందిరి. అట్టి గరిమా మయమైన నాట్యకళను,నుసంపన్నములగు శాస్త్రములను వారుక్రమేపి పరిత్యజించి నాట్య కళకు న్యూనతను కలిగించిరి. ఏ నాట్యకళాభి నివేశమందలి అభినయచాతుర్యముచేత వారు జనుల కానందము కలిగించిరో అట్టి దైవప్రియంకరమగు నాట్యమును విడనాడి తమ హావభావ విలాసములను కామోద్దీపనమునకు వినియోగించి నిత్యభోగినులైరి. నాటి దేవదాసీల సాంఘికస్థితిని గురించి "పెయస్" అను చరిత్రకారుడిట్లు వ్రాసెను.

కాలక్రమాను గతమున, దేవదాసీలకు సంఘములో గల గౌరవము నసించినది. వారు నైతికముగ పతనము పొందిరి. అయినను సంఘము వారిపట్ల యౌదార్యమునే జూపినది. వారు సాధారణముగ నగరములలోని పెద్ద వీధులలో, అందురు

నాకేపీథియందు విశాలమగు భవనములలో నివసించిరి. ఆనాడు ఉత్తమవంశస్థులు గూడ వారి ఇండ్లకేగుట యాచార ముగ నుండినది. కాని వారిని సంఘము న్యూనతతో జూడ లేదు. వారికి ఎట్టి గౌరవలోపమును సంఘమునందు కలుగలేదు. దేవదాసీలకు అన్ని వేళలందును రాజాంతఃపురములందు ప్రవే శించుటకు అధికారమున్నది. వారు పట్టమహిషులతో స్వేచ్ఛ గా దిరుగుచు తాంబూలచర్వణము చేయుచుండిరి. రాజాంతః పురములందీ చనవు, స్వాతంత్ర్యము ఒక్క దేవదాసీలకు మాత్రమే యున్నది.''

శ్రీకృష్ణదేవరాయలుకాలమున దేవదాసీలు మహానవమి నాడు విజయభవనమునకు వెళ్ళి ప్రభుసన్నిధిని నాట్యము, చేయుటవారికి యాచారముగ నుండినది. రాజాస్థాన మర్యా దలు పొందిన దేవదాసీలు మహదైశ్వర్యములతో తులతూగిరి. వారు వజ్ర, వైడూర్య, మరకత, మాణిక్యములతో పొదిగిన మంజీరములను, కంఠాభరణములను, కంకణములను, వడ్డాణ ములను నుపయోగించిరి. నివసించుటకు రమ్యముగ నలంకరిం చిన భవనములును, గ్రాసమునకు కొదువలేకుండగ భూవసతు లను వారు కలిగియుండిరి. వారికి పురుష సేవకులును స్త్రీ పరిచా రికలునుయుండిరి. రాజాంతఃపురములకు బోవుటకు,వారు రాజుల చేత బహూకరించబడిన పల్లకీల నుపయోగించిరి. సకలాభరణ భూషితులై పల్లకీలయందు గూర్చుని, పరిచారికా జనము ముందు నడువగా, బిరుదువాద్యములతో రాజసభాభవనము

లకు, అంతఃపురములకు మహావైభవములతో వారు బోవు చుండిరి.

విజయనగరములో కట్టించిన హజార రామాలయము, విజయభవనములందలి శిల్పకళా సంపదను పరిశీలించిన యెడల ఆ కాలమున దేవదాసీలు ధరించిన ఆభరణములు, వస్త్రాలంకరణ విధానములు తెలియును. హజారరామాలయ ప్రాకారమునకు బయటివైపునను, సింహద్వారమువద్దను, కొన్ని స్తంభములమీదను, వివ స్త్రలగు నాట్యకత్తెల చిత్తరువులు చెక్కబడియున్నవి.

దేశములో నృత్యగానాభినయ కళలు దేవదాసీలవలననే యభివృద్ధి గాంచినవి. ఆయా కళలను వారే అభ్యసించి, వంశ పారంపర్యముగ ననుసరించి, ఎల్ల కాలములందును రసజ్ఞలోకమును మెప్పించి, విటవరుల ప్రేమను అవిరళముగ ననుభవించిరి. మహానవమినాడు, రథోత్సవములందు, ప్రతి శనివారమునా డాలయములందు, వారు నృత్య, నాట్యప్రయోగములు గావించుట వారి యాచారముగ నుండెను. పూర్వ నాట్య ప్రయోగములను, వాటి స్వరూపములను తెలుసుకొనుటకు విఠలస్వామి ఆలయము, విజయభవనమునందలి శిల్పములు మనకు అత్యంతము ప్రయోజనకరముగ నున్నవి. వీటిలో కొన్ని శిల్పములందు భరతాచార్యుడు నట్టువరాండ్లకునాట్యాభినయమునందు, భంగిముల సాధనమునందు శిక్షణ మిచ్చుచుండుట గానుపించుచున్నది. బ్రహ్మేశ్వరాలయమందలి నాట్యా

చార్యుని పోషణాదికముల క్రింద క్రీ. శ. 1518 వ సంవత్సరం జనవరి 25 వ తేదీనాటి శాసనమువలన కృష్ణదేవరాయలు, రెండు గ్రామములు ఆయనకు వ్రాసి యిచ్చినట్లు స్పష్టమగుచున్నది. హజారరామాలయము, విజయభవనము లందలి శిల్పములలో పెక్కు తావులందు కోలాటము మొదలగు నాట్యములు చెక్కబడియున్నవి. ఈ కోలాటములను ఆదిలో ఎవరు ఏర్పరచినదియు, ఎప్పుడేర్పడినదియుగూడ స్పష్టముగ దెలిపెడి యాధారములు లభించుటలేదు. కాని వీటిని దేవదాసీలే, నాట్యాచార్యులవద్ద, ఏర్పరచుకుని అభ్యసించి యుండవచ్చును. అచ్చటి వివిధశిల్పఖండములును, అపూర్వమగు అభినయకళా కౌశలమును ప్రదర్శించుచున్నవి. ఆనాడు వారు వివిధ నాట్యప్రయోగములను రాజులయెదుట, దేవేశుల సముఖమున జరిపినట్లు పైన నుదహరించిన శిల్పములలో కొన్నిటి వలన స్పష్టమగుచున్నది.

క్రీస్తుశకము పదమూడవ శతాబ్దమందలి ద్వితీయార్ధమునందు దక్కనులోని దౌలతాబాదు నగరమునకు వచ్చిన 'ఇబిన్‌బూటా' అను విదేశయాత్రికుడు, నగరమంతయు దేవదాసీల నృత్యగీతా గానములతో ప్రతిధ్వనించుచు ఆనంద తుందిలమై యొప్పారెనని దెల్పెను. వారి యాచార సంప్రదాయములను గురించి ఆయన ఇట్లు వ్రాసెను.

"నాట్యమును జేసెడి విలాసవతు లందరును నగరమధ్యమునందున్న యొక విశాలమగు వీధిలో పెద్దభవనములందు

నివసించిరి. వారి గృహముల ముందరిభాగమున రమ్యముగ తివాలసీతో నలంకరించిన దుకాణములున్నవి. వారి భవనములలో ప్రవేశించుట కీ దుకాణములనుండి యొక ద్వారమున్నది. దుకాణమధ్యమునం దమర్చబడిన ఊయలపై సర్వాంగ సుందరియగు నొక దేవదాసీ యువతి ఆసీనురాలై యుండును. పరిచారికలు ఊయల నూపుచుందురు. వారి వీధి మధ్యభాగ మందున్న విశాల ప్రదేశమునందొక పెద్దగుడారమును నయనానందకరముగ అలంకరించి, అందులో తివాశీలు పరచియున్నవి.తివాశీలపైన నిడుపుగల ఉపధానము లమర్చియుంచిరి. ప్రతి గురువారము, సాయంసమయ ప్రార్థనానంతరము నాలుగు గంటల వేళకు నాట్యాచార్యు డీ గుడారమునకు వెళ్ళును. ఆయన ప్రార్థనమున కేగునపుడును, నాట్యభవనమున కేగునపుడును, సేవకులు, బానిసలు, దారి చూపుచుండగా ఆయన బయలు వెడలును. ఆయన గుడారమునకు చేరినవెంటనే నాట్యాంగన లందరును గుంపులుగా వెళ్ళి ఆయన ఎదుట నాట్యము చేయుదురు. సూర్యాస్తమయ కాలమున ఆయన బయలుదేరు వరకును వారు నాట్యాభినయ విన్యాసములు గావించు చుందురు.

"వీరు నివసించు వీధి చివరభాగమున మహాల్వీల ప్రార్థనల కనుకూలముగ కొన్ని మసీదులున్నవి. అక్కడ రంజాన్ నెలలో వారు 'తరావీ' పఠించెదరు. హిందూరాజు లెవరైనను ఆ వీధివెంట బోవునపుడు వీధి మధ్యమున నిర్మించిన గుడార

మునందు కొంత తడవు విశ్రమించి నాట్యకేళి యందు నోలలా డుదురు. వారి రాకనెరిగిన వారకామినులు గుడారమునకు వెళ్ళి నృత్యనాట్య ప్రదర్శనములతో వారి నుల్లసితుల గావింతురు. ఇది వారి యాచారమై యున్నది. వారి వీధినుండి వెళ్ళెడి మహమ్మదీయ సుల్తానులు గూడ ఆ గుడారమునకు వెళ్ళుట, వారిని పణ్యాంగనలు తమ నాట్య ప్రదర్శనములతో సన్మా నించుట యొక సంప్రదాయమై యున్నది."

గురుశిక్షణమువలన, సాధనవలన దేవదాసీలు అభ్య సించిన నృత్యగానాభినయ కళలు క్రమక్రమముగ తొల్లిటి ఉదాత్త గుణసంపదను గోల్పోయినవి. రాజసభాగౌరవమును పొందిన భరతశాస్త్ర విద్య, సామాన్య ప్రజావినోదముగ బరిణ మించి వీధికెక్కినది. దేవదాసీలు కళావంతులనియు, భోగము వారనియు వ్యవహరించబడిరి. వారి నాట్యమునకు భోగమాట యను పేరు వచ్చినది. ధనవంతుల ఇండ్లలో జరిగెడి వివాహాది శుభకార్యములకు వారిని పిలిచి వారిచేత నాట్యము చేయిం చుట యొక ఆచారముగ పరిణమించినది. గృహప్రవేశాది శుభసమయములలోగూడ వారిచేత నాట్యమును జేయించిరి.

ఆంగ్లేయుల పరిపాలనా కాలమున నేలనాలుగు చెర గుల పాశ్చాత్య నాగరకతా ప్రభావము ప్రసరించినది. ప్రజ లలో నైతిక పతనము ప్రవృద్ధమగుటకు కళావంతులే కారణ మని, పాశ్చాత్య విద్యావంతులు నిర్ణయించి దేశమున నాట్య బహిష్కారోద్యమమును లేవదీసిరి. ఈ ఉద్యమమువలన

వారు సంకల్పించిన నైతిక పునరుద్ధరణము చెప్పకోతగినది కనుపించక పోయినను, కళావంతులు నాట్యకళను సంపూర్ణముగ బహిష్కరించుట మాత్రము ఏర్పడినది. వారిలో పొడసూపిన సంస్కారేచ్ఛ ననుసరించి వారు వివాహములు చేసుకొనుట కారంభించిరి. కాగా నాట్యకళ తన ఆలంబనమును గోల్పోయినది.

ఖిలమైపోయిన నాట్యశాస్త్రములను, సంప్రదాయములను ఉద్ధరించిన కీర్తిప్రతిష్టలు తెలుగు దేశమందలి భాగవతులకు దక్షిణ దేశమందలి భాగవతార్ లకు దక్కినది. నవయుగమునందు గోచరించిన చైతన్యము నాట్యకళయందు గూడ ప్రతిబింబించినది. నాట్యకళ సంపన్న గృహస్థుల నాకర్షింపగా వారి యాదరమున కులీనలు నాట్యశాస్త్రము నభ్యసించుట యేర్పడినది సంఘమునందు తిరిగి నాట్యకళా గౌరవము అతిశయించినది.



# ఆంధ్ర కర్ణాటకమున నాట్యకళా వ్యాప్తి

ఆంధ్ర కర్ణాటకము పరిపాలించిన రాష్ట్రి చాళుక్యులు 1 వ పులకేశి నాయకత్వముక్రింద ఉత్తరదేశమునుండి వచ్చి దక్కనుదేశమును ఆక్రమించుకొనిరి చాళుక్యరాజు అశ్వమేధ యాగమును జేసెను. ఆ వెనుక రాజ్యము పాలించిన రెండవ పులకేశి మహాయోధుడు. ఆయన ఉత్తరదేశమును ఏలిన హర్షుని సమకాలికుడు. రెండవ పులకేశి సమీపమందలి చిన్న రాజ్యములను జయించి సామ్రాజ్యాధిపత్యమును నెలగొల్పుటకు కృషిచేసెను. హర్షుడు, దక్షిణదేశముపై దండయాత్ర చేసినపుడు, పులకేశి అతని నర్మదానది యొడ్డుననే తిరోగమించునట్లు జేసెను. పల్లవులు పరిపాలించిన వేంగిదేశమును పులకేశి జయించెను. ఆయన కాలమున చాళుక్యులు సామ్రాజ్యాధికారము ననుభవించిరి. ఆ కాలమునాటి అజంతాశిల్పములు ప్రాచీనకళా ప్రాభవమును, లాసికా భంగిమలను, నాట్యశాస్త్రి విజ్ఞానమును బ్రస్ఫుటము గావించుచున్నవి.

అప్పుడు హోయశాల రాజులు, ద్వారసముద్రమును రాజధానిగ జేసికొని దేశమును పాలించిరి. విష్ణువర్ధనుడు చాళుక్యులను ఓడించెను. ఆయన జైనమతావలంబి. కాని వైష్ణవ మతప్రవక్తయైన రామానుజాచార్యుని యుద్బోధనము వలన, విష్ణువర్ధనుడు వైష్ణవమతమును స్వీకరించెను. ఆయన

వైష్ణవాలయములు కట్టించెను. దక్షిణదేశమందలి ప్రాచీన తమిళ రాజ్యములగు చేర, చోళ, పాండురాజ్యములను విష్ణువర్ధనుడు జయించెను. వారి వెనుక కాకతీయులు క్రీ.వె. 1000 నుండి క్రీ.వె. 1323 వరకును దేశము నేలిరి. వీరి కాలమునందే "జాయసేనాపతి" "నృత్తరత్నావళి" యను నాట్య లక్షణ గ్రంథము వ్రాసెను. అప్పటికి దేశమందు విరివిగ ప్రచారము గాంచిన వివిధదేశి నాట్యపద్ధతులలో గొన్నిటిని, నాట్యసూత్రకారులు పరిగణనజేసి, వాటినిగూడ మార్గదేశి నృత్తులలో నుటంకించిరి. "నృత్త రత్నావళి"లో ఇట్టి మార్పు గానవచ్చుచున్నది.

## రెడ్డిరాజుల కాలము

రెడ్డిరాజులు క్రీ. వె. 1325 నుండి క్రీ. వె. 1448వరను రాజరికము చేసిరి. వారికాలమున తెలుగుసీమ ప్రజల నాకర్షించిన వివిధవినోదములు అప్పటి సాంఘిక, వైజ్ఞానిక పరిస్థితుల కనుగుణముగ రూపులు దిద్దుకొనినవి. వారి కోరికలు. ఆశలు, ఆశయములు మొదలగు నవన్నియు భిన్న కళాసృష్టులందు ప్రతి బింబించినవి. సంఘములోని వివిధ తరగతుల ప్రజలకు వారి సంభావనీయతకు సముచితములగు వినోదములు ప్రచారమందుండినట్లు తెలియుచున్నది. గ్రామములందు వసించెడి సామాన్యజనులు "దొమ్మరిసానుల" ప్రదర్శనములు జూచియు భాగవతుల వీధినాటకములు జూచియు, వినోదించిరి. ఆనాడు

సాతానులు ఏకతారలను చేతధరించి, పాడుచు ఉషఃకాలము లందు ప్రతినిత్యము భిక్షాటనమునకై గ్రామములందలి ప్రతి గృహమునకు బోవుటయొక ఆచారము. అదేవారి వృత్తియై యున్నది. సర్వసామాన్యముగ జంగం కధలు, జానపద నృత్యములు. తోలుబొమ్మలాటలు, గ్రామస్తులకు ప్రధానవినోదము లైనవి. వీటియందు వారికిగల ఆసక్తి అగ్గలముగ నుండెను.

గ్రామదేవాలయములు ప్రాచీన భారతీయ సంస్కృతికి మూలాదారములు. దేవాలయములేని గ్రామము ఒకటియు కనపడదు. సాధారణముగ గ్రామములలోని దేవాలయములు దైవపూజాదికములకే గాక, లోకానుకరణ లౌకిక విషయక చర్చలకు, విజ్ఞానవినోదములకుగూడ నవి గ్రామస్తులకు వేదిక లైనవి. దైవకళ్యాణమును జరుపుటయందు వారికిగల శ్రద్ధా భక్తులు అపారము. ఆయా దేవాలయములవల్ల వార్షికములు బొందెడి భాగవతులు వచ్చి కళ్యాణోత్సవమునందు నాటక ప్రదర్శనములు జరుపుట ఆచారమైయుండినది.

ఆ కాలమునందు రాజులు గానకళను పోషించిరి. ధన వంతులుగూడ గానకళను పోషించి ఆదరించుట యాచారముగ నుండెను. ఆనాడు రాజన్యులనేకులు స్వతఃసిద్ధముగ గొప్ప గాయకులైయుండిరి. అందువలననే సంగీత కళ రాజసత్కార గౌరవము గాంచినది. సురభిరాజ వంశస్థుడైన ప్రతాపవీర గంగరాజు, పోతపిట్టల వంశస్తుడు క్రిష్ణదేవుడు, చాళుక్యవంశము నకు జెందిన విశ్వేశ్వరుడు మున్నగువారు సంగీతశాస్త్రపారం

గదులని తెలియుచున్నది. కొండవీడు అయిదవరాజు పెదకోమటి వేమారెడ్డి గాన కళాప్రవీణుడు. ఆయన "సంగీత చింతామణి" యను సంగీత శాస్త్రగ్రంథము రచించెను. దేశి వృత్తమునకు సంబంధించిన కొన్ని భాగములుగూడ ఆయనరచనలో నున్నవి. ఒకటవ బుక్కరాయలుపుత్రుడు మొదటి దేవరాయలు కొంత కాలము ఉదయగిరి మండలేశ్వరుడుగ నుండెను. సంగీత శాస్త్రమునందాయన ప్రతిభాశాలి. రేచర్ల వంశమునకు జెందిన రెండవ సింగప్రభువు సారంగదేవుని "సంగీత రత్నాకరము" నకు "సంగీత సుధాకర" యను వ్యాఖ్యానము వ్రాసెను. విక్రమార్కచరిత్రమునకు కృతిపతియైన జిన్నయ సిద్ధామాత్యునకు "సంగీతకళా దోహల" యను ప్రసిద్ధబిరుద మొకటి యుండెనని కొన్ని నిదర్శనములు స్పష్టీకరించుచున్నవి.

సంగీత కళయందు ఆంధ్రులకు గల ఆసక్తి, వారికి జన్మతః లభించిన పురాసుకృత విశేషము. వారు "ఆంధ్రి" అను ఒక రాగమును తమ జాతిపేర సంగీతశాస్త్రమున కల్పించుట సహేతుకముగనున్నది. మాతంగముని వ్రాసిన "బృహద్దేశి" యను శాస్త్రగ్రంథము నందీవిషయము చేర్కొనబడినది. మాలవపంకరాగమునకు చెప్పిన ఆరు రాగిణులందు ఆంధ్రి యొకటై యున్నదని తెలియవచ్చుచున్నది.

రెడ్డిరాజుల కాలమున జంత్రగాత్ర విద్యలు రెండును అభివృద్ధిపొందినవి. సంస్కృత లక్షణ గ్రంథములందు పేర్కొనబడిన రాగములు, తాళములు, యీ కాలమునందు వెలువడిన

పండితారాధ్య చరిత్ర, బసవపురాణము మున్నగు గ్రంథము లలో నుదహరించబడినవి. అప్పుడు ప్రచారమందున్న వివిధ భేదములు గల వీణలుగూడ చెప్పబడినది. కొన్ని శాసనము లలోగూడ కామకవీణ, బ్రహ్మవీణ యనునవి ఉదాహరించ బడినట్లు తెలియుచున్నది. పైన దెలిపిన సంగీత శాస్త్ర గ్రంథము నం దుపయోగించిన కొన్ని దేశిప్రయోగములవలన దేశిరాగ భేదములనుగూడ శిష్టులు మార్గదేశిపద్ధతికి ప్రామాణికములుగ నంగీకరించినట్లు విశితమగుచున్నది. తానకరాగము లేకుండగ గీతము సామాజకులను రంజించలేకపోయినది. జతి గీతములు, శూలాది గీతములు, శుద్ధాదిగీతములు ప్రచారమందుండి నట్లు తెలియుచున్నది. పదహారవ శతాబ్దియందు జీవించిన తాళ్ళ పాక తిరుమలయ్యపదములు విశేషముగ ఖ్యాతిగాంచినవి. దేశి, సంస్కృత ప్రాకృతములలో సరళపదరచన చేయవచ్చునని ఆయన నిరూపణము జేసెను.

ఆ కాలమున ప్రభాతపదములు, తుమ్మెద పదములు ఆనందపదములు, పర్వతపదములు, సంకరపదములు, నివాళి పదములు, గొబ్బిపదములు, విలాసపదములు, వెన్నెలపదములు మొదలగునవి ప్రచారములో నున్నవి. వీటిలో తుమ్మెదపద ములు, గొబ్బిపదములు, విలాసపదములు, వెన్నెలపదములు, నేటికిగూడ పల్లెలందలి పడుచులు, పాడుచుందురు. ధవళములు, మంగళగీతములు, కళ్యాణగీతములు, ప్రత్యేక సందర్భములందు మాత్రము పాడెదరు. సంగీత వాద్యములలో

మురజ, అవాజ, కాహళ అప్పుడు ప్రచారమందుండెను. "శృంగార శ్రీనాథీయం" అను అలంకారశాస్త్రగ్రంథముగూడ నీకాలమందే రచించబడినది. కాకతీయ గణపతిదేవుని కొలువు నందు గజసాధకుడుగానుండిన జయప్పనాయకుడు క్రీ. శ. 13వ శతాబ్దమునందు వ్రాసిన "నృత్తరత్నావళి" యను సంగీతశాస్త్రములో నాట్యప్రయోగములు జరుపవలసిన సమయ నిర్ణయము జేయబడినది. సాధారణముగ నాట్యప్రయోగము మంగళప్రదమనియు, సంపత్కరమనియు నాట్యోక్తినుడువు చున్నది. వివాహశుభ సమయమందును, పుత్రోదయోత్సవము నందును, వ్రతపర్వపుణ్య దినములందును, తైరికులు పుర ప్రవేశము జేసెడి సమయములందును, మహాభిషేక మహా నవమి మహాదాన సమయములందును నాట్య ప్రయోగము చేయవలెనని దెలిపెను. ధనికుల గృహములలో దేవతా రాధనము జరిపెడి సమయములందు గూడ నాట్యములు జరిపి అంగరంగవైభవముగ దైవపూజలు జేయుట యాచారముగ నుండినది, మత సంబంధమైన పూజాది విధానములలో నాట్య మొక ప్రధానాంగమైనది. అందువలననే నాట్యకళ రాజుల చేతను ధనికులచేతను గౌరవింపబడినది.

రాజమహేంద్రవరము నేలిన రెడ్డి రాజులు శైవులు, వారికి శివపూజ ప్రధానమైనది. వారు ప్రతి నిత్యము ఆరు మారులు సదాశివుని పూజించుట ఆచారమైయుండెను. దేవాలయ పూజాదికములందు నృత్యగానములు విధాయకము

లైనవి. శైవ, వైష్ణవాలయములందు వారి వారి శాఖా సంప్రదాయముల ననుసరించి వేదబుక్కులు పఠించుట, నాట్య ప్రదర్శనములు జరుపుట యాచారమైనది. దేవాలయములందు నిత్యదీపధూప నివేదనలు జరుపుటకు, ఉత్సవకళ్యాణములు నిర్వహించుటకు, అర్చకత్వము చేయుటకు ప్రతి దేవస్థానమునకు దేవాలయ మాన్యములున్నవి. వాటికి ఈనాములని, వృత్తులని పేర్లు యున్నవి. భాగవతులు, దేవదాసీలు,అర్చకులు, రజకులు మొదలగువారు జేసెడి సేవకు ప్రతి ఫలముగ వారికి దేవాలయ మాన్యములు, వార్షికములు మొదలగునవి నొసగుట ఆచారమైయుండెను.

తెలుగు భాషయందు "పండితారాధ్య చరిత్రము"ను వ్రాసిన పాలకుర్కి సోమనాథుడు ఈ కాలమునందే జీవించెను. ఈ గ్రంథమునందు నాట్యోపాంగములు విపులముగ వర్ణించబడెను. శ్రీశైలము ప్రసిద్ధిగాంచిన శైవ క్షేత్రము. మహాశివరాత్రినాటి రాత్రి అక్కడ జరిగెడి వినోదములు మనోనేత్రమునకు సాక్షాత్కరించునట్లు వర్ణించబడినవి భరతముని యనంతరము నాట్యకళపొందిన భిన్నపరిణామ దశలయందును ప్రవృద్ధమైన నూతననాట్య సంప్రదాయములగు దేశిపద్ధతులు పరిష్కృతములై యంగీకరించబడినవి. మార్గదేశి, దేశినాట్య పద్ధతులు రెండును జనాదరణము బొంది యభివృద్ధిజెందినవి. మార్గపద్ధతి రెండుభాగములుగ జెప్పబడినది. పురుషనాట్యము తాండవమనియు, స్త్రీ నాట్యము లాస్యమనియు వ్యవహరించ

బడినవి. ఉద్ధతమైన తాండవము సదాశివునకు ప్రియంకరమైనది. మార్గపద్ధతిలోని తాండవ, లాస్యనృత్తులు, రాజులచేతను, ధనవంతులచేతను, ఉత్తమ కులమునకు జెందిన పండితులచేతను అభిమానించి ప్రోత్సహించ బడినవి. దేశి నాట్యపద్ధతి, సామాన్యజనుల వినోదముగ బరిగణించబడెను. ఈపద్ధతిగూడ అభిమానించి, అనుసరించబడినది.

కాకతీయుల కాలమందు శైవమతములో పాశుపత సంప్రదాయము ప్రబలినది. అగుటజేసి శివతాండవము విశేష ప్రజలకు ప్రీతిపాత్రమై వర్ధిల్లినది. రామప్ప దేవాలయములోని శిల్పములు అనేక అంగహారములను, అభినయ పరిజ్ఞానమును, స్ఫొరకము జేయుచున్నవి. శిల్పనైపుణి ఉపజ్ఞామహితమైనది. వరంగలుకోటయందు ఇటీవల పురాతత్వశాఖవారు జరిపిన త్రవ్వకములందు కొన్ని చిన్ననటరాజ విగ్రహములు దొరికెనని తెలియుచున్నది. కోటలోని స్వాయంభులింగేశ్వరాలయము నందుగూడ నాట్యకళాపరిజ్ఞానమును వెల్లడించెడి శిల్పసముచ్చయము గోచరించుచున్నది.

కాకతీయులయనంతరము దేశమునందు నాట్యకళ విశేషవ్యాప్తి గాంచినది. విద్వత్కవులు, పండితులు, నాట్యాభినయాలంకార శాస్త్రములు జదివిరి. ఉత్తమకులములవారు ఆయా శాస్త్రములందు ప్రజ్ఞాన్వితులైరి. "షోడశ కుమార చరిత్ర" రచించిన సూరామాత్యునకు అభినవ భరతాచార్యుడని ప్రసిద్ధి కలిగినట్లు దెలియుచున్నది. నాట్యశాస్త్రకోవిదులలో బ్రాహ్మ

ణులు దేవదాసీలకీకాలమునందే నృత్యగీతాభినయములందు శిక్షణ మొసంగుచుండిరి. భరతాచార్యులకు వారు గురుకట్నములుగ కానుకల నర్పించిరి. నాట్యకోవిదులువారికి భిన్ననాట్య సంప్రదాయములను అందలి భేదములను వివరించి దెలిపి నృత్య నాట్యాభినయములందు శిక్షణ మొసగిరి.

విశ్వేశ్వర ప్రభువు చాళుక్యరాజు వంశమునకు జెందిన వాడు. కాటయవేమ, పెదకోమటివేమ, రేచర్ల సింగభూపాలుడు మున్నగువారు నాట్యశాస్త్రమునందు ప్రజ్ఞావంతులైరి. కుమరగిరి ప్రభువు "వసంత రాజీయము" అను నాట్యశాస్త్రము వ్రాసెను. అప్పటికి శైవ వైష్ణవ క్షేత్రములోని దేవాలయములందు శివవిష్ణులీలలు చెక్కబడినవి. ఆ దేవాలయములలో గొన్నిపట్ల నాట్యమంటపములు గూడ యుండినట్లు దెలియుచున్నది. దేవాలయ శిల్పకళా విన్యాణము క్రమక్రమముగ క్రొత్తతెన్నులు అనుసరించినది. ఇట్టిశిల్పకళా పరిణామదశలలో నాట్యశాలాచిత్రణ మొక నూతన శకారంభమగుచున్నది. శ్రీశైలక్షేత్రమునందు 64 నాట్యకూటములుండినట్లు ప్రసిద్ధియున్నది.

మార్గదేశి దేశినాట్య పద్ధతులు రెండును, రెండు ప్రసిద్ధ ప్రజా వినోదములుగ పరిగణ చేయబడినవి మార్గదేశి,పద్ధతుల సంసర్గ ప్రభావమునాటి లాక్షణికుల గ్రంథములందు గోచరించుచుండెనని, జయప్పనాయకుని "నృత్తరత్నావళి" యందు దెలుపబడిన కుండలి, చిందు, యను దేసి నాట్యపద్ధతులవలన

నిరూపణమగుచున్నది. మార్గపద్ధతిని రాజులు, ధనవంతులు, ఉత్తమ కులములవారు మాత్రమేగాక సామాన్యప్రజలుగూడ క్రమేపి అభిమానించి ప్రోత్సహించిరి.

గ్రామములలోని ప్రజలు జరిపెడి దేవతకొలుపులు, ఉత్సవములు, అనేక నూతన దేసి నాట్యపద్ధతులు రూపొందుటకు దోహదము కలిగించినవి. తెలుగు సాహిత్యమునందు దేశినాట్య పద్ధతులను సూచించెడి ప్రయోగములు కొన్నిగాన వచ్చుచున్నవి. చిందు, కుండలి, దండశాక, కందుక మున్నగు పదములు కొన్ని నాట్యపద్ధతులను దెలుపుచున్నవి. ఇవిగాక కావడిచిందు, కోలాటము అను మరి రెండు దేశినాట్యపద్ధతులు పూర్వము ప్రచారమందుండినట్లు కొన్ని దేవాలయ శిల్పముల వలన గ్రహించవచ్చును. వల్లభామాత్యుని "క్రీడాభిరామము" నందు కందుకక్రీడ వర్ణించబడినది. ఈ వినోదము నందు స్త్రీలు దమ రెండుహస్తములతో కందుకక్రీడ జరిపినట్లు తెలియుచున్నది. పెదకోమటి వేమప్రభువు వ్రాసిన "సంగీత చింతామణి" లో గూడ కందుకక్రీడ, వర్ణించబడినది. పశుపాసిక నర్తనమును గురించి పెదకోమటి వేమసంగీతశాస్త్రమునందు వివరించెను. ఆకాలమున పుష్పగంధికా నృత్యమను మరొక దేశినాట్య సంప్రదాయము గూడ ప్రచారమునందుండినట్లు తెలియుచున్నది.

దేశములోని భిన్నభాషాధారక ప్రాంతములందును ప్రజల మత సాంఘికాచారములనుండి యుద్భవమైన

యనేక దేశినాట్యపద్ధతులు, యక్షగానములను మాతృకగా గలిగి యున్నవి. వీధి భాగవతుల నాటకకథలనుండి ప్రేరితమై మరి కొన్ని దేశినాట్యపద్ధతులు రూపొందినవి. అటుపిమ్మట రాయల కాలమునాటికి యక్షగానముల పద్ధతిననుసరించి రామాయణ, భాగవత, పురాణములనుండి కథావస్తువును గ్రహించి నాటకరూపమున ప్రదర్శించెడి యాచారము ప్రబలినది. ధృవ గానములు. దరువులు, ప్రజానురంజనము కలిగించినవి. నాటకములను గ్రామములలోని మైదానమునందు తాత్కాలికముగ నిర్మించిన పందిరియందు రంగస్థలము నేర్పరచి, పాత్రములు రంగస్థల ప్రవేశము చేయుటకుపూర్వము ఇరువురు పురుషులు అవనిక కొసలు చేతులతో పట్టుకుని, పిదప నాయవనికను దొలగించి ప్రదర్శించిరి. ఇట్టి నాటక ప్రదర్శనములను వారు రాత్రులందు జరిపిరి. భరతుని నాట్యశాస్త్రము ననుసరించి రంగపూజ, పుష్పాంజలి, విక్షేపము జరుపబడినవి.

## రాయల కాలము

రాయలవంశ ప్రభువులు క్రీ. శ. 1336 వ సంవత్సరమున విజయనగరమును ముఖ్యపట్టణముగ జేసికొని హిందూ రాజ్యమును స్థాపించిరి. దక్కనుదేశముపైన మల్లికాఫర్, ఇతర మహమ్మదీయ సుల్తానులు చేసిన దండయాత్రల ఫలితముగా హైందవ సంస్కృతి నామమాత్రావశిష్టమైనది. అప్పుడు హైందవ నాగరికతా సముద్ధరణమునకై దేశమునందు జాతీయోద్యమ ముదయించినది. మహమ్మదీయ సుల్తానులు

క్రీ.వె.1323 వ సంవత్సరమున వరంగల్ కోటనుముట్టడించినపుడు, అక్కడనుండి అయిదుగురు హిందూసోదరులు విజయనగరము బలాయన మొనర్చిరి. వారిలో మొదటి హరిహరబుక్క సోదరులు హిందూ సామ్రాజ్య స్థాపనోద్యమమునకు నాయకత్వమునవహించి, మహమ్మదీయ సేనావాహినులను తరిమిగొట్టి, క్రీ. వె. 1336 వ సంవత్సరమున విజయ నగర రాజ్య స్థాపనముగావించిరి. శీఘ్రకాలముననే హరిహరబుక్క సోదరులు మహమ్మదీయులను మధురనుండి తరిమివేసిరి. వారి జీవితకాలమందే ప్రాచీన చోళరాజ్యము విజయనగర రాజ్యములో విలీనమైనది. రాయలు వంశపురాజులు విజయనగర సామ్రాజ్యమును క్రీ. వె. 1565 వరకు పరిపాలించిరి.

విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన రాజులలో కృష్ణదేవరాయలు ప్రసిద్ధుడు. ఆయన దేశమును క్రీ. వె. 1509 నుండి క్రీ. వె. 1529 వరకు పాలించెను. ఆయన ఆహవ నిపుణుడగుటయే గాక గుణవర్ధనుడు సాహిత్య కళారంగములందు ఆయన నిర్మించిన ఘంటాపథములగు మార్గములు భావి కాలమునకు మార్గదర్శకములైనవి. బహుముఖ ప్రజ్ఞావంతుడగు కృష్ణదేవరాయలునకు సరిదూగగలవారు దేశ చరిత్రమున మరి యొకరు గనుపడరు. ఆయన మధురకవితా విలసితుడు. తెలుగు కవితకు ఆయన అజరామరత్వము కలిగించెను. కవులను, గాయకులను, నటకులను ఆయన బోషించి, ఆయాకళల గౌరవాధిక్యతల నినుమడింప జేసెను. గనుకనే కళాలక్ష్మియాసామ్రా

జ్యమునందు స ర్తనము జేసినది. నాటి యపూర్వశిల్పకళాసంపద నేటికిని నాట్యపరిజ్ఞానమును, ప్రబోధించుచు చైతన్యముకలిగించు చున్నది.

శిల్పము,చిత్రలేఖనము మొదలగుకళలు నాట్యశాస్త్రము నుండి కథావస్తువును గ్రహించినవి. అందువలననే నాట్యశాస్త్ర మును గురించి, ఆహార్యమును గురించి, అభినయమును గురించి, ప్రాచీన శిల్పములు నాట్యాచార్యులవలె నేడు బోధించు చున్నవి. ప్రాచీననాట్య సంప్రదాయములను, వాటి పూర్వ రూపములను దెలుసుకొనుటకు ప్రాచీనశిల్పకళా విశేషములు, చరిత్రకారులకు యుండవలసిన వాస్తవికదృష్టితో శాస్త్రచరిత్రను దెలుపుచున్నవి. ఈశిల్పములవల్లనే ఆనాడు నాట్యకళ గాంచిన యభ్యున్నతి గోచరించుచున్నది. శిల్పము, చిత్రలేఖనము, నాట్యకళకు బహిఃప్రాణములగు రెండు ఉపకళలని జెప్ప వచ్చును.

విజయనగర సామ్రాజ్యము మహోన్నతస్థితియందుండిన కాలమున ప్రస్తుతము అనంతపురం జిల్లాలోని ' లేపాక్షి 'యను పట్టణము గొప్పవాణిజ్యకేంద్రముగను, యాత్రాస్థలముగను ప్రసిద్ధి వహించినది.

విజయనగర రాజుల ప్రతినిధిగనున్న విరూపన్న నాయ కుడు లేపాక్షి పట్టణమును గట్టించి, ఆ పరిసరప్రాంతములకు గూడ అధికారిగనుండెను. విరూపన్న నాయకుడు అతని సోదరుడగు వీరన్ననాయకుడు లేపాక్షినగర నిర్మాణమునకు

కారకులని తెలియుచున్నది. అచ్చట దేవాలయ మందలి శిల్పములు అపూర్వమగు నాట్యవిజ్ఞానమును వెల్లడించుచున్నవి. అక్కడ నాట్యమంటపమునందు నర్తనముచేయుచున్న నాట్యకర్తెలు, మార్దవాద్యవాదకారులు, దేవ గాయకులు మొదలగువారి చిత్రరువులు శిలాస్తంభములమీద చెక్కబడి యున్నవి. సృష్టికర్తయగు బ్రహ్మ మద్దళవాద్యమును పూనినపుడు దేవగాయకుడగు తుంబురుడు వీణాతంత్రులు ప్రయోగించుచుండుట, నందికేశ్వరుడు హుడుక్క వాద్య ప్రయోగమునందు లీనమగుట, దేవనర్తకియగు రంభ నృత్యము చేయుచుండుట, మున్నగు దృశ్యములు ఆయాలయమునందు గనుపించుచున్నవి. వేరొకచోట నటరాజగు సదాశివుని ఆనందతాండవము చెక్కబడియున్నది. నాట్యమంటపమందలి శిల్పచిత్రరువులు నయన ముగ్ధత్వము కలిగించుచున్నవి. హంపి, ఆనెగొంది, లేపాక్షి, సోంపల్లి, సర్వణబెల్గొల, కాంచీపురము, తంజావూరు మధుర, చిదంబరము మొదలగు పట్టణములలోని దేవాలయములందు నేటికిని గోచరించుచున్న శిల్పకళాసంపదవలన కొన్ని స్థల పురాణములు, శివలీలలు, కన్నప్పార్, చండీశ్వర ఋషుల జీవితములు, తెలియుచున్నవి. ఈ శిల్పముల వల్ల ఆ కాలము నందు స్త్రీలు ఉపయోగించిన ఆభరణములు, ధరించిన దుస్తులు గూడ తెలుసుకొనవచ్చును.

రాయలు కాలమున దేవదాసీలు నాట్యకళయందే ప్రవీణులైయుండిరి. వారికి రాజాంతఃపురములందు ప్రవేశించుటకు

అన్ని వేళలయందును అనుమతియున్నది. వారిని రాజులు పోషించి నాట్యకళాభివృద్ధికి కరావలంబనమొసగిరి. రాజాదరణమునకు బాత్రులైన దేవదాసీలు గృహారామములను దాస దాసీ పరిజనులను కలిగియుండిరి. కొన్ని ప్రాచీన శిల్పములందు నాట్యనాట్యకత్తెలు మహమ్మదీయాంగనలుధరించెడి 'పైజమాలు' ఉపయోగించి శరీరమందలి పైభాగము నంతటిని ఆభరణములతో నలంకరించుకొని నట్లు చెక్కబడియున్నవి. బాలి దీవులలోను, మలబారులోను, స్త్రీల యాహార్యమునందిట్టి విధానము నేటికిని యాచారముగనుండినట్లు కనుపడుచున్నది. హజారరామాలయ ముఖద్వారమువద్ద, దేవాలయమందలి కొన్ని స్తంభముల పైన నాట్యకత్తెల చిత్తరువులు నగ్నరూపమున జెక్కబడి యున్నవి.

ఆకాలమందలి నాట్యశాలా స్వరూపమును సమగ్రముగ దెలుసుకొనుటకు చరిత్రాకారుడగు పెయస్ రచన మనకు తోడ్పడుచున్నది. భరతనాట్యమునందు శిక్షణము బడయుటకు అంతపుర స్త్రీలను గూడ రాజులు నాట్యశాలకు బంపినట్లు దెలియుచున్నది. వారచ్చట సంపూర్ణముగ వివిధ నాట్యవృత్తులందును శిక్షణము పొందిన పిమ్మట బహిరంగముగ నాట్య ప్రయోగము గావించుటకు రాజానుమతి బొందిరని విదితమగుచున్నది. పరిమిత వైశాల్యము, దీర్ఘచతురాకారమందున్న నాట్యశాలలో ప్రతిగజము దూరమునకు యొకొక్క స్తంభమున్నది. ఇట్టి స్తంభములు నాట్యమంటపమునందనేకమున్నవి.

కృత్రిమ సాధనములతో బోలుగా జేయబడిన స్తంభములు అనేక పరిమాణములలో ఉన్నవి. వీటికి బంగారునీరు పోసిరి. వీటిని నిలుపుటకు సహాయముగ కొన్ని అంతస్తులుగల మెట్ల నేర్పరచిరి. ఈ మెట్లపైన ఏనుగలు మొదలగు జంతువుల చిత్రవులున్నవి. ఈచిత్రవులు బోలుగా నుండుటవలన, చూపరులకు వాటి వెలుపలభాగము లోపలిభాగము గను పించును. ప్రతిరెండు స్తంభముల మధ్యను లతలతో జెక్కబడిన అడ్డబద్దెలున్నవి. కొన్ని వరుసలుగా ఒకఅడుగు పరిమాణములో నున్న స్త్రీల విగ్రహములు నిలుపబడియున్నవి. ఇట్టి చిన్న విగ్రహములు నాట్యమంటప మందంతట యున్నవి. స్తంభముల మీద చెక్కిన చిత్రవులు వీటికంటె చిన్నవి. అవి క్రమముగా పరిమాణమునందు ఒకదానికంటె మరొకటి చిన్నదిగ నున్నవి. ఈ విగ్రహముల మధ్యభాగమునందు, చెక్కిన లతలు, పద్మములు అమర్చబడియున్నవి. వీటికి ఎరుపు, నీలిమరంగు వేయబడెను. నాట్యమంటప మధ్యమందలి స్తంభ ములపైన లేళ్ళచిత్రవులున్నవి. అంతస్థులుగా నిలిపిన విగ్రహముల వరుసలో, మర్దళవాద్యమును ధరించిన ముగుదల చిత్రవులున్నవి.

నాట్యమంటపములో నిలిపిన స్తంభముల వరుసలు, విగ్రహములు, మెట్లు, ఇతర సంకేత చిహ్నములు, ప్రతి నాట్య ప్రయోగముయొక్క ఆరంభ, అంత్యభేదములను తెలుపుచున్నవి. నర్తనము చేయువారికి నాట్యపద్ధతిలోని క్రమ

విధానము స్ఫురణమునకు రానియెడల, వారు తమ యెదుట నున్న శిల్పములను, విగ్రహములను జూచి గ్రహించి అనుస రించుట కనువుగ స్ఫురణ కలిగించుచున్నవి.

నాట్యమంటపమునకు చివరభాగమున విహారస్థలము చిత్రణ చేయబడినది. అక్కడ నర్తనము జేయువారు వ్యాయా మము జేసి అవయవసాధనము గావించుట కుపకరించెడి వ్యాయామ పరికరము లమర్చియున్నవి. నర్తనము మనోహర ముగ నుండుటకు అవయవ సాధనము నట్టువరాండ్ర కిచ్చిరి. వ్యాయామమునందు శిక్షణ మీయబడెనని తెలియుచున్నది.

నాట్యప్రయోగమును తిలకించుటకు, నాట్యమంటప మందలి కుడిపార్శ్వమున రాజేంద్రునకు ఆసనాదికములు అమర్చబడియున్నవి. అక్కడనున్న ప్రక్కగోడలు, నేల, బంగారు సీటిపూత పూయబడినది. రంగస్థలమధ్య మున, పన్నెండు సంవత్సరములు వయసు గలిగిన బాలికా విగ్రహమును నాట్యాంతపు భంగిమలో చెక్కి నిలిపిరి.

నాట్యమంటప శోభవలన, ఆనాడు ఈ నాట్యకళయందు రాజులకు కలిగిన శ్రద్ధాభిమానములు ద్యోతకమగుచున్నవి. రాజపోషణమువలన మహోన్నత స్థితినందిన నాట్యము, భరత శాస్త్రము, గరిమామయమైనవి. అప్పుడు భరతుని నాట్య శాస్త్రమంతయు శిల్పరూపమున జెక్కించి యుండవచ్చును. అట్టి యమూల్యమగు శాస్త్రజ్ఞానము, ప్రయోగవిధానములు శిల్పరూపమునం దుండినప్పటికిని, దురదృష్ట వశమున నవి శిథి

లములై రూపహీనమగుట సంభవము గావచ్చును. అత్యంతోప యోగకరమగు అమూల్యశిల్పములు అనంతగ కాలగర్భ మున మరుగుపడెనని దెలియుచున్నది.

విఠలస్వామి ఆలయములో కళ్యాణ మంటపమునకు ఉత్తరభాగమున వేరొక మంటపము గనుపించుచున్నది. ఈ శిల్పమువలన, నాట్యమంటపమునుండి తెలిసినన్ని విషయములు తెలియుటలేదు. నాట్యప్రయోగమును వీక్షించుటకు రాజోత్త మునకు ఎత్తైన వేదికపై నొక సింహాసనము అలంకరింపబడి యున్నది. ఆయన యెదుట నాట్యమును జేసెడి నర్తకి వివిధ వాద్యవాదనకారులు యుండిరి. సింహాసనా సీనుడైన ప్రభువ రేణ్యుడు కృష్ణదేవరాయలు గావచ్చును. ఇచ్చటి దేవాలయము నందు జరిగెడి బహిరంగ నాట్యప్రయోగములను దిలకించుటకై రాజులుగూడ వచ్చుట యాచారమై యుండవచ్చును.

శ్రీకృష్ణదేవరాయలు సంగీతమునందు గూడ ప్రజ్ఞావం తుడు. రామరాయలు వలె ఆయనగూడ శ్రావ్యముగ గానము చేయగల నేర్పరి. కృష్ణదేవరాయలు గానకళయందు ప్రజ్ఞా ధురీణుడని కృష్ణాపుర శాసనములందు ప్రశంసించబడినది. గాన శ్రవణమునందు గూడ ఆయన అధికాసక్తి కలిగి యుండెను. ఆయనకు గల గానపిపాసను, క్రీ. వె. 1514 సంవత్సరమునం దిక్కడకు వచ్చిన 'బర్బొస' ఇట్లు వర్ణించెను.

"అంతఃపురాంగనలు ప్రతి దినమును కొలనులో జల క్రీడలు సలుపుచు, వివిధ విధవాద్యముల తోడను; గీతముల

తోడను బహువిధముల రాజును రంజించుచుందురు.''

రెండవ రాయలు కాలమున ములుభాగల్ మండలేశ్వరుడగు సాళువ గోపతిప్ప, సంగీత, నాట్య, తాళ, అలంకార గ్రంథములు వ్రాసెనని తెలియుచున్నది. వామనుని కావ్యాలంకార గ్రంథముపైన ఆయన ''కామధేను'' యను వ్యాఖ్యానమును రచించెను. ఆయన ''తాళదీపిక''యను శాస్త్రగ్రంథమును రచన గావించెను. రామరాయలు వెంకటాద్రి ప్రభువుల ఆదరణమున రామామాత్యుడు ''వరమేళ కళానిధి''యను సంగీత శాస్త్రగ్రంథమును వ్రాసెను. ఆయన రాగములను ఉత్తమ, మధ్యమ, అధమములని విభజించెను. రమారమి 20 మేళములు సంగీత శాస్త్రమునందు ఆయన వ్రాసెను.

బెంగుళూరు జిల్లాలోని సవనదుర్గవాసి పుండరీక విఠల యను భరతశాస్త్రకారుడు, ఉత్తరదేశమునకు వెళ్ళి అక్కడ ''నర్తక నిర్ణయం'' అను నాట్యశాస్త్రమును వ్రాసెను. ఆయన అక్బరు చక్రవర్తి యాస్థానమున గౌరవ సత్కారములు పొంది యుండెను. మొగలు చక్రవర్తి యాస్థానగాయకుడగు తాన్‌సేన్‌పై గూడ, పుండరీకవిఠల్ ప్రభావము గనుపించెనని తెలియుచున్నది.

రాయలు కాలమునందు నాట్యకళ మహోన్నతస్థాయికి వచ్చినది. భరతుని నాట్యశాస్త్రము లెస్సగ గౌరవించబడినది. నాట్యమున మార్గ, దేశ పద్ధతులు రెండును క్రమాభివృద్ధి నొందినవి. భరతశాస్త్రకోవిదులవద్ద దేవదాసీలు నృత్య గీతాభినయములు నేర్చుచుండిరి నాట్యకళ క్రమక్రమముగ వారి కుల విద్యయై పరిఢవిల్లినది.

# తమిళదేశ నాట్య సంప్రదాయములు

నాట్య, అభినయ, సంగీతశాస్త్రములను గురించి వెలువడిన లక్షణలక్ష్య గ్రంథములలో "పంచమరువు," బరతసేనాపతీయం, 'నాటక - తమిళ్ - నూల్' (మతివన పాండ్య) ఇంద్రకావ్యం, ఈ శైన సుక్కుం ప్రధానమైనవి, సూత్రయుగమున మురువల్, గుణనూల్, జయంతం, శైత్యం, మున్నగు గ్రంథములు ప్రచారమం దుండెను. అగస్త్యం, కురుగు, కూత్తునూల్ తలవగై - కూత్తు - నూల్, పంచ బరతీయం, బరతం, పెరుంకురుగు, పెరునారై, మురువల్ మొదలగు శాస్త్రిగ్రంథములు గూడ ప్రాచీన నాట్యపద్ధతులను వివరించుచున్నవి.

తమిళమున ప్రాచీన గ్రంథమగు శిలప్పదికారము నందు గూడ భరతమునినాట్యశాస్త్రము ననుసరించబడినట్లు గనుపడు చున్నది. ప్రాచీన తమిళశాస్త్రి గ్రంథములందు బేర్కొనిన ఏకాదశ నాట్యనృత్తులును ప్రచారమందుండినట్లు తెలియు చున్నది. ఈ నాట్యపద్ధతులన్నియును ప్రాచీనఋషి సంప్రదాయము ననుసరించి యున్నవి. ఇవి మార్గపద్ధతికి జెందినవి. వీటి జననమును, స్వరూపమును, భేదములను దెలుసుకొనుట యర్హము.

అలియం: బలరామకృష్ణులను సంహరించెడి దుష్టబుద్ధి కలిగిన వారి మేనమామ యగు కంసుడు, వారిని మధురానగర

మునకు బిలిపించెను. వారు నగరప్రవేశము చేసినపిదప, నగర ద్వారమును బంధించి, కువలయపీడమను మదమత్తేభమును వారి పై విడిచిబుచ్చిరి. మత్తేభ ప్రమాదమునుండి దప్పుకొనుటకు, శ్రీకృష్ణుడు ఒకవిధమగు నర్తనమును జేసి, ఏనుగుదంతము నూడబెరికి, దానితో కువలయపీడమును సంహారించెను. ఈ నర్తమునకు అలియమను పేరువచ్చినది.

కొట్టి లేక కొడు - కొట్టి: మహాదేవుడు అసురసోదరులపై దాడివెడలి, ఒక్క బాణప్రయోగమున వారిని సంహారించెను. ఆ దానవసోదరులకు జెందిన సువర్ణ, రజత, లోహ నగరములు భస్మీపటలము లయ్యెను. శిథిల నగరముల మధ్య నిలచిన శంకరుడు ఉత్సాహముతో ఉద్ధత తాండవము జేసెను. అప్పుడు లోకమాతయగు భైరవిమాత్రము అచ్చటయుండి తాళమును సూచించెను. ఈ నర్తనము కొడుకొట్టి యని వ్యవహరించ బడుచున్నది.

కుడై: అసురులు బలాఢ్యులై, లోకవాసులను దారుణముగ హింసించిరి. వారిని తుదముట్టించుటకు దేవదేవుడు బాలరూపమును దాల్చి వారి యస్త్రములు నిరుపయోగమగునట్లొనర్చెను. దానవులు తమ ఆయుధములతో వేసటజెంది వాటిని విసరి బారవైచిరి. అప్పుడు దేవసేనాపతియగు స్కంధుడు ఛత్రమునుదించి, దానిని పార్శ్వయవనికగా నుపయోగించి ఆనందనర్తనముజేసెను. (కుడై యను పదమునకు గొడు

గనిఅర్థము) అందువలన ఈ నర్తనమునకు కుడైయను పేరు కలిగినది.

కుడం : బాణాసురుడు మహాబల సంపన్నుడు. ఆయనకు సహస్రకరము లుండెను. ఉషాకన్య ఆయనపుత్రిక. తాను హృదయపూర్వకముగ గోరిన వరుని భర్తగా యనుగ్రహింప వలెనని ఆమె మహాదేవిని ప్రార్థించినది. నాటికి అయిదవ దిన మున స్వప్నమునందు గాంచెడి యువకుడు ఆమెభర్త కాగలడని మహాదేవి, ఉషాకన్యకు దెలిపెను. ఉషాకన్య, స్వప్నమునందు శ్రీకృష్ణుని మనుమడు, కామదేవుని, పుత్రుడు నగు అనిరుద్ధుని గాంచెను. ఆమె చెలికత్తెయగు చిత్రలేఖ, మాంత్రిక విద్యా ప్రభావమువలన, అనిరుద్ధుని ద్వారకానగరమునుండి యుషా కన్య అంతఃపురమునకు గొనివచ్చెను. అని రుద్ధకుమారుడు ఉషా కన్య రూపసౌందర్యమునకు ముగ్ధుడయ్యెను. ఇరువురును పర స్పరానురాగ బద్ధులై రహోమధురిమము ననుభవించుచుండిరి. కొంతకాలమున కీ యుదంతము బాణాసురుని జెవికి సోకినది. అతడు మహోగ్రుడై అనిరుద్ధుని చెరసాలయందు బంధించెను. శ్రీకృష్ణుడు మనుమని విడిపించుటకై, మాయావేషధారియై పంచలోహములతోడను, మట్టితోడను జేసిన కుండను జేతబట్టి నర్తనము జేయుచు వీధులవెంబడి దిరుగుచుండెను. ఆ నర్త నమునకు తాళమును సూచించుటకు ఘటమును ఉపయోగిం చెను. అందువలన దీనికి కుడం అను పేరు కలిగినది.

పేడి: కామదేవుడు తన సుతుని గొనితెచ్చుటకై అర్ధ నారీశ్వర వేషమును ధరించి బాణాసురుని నగరమునకేగి నర్తనము జేసెను. (పేడి యను పదమునకు నపుంసకుడని యర్థము.)

కడయం: ఆ నగరమునకు ఉత్తరద్వార దిశయందు నయనానందకరమగు సస్యములున్నవి. అచ్చట ఇంద్రాణియను నొకకన్య కడైయను కడపటి నర్తనము జేసెను. కడై యను పద మునకు చివరఅని అర్థము. కావున నీ నర్తమునకు కడైయను పేరు కలిగెను.

పాండరంగం: పైన దెలిపిన మూడు నగరముల ధరాధి పతులు నేల గూలినపుడు, చతుర్ముఖబ్రహ్మ తన రథము చెంతనిలిచి సారథ్య దండమును అధికారసూచకముగ జేత ధరించెను. అప్పుడు కాలభైరవుడు మసుభూమియందలి భూతిని దాల్చి తెలుపురంగుకలిగి, పరాశక్తితో గలిసి ఈ నర్తన మును జేసెను. పాండు అనిన తెలుపు యని అరము. ఆరంగ మను శబ్దము రంగస్థలమును సూచించుచున్నది. అందువలన ఈ నర్తనమునకు పాండరంగం అనుపేరు కలిగినది.

మాల్: శ్రీకృష్ణుడు తన మనుమడగు అనిరుద్ధుని, బాణాసురుని చెరనుండి విడిపించుటకు మల్లవీరునివలె మాయా వేషమును ధరించి ఆ నగరమునకు వెళ్ళి అచ్చటివారి నంద రిని తనతో మల్లయుద్ధముచేసి గెలువుడని సవాలుజేసెను.

బాణాసురుడు అతనితో మల్లయుద్ధమును జేయుటకు సిద్ధపడెను. శ్రీకృష్ణుడు వానితో కొంతతడవు వినోదక్రీడ జరిపి పిమ్మట బాణాసురుని తుద ముట్టించెను. అసురునితో శ్రీకృష్ణుడు వినో దించునపుడు ఈ నర్తనము ఆయనవలన బుట్టెను.

తుడి : మహా బలపరాక్రమవంతుడగు సురపద్మయను అసురుడు, దేవతలవలన కలిగిన భయముచేత, మాయావేష మునుధరించి, మాంత్రిక విద్యాప్రభావమున సముద్రతరంగము లపై ఘుని వ్రేలిమీాద నిలిచి దాగెను. దేవసేనాపతియగు స్కంధుడీరహస్యము భేదించి దైత్యుని సంహరించెను. అప్పుడు సముద్రతరంగము రంగభూమికాగా, ఈ నర్తనము ఆయనవలన బుట్టెను. ఆయన చేతియందు ధరించిన 'తుడి' తాళమును సూచించుట కుపయోగింపబడినది.

మరక్కాల్ : ధర్మయుద్ధమునందు మహాదేవుని జయిం చుట యసాధ్యమని అసురులు నిశ్చయించిరి. వారికిగల మంత్ర విద్యాప్రభావమువలన విషసర్ప, వృశ్చికరూపములను ధరించి వారు దేవలోకమునందు ప్రవేశించిరి. విష్ణుదేవుని భగినియగు మహాదేవి అసురుల మాయననుగ్రహించి, ఆమె కొయ్యపాద ములను ధరించి నర్తనముజేసి మాయావులను తుదముట్టించెను. మహాదేవివలన యీా నర్తనము చేయబడెను.

పావై : విష్ణుదేవుని యర్ధాంగియగు లక్ష్మీదేవి క్రూరు లగు దానవులను సంహరించుటకు సూక్ష్మోపాయము నవలం

బించెను. దేవతలపై యుద్ధము జేయుటకు దానవులు బయలు వెడలిరి. ఆమె మోహిని రూపమును ధరించి మార్గమధ్యము నందు వారికి సాక్షాత్కరించినది. వారామె సుందరరూపమును గాంచి మోహావేశ బరవశులైరి. వారికి చిత్తభ్రమణము కలిగినది. వారు యుద్ధాయుధములను బారవైచి ఆమెవెంట బరుగులెత్తిరి. అప్పుడు ఈ నర్తనము సముద్రపుత్రికవలన బుట్టినది.

ఈ నాట్యవృత్తులకు జెప్పిన గీతాది తాళముల నెరింగి, సుశిక్షణముబొంది నాట్యప్రయోగము జేసినట్లు తెలియుచున్నది. ఇవిగాక మరికొన్ని పురాణ నాట్యపద్ధతులుగూడ అనుసరించ బడినట్లు దెలిపెడి నిదర్శనము లున్నవి. వీటిలో కల్యానర్తనం, కుడనర్తనం, కాళీనర్తనం, నటరాజనర్తనం, సీత రావణునితో పోరునపుడు ఆమెవలన బుట్టిన నర్తనము ప్రధానమైనవి.

కల్యానర్తనం :బహుళాంగహార కలితమైన క్లిష్టనాట్యము. ఈ నాట్యమును నేర్పెడివారు మిక్కిలి సమర్థులై యుండవలెను.

రాగతాళాభినయములందు ఈ నాట్యాచార్యులు అధిక ప్రజ్ఞావంతులై యుండవలెను. భరతమతము ననుసరించి ఇది మార్గవృత్తి యందున్నది.

కుడనృత్తం : గోపాలకృష్ణుడు ద్వారకానగర వీధులలో శిరస్సుపై నొక ఘటమును దాల్చి నటనము జేసెను.

దీనిలో ఘటము తాళమును సూచించుటకుపయోగించబడినది. క్రమేపి ఈ నర్తనమును గోపకన్యలును, వారివెనుక ద్వారక యందలి స్త్రీలును అభ్యసించిరి. ఆధునిక యుగారంభమున గ్రామము లందలి స్త్రీలు (గొల్లపడుచులు) చేయు నర్తమునందు ఈ నాట్య లక్షణములు కొన్ని కనుపించుచున్నవి.

కాళీనర్తనం: లోకమాతయగు కాళికాదేవికిని, మహిష చండబంధాదులకును జరిగిన భయంకరయుద్ధము 'దేవీమహాత్మ్యం' శివస్కందపురాణము లందు విపులముగ వర్ణించబడినది. కాళికాదేవి మహాభయంకర రూపిణియై మృతకళేబరముల పైన నిలిచి, సహస్రశిరములు గల హారమును దావళముగ కంఠము నందు ధరించి ఆమె ఈ నర్తనమును జేసెను. అప్పుడామె హస్తములందు భయంకరమగు శూలాధి ఆయుధములుండెను. మహాశక్తి పూజాదినములందును, మంత్రోపాసనా సమయము లందును కాళికాదేవి భక్తులు రహస్య ప్రదేశములం దీ నాట్యమును జరుపుదురు. ఈ నాట్య సంప్రదాయము యిప్పటికిని నేపాల్, అస్సాం, వంగదేశములందు ఆచరణలో యుండినట్లు తెలియుచున్నది.

నటరాజనర్తనం: చిదంబరంలోని నటరాజాలయమందలి తూర్పు గోపురమున శివతాండవమునకు సంబంధించిన 93 భిన్న భంగిమలు గల విగ్రహములు చెక్కబడియున్నవి. మహాకాళి తాండవనర్తనమునందు ప్రవీణురాలు. నాట్యమునందు తన కెవరును సాటిలేరని నేల నాలుగు చెరగులు గుమ్మ



నటరాజు ( పుంగనూరు )

(మద్రాసు పురాతత్వశాఖవారి సౌజన్యముతో)

రుచు అందరిని ఆమె ధిక్కరించినది. చిట్టచివరకామె చిదంబరము నందుసదాశివునితో పోటీపడినది. శంకరుడున ర్తనమును జేసెను. పురుష నాట్యమగు తాండవ ప్రయోగమునం దామె శంకరుని యనుసరించలేక తన యోటమి నొప్పుకొనినది. తాండవము నందు శంకరుని గురువుగా నామె అంగీకరించినది.

సహస్రకంఠుడగు రావణునితో సీతాదేవి పోరు సలిపి నపుడొక విధమగు నాట్యగరిమ గోచరించెనని "అద్భుతరామాయణము నందు వర్ణించబడినది. ఈ నాట్యపద్ధతిగూడ మహిషాసుర మర్దని సంహార నాట్యవృత్తివలెనే యుండును.



# మలబారు దేశపద్ధతులు

మలబారు దేశమునందు నివసించెడి ప్రజలలో యెన్ని శాఖా భేదములున్నవో వారి నాట్యపద్ధతులలోగూడ యన్ని పద్ధతులున్నవి. దేశములోని దేవాలయములు వారికిగూడ నాట్యకళా నిలయములైనవి. కొన్ని దేశినాట్యపద్ధతులు మాత్రము వారిలో కొన్ని శాఖలకు జెందిన ప్రజలవరకే పరిమితములయ్యెను. దేవాలయ ఉత్సవములతో ఏ విధమైన సంబంధము లేకపోయినప్పటికిని, మతప్రేరితముగాని, 'తుల్లల్' నాట్యపద్ధతిగూడ యుత్సవములందు అవలంబించబడినది.

బహు ప్రాచీన కాలమునుండియు మలబారు ప్రజలు "అమ్మతల్లి"ని పూజించుట యాచారముగ కలిగియుండిరి. వారికి "అయ్యప్పన్" గ్రామదేవత. "వెట్టకారన్" వారి ప్రాచీన దైవతము. ఆదిలో వారు సర్పమును గూడ బూజించిరి. క్రమేపి వారు శివుని, విష్ణుదేవుని పూజచేయుట కారంభించిరి. ఇట్టి దేవతారాధనము వల్లనే వారిలో సహజముగ నెలకొనియున్న నాట్యాభినివేశము అభివృద్ధి గాంచినది. కాలక్రమానుగతమున వారిలో యనేక నూతన నాట్యపద్ధతులు రూపొందినవి.

మత ప్రేరితమైన నాట్యములలో "పాన" యను నాట్యపద్ధతి ప్రసిద్ధమైనది. "నాయరు" కులస్థులు వారి ఇండ్లలో

కాళికాదేవి పూజలు చేయునపుడు ఈ నాట్యమును చేసినట్లు ప్రాచీన మలయాళ సాహిత్యమువలన తెలియుచున్నది. దీనికి కాళీ నాటకమను పేరు కలిగినది. ఈ నాటకమును ఒక్క దినమునందుగాని, రేయింబవళ్ళ యందుగాని ప్రదర్శింతురు. కాళీ నాటకమును పగటివేళ ప్రారంభించిన యెడల, ఆనాటి రాత్రియందు జరిపెడి ప్రదర్శనమునందు కూడ, పగటి నాటక మందలి సంఘటనములే యామ్రేడితమగును. నాటకాంతమున వారు నిప్పులపై నడచుట యొక ఆచారముగ నున్నది.

నాటక ప్రదర్శనమును జరుపుటకు 64 స్తంభములతో పెద్ద పందిలిని వారు నిర్మింతురు. మొదటి నాలుగు స్తంభముల మధ్యనున్న ప్రదేశమును కొబ్బరియాకులతోడను, ఫలముల తోడను అలంకరింతురు. వారికి పవిత్రమగు "పాలకొమ్మ" ను అక్కడ ప్రతిష్ఠజేసి, నాటక నాయకుడు దానికి పూజలు జేయును. ఇట్టి పూజాదికములు జరుపునపుడు వివిధవాద్యముల ఘోషలు ప్రతిధ్వనించుచుండగా నాటక నాయకుడు నాట్యము జేయును. వారి ఇష్టదైవతమును పుష్పములతో బూజించును. పూజాంతమున "వసంతము" ను జల్లుట వారి యాచారము. వసంతము (ఎర్రని నీరు) పోయుటవలన వారి ప్రియదైవతమగు కాళికా దేవికి ప్రీతి పాత్రమగు రుధిరమును సమర్పణము జేసినట్లగునని వారి విశ్వాసము. నాటక సంఘనాయకుడు, నాటకాంతము వరకును నుపవసించును. ఆ సంఘమందలి ప్రధాన నటుడు ప్రత్యేకముగ చేయబడిన ఒక జ్యోతిని చేతధరించి ఆ పూజా

మంటపమున నర్తనము జేయును. పూజానాట్యమున కంటె ఈ నర్తనము క్లిష్టమైనది. ఆ వెనుక నటులందరును అలంకార యుతమగు దండములను జేతులందు ధరించి పూజావేదిక చుట్టును నాట్యమును జేయుదురు. కాళికాదేవి జననమును, దానవనాయకుని సంహారమును నుతించుచు వారు గీతములను బాడుదురు. వారు అర్పించెడి నివేదనములను పరిగ్రహించుటకు పూనకరూపమున సాక్షాత్కరించవలెనని వారు మంత్రాదికము లతో కాళికాదేవిని ప్రార్థింతురు. ఆ సమయమున నటులంద రును గలిసి నాట్యమును జేయుదురు. కాళికాదేవి ప్రీతికొరకు వారపుడు అపరిమితోత్సాహముతో బెద్దకేకలు పెట్టుదురు. ఈ నాట్యోత్సాహమునందు వారు ఆవేశపరవశులై ఆ పంది లిని పడగొట్టుట యొక ఆచారముగ నున్నది.

భగవతిపాట్టు : 'అమ్మతల్లి' పూజలో నిది మరియొక నాట్యపద్ధతి. దీనిని ఆచరించుటకు 'అంబలవాసీల' లో నొక శాఖయగు 'కురుప్' లకు మాత్రమే యధికారమున్నది. ఈ యుత్సవమును కాళికాలయమందుగాని, నంబూద్రి బ్రాహ్మ ణుల ఇండ్లయందుగాని జరుపుదురు. ఇందలి నాట్యపద్ధతి 'పాన' పద్ధతివలె నుండును.

ఈ నాట్యమునందు, అప్పటి మతాచారముల ననుస రించి 'పాన' నాట్యపద్ధతినే కొంత గౌరవస్థాయికి దెచ్చుటకు కృషి జరిగినట్లు కనపడుచున్నది. అనేక వర్ణములు గల చూర్ణ ములతో కాళికాదేవి చిత్రరచన జేయుదురు. ఆ చిత్రమునకు

నంబూద్రి బ్రాహ్మణుడు పూజచేసిన పిమ్మట అద్భుతశక్తులు ఆవరించునని వారి విశ్వాసము. పూజా సమయమున, కురుప్ ఆ ప్రదేశమునుండి వెలుపలికి బోవును. స్వల్ప నాదముతో అప్పుడు వాద్యములు ప్రయోగింతురు. కురప్ తిరిగి ఆ ప్రదేశమునకువెళ్ళి మలయాళభాషలో కొన్ని మంత్రములు పఠించును. అతడు గానము జేయును. అపుడు 'కోమరం' ప్రవేశించును. నాట్యమును జేయును. ఆయన కాళికాదేవి భక్తులకు ఆమె ఆశీస్సులను దెలుపును. అంతటితో పూజా నాట్యము సమాప్తమగును.

వెట్టకారన్: వేటదేవుని ప్రీతికొరకు వారొక ప్రత్యేక నాట్యమును జేయుదురు. దీని విధానముగూడ 'పాట్టు' పద్ధతిని బోలియుండును. ఇక్కడ వారు కాళికాదేవి చిత్రువునకు బదులుగ వేరొక చిత్రువును జిత్రణ జేయుదురు.

ముటియెత్తు: ఇది కాళికాదేవి పూజా ప్రేరితమైనది. కాళికాదేవి పూజోత్సవములందు కురుప్ శాఖలకు జెందినవారు దేవీ యాలయమునందు ఈ ప్రదర్శనమును జరుపుదురు. మత సంబంధమగు నీ కథావస్తువును ప్రదర్శించుటయందు కాళికా దేవి భక్తులే ఇందలి పాత్రముల నభినయింతురు. విషాదాంత నాటకములప్రవేశమునకిది తొలిదశయని జెప్పవచ్చును ప్రజల దృష్టి వాస్తవికత్వమునకు మరలినది. గనుకనే వారికి వాస్తవిక జిత్రణయందాసక్తి కలిగినది. పూజా దినమునాడు మధ్యాహ్నకాలమున వారు కాళికాలయమునకు వెళ్ళి అక్కడ

భయంకర రూపమునందు జిత్రించిన కాళికాదేవి చిత్తరువును బ్రతిష్ఠింతురు. సాయంసమయమున కాళికాలయమునందు మంత్రయుతముగ పూజాదికములు జరుపునపుడు, ఆలయ ప్రాంగణమునందు జేరిన బ్రజలను వివిధ వాద్యగానములతో వినోదింప జేయుదురు. అన్ని కులములవారికిని కాళికాలయము నకు బోవుట కర్హతలేదు. అట్టివారు దూరముగ నిలిచి దేవాలయములందలి ప్రదర్శనాది వినోదములను జూచుచుందురు. దేవాలయమునందలి పూజాదికములు ముగిసిన పిమ్మట, దేవీ విగ్రహమును ఆలయప్రాంగణమునందూరేగించి యొక ప్రధాన స్థలమున బ్రతిష్ఠింతురు. ఈ ప్రదర్శనములోని తొలి దృశ్యమునందు నారదుడు, శివుడు సంభాషణము జరుపుదురు. దానవనాయకుని నిరంతరముల వలన భూదేవి శోకించుచున్నదని నారదుడు మహేశ్వరునకు నివేదించును. కాళికాదేవి దైత్యుని సంహరించుననియు, అప్పుడు లోకము సుఖింపగలదనియు శివుడు అభయమొసగును. ఇంతలో ఒకరు కాళికాదేవి భూమికను, వేరొకరు దానవ పాత్రమును ధరించి ఆలయ ప్రాంగణమునందు బ్రవేశింతురు. ఈ ప్రదర్శనమును జరుపుటకు ప్రత్యేకముగ రంగస్థలము యుండదు. కాళికాదేవి దానవ పాత్రములను ధరించినవారు గుడి ప్రాంగణమంతటను దిరుగుచు నాటక ప్రదర్శనము గావింతురు. మొదట దానవుడు ప్రవేశించి కాళికాదేవిని పోరునకు పురిగొల్పును. ఇరువురునుగుడి యావరణమునందు నాటి దినమువ భయంకరమగు పోరాట

మును సలుపుదురు. ఉషఃకాలమునందు దానవవధతో ప్రదర్శ
నము పూర్తియగును. దానవ నాయకునకు "దారుక" అని
పేరు యున్నది. 'దారుక' వధానంతరము కాళికాదేవి యాతని
కిరీటమును గ్రహించి, అప్పటినుండియు దానినామె ధరించెను.

• బ్రామనిపాట్టు: 'పాట్టు' అను పదము నాట్యమును
సూచించును. దీనిని అంబలవాసీల స్త్రీలు ప్రత్యేకముగ ప్రద
ర్శింతురు. వీరికే 'పుష్పినులు' అను పేరుకూడ యున్నది. ఈ
నాట్యమును ఇండ్లయందు జరుపుదురు. గృహమందలి ఒక
విశాలమగు గదిని శుభ్రపరచి దానిలో అలంకరించిన పీటను
బెట్టి, పూజలు జేసి, వారు ఆడుచు, పాడుచు అమ్మతల్లిని
గొలుతురు. పాటలందు తన్మయత్వము జెందినపుడు వారికి
బూనకము కలుగును. ఈ విధముగ నాట్యము చేయునపుడు,
వారు పూనకస్థితియందే అమ్మతల్లి కోరికలను తెలుపుదురు.

పావకుట్టు: దీనిని 'పావకూత్తు' యనిగూడ వ్యవహ
రింతురు. ఈ నాట్యముగూడ, కాళికాలయమునకు సంబంధించి
యున్నది. నాట్యప్రదర్శనము కాళీయాలయమునకు వెలుపల
జరిగినప్పటికిని, ఇదిగూడ లోకమాతయగు కాళికాదేవికి అను
వర్తించ బడుచున్నది. ఈ ప్రదర్శమును కాళికాలయమునకు
సమీపముననే జరుపవలెననెడి విశ్వాసముండినట్లు తెలియు
చున్నది. 'పావకూత్తు' యనిన బొమ్మలాట అని అర్థమున్నది.
దీనిని ప్రదర్శించుటకు ప్రత్యేకముగ నేర్పరచిన రంగస్థలముపై
నొక తెల్లని యవనికను గట్టుదురు. అవనిక వెనుక భాగము

నందు వరుసగా యుంచబడిన జ్యోతులు తెరను కాంతివంత ముగ జేయును. ఇద్దరు పురుషులు తెర వెనుకనైపున నిలిచి బొమ్మలను ఆడించుచు సంభాషణములలోను, పాటలలోను కథాభాగమును వెల్లడించుతురు. సాధారణముగా వీరు రామాయణ కథను ప్రదర్శింతురు. తెలుగు దేశమునందు విశేషముగ ప్రసిద్ధివహించి, సామాన్య ప్రజానీకమునకు ప్రధానమైన 'తోలుబొమ్మలాట' వారికి గల ముఖ్య వినోదములలో నొకటి యైనది. మలబారులోని 'పావకూత్తు' ప్రదర్శనములో వారు తమిళ కవియగు కంబన్ రచించిన రామాయణమును ప్రదర్శింతురు. వీరు రామాయణమును ప్రదర్శించుటకు నెలదినములు పట్టును. ఈ ప్రదర్శనములను అచ్చటి అన్ని శాఖలవారును, కులములవారును జూడవచ్చును. సామాన్య ప్రజలకు యీ కాలమునందు బొమ్మలాట యొక ప్రధానమైన వినోదముగ నుండెను. తెలుగు దేశమందు రెడ్డిరాజుల కాలములో గ్రామ వాసుల వినోదములందు రంగులతో నలంకరించబడిన తోలు బొమ్మలాట విశేషముగ ప్రచారము నందున్నది. ఇట్టి ప్రదర్శనాదికముల రూపములు చైనా దేశమునందును, జావాద్వీపము నందును గూడ కనుపడుచున్నవి.

మలబారు దేశస్థులకు ప్రాచీనకాలము నుండియు కాళీ పూజ ప్రముఖ ప్రాధాన్యత వహించియున్నది. కాని కొంత కాలము గతించిన పిమ్మట కాళీప్రభావము క్రమముగ తగ్గి వారు శ్రీరాముని పూజచేయుట, రామాయణ కథాప్రదర్శ

నములు జరుపుట ఆరంభించిరి. లంకేశ్వరుడగు రావణునిపై శ్రీరాముడు దాడివెడలినపుడు, కాళికాదేవి దారుకను సంహరించెను. రావణుని వధించిన పీదని యామె ప్రత్యక్షముగ జూచుట కవకాశము కలుగలేదు. అందువలన నామె సంతృప్తి కొరకు రామాయణగాధను బొమ్మలాటరూపమున, కాళికాలయము చెంతనే ప్రదర్శింపవలెననెడి నియమమేర్పడెనని యొకగాథ దెలుపుచున్నది. కాని దారుకని వధించిన కాళికాదేవిని జూడవలెననెడి యభిలాష శ్రీరాముని కెందులకు కలుగకుండెనో యీగాధ దెలుపుటలేదు. ఈ ప్రదర్శనమును కాళికాలయమువద్దనే ప్రదర్శింపవలెననెడి నియమము వారికుండుట వలన, కాళికాదేవియందు వారికిగల అచంచల భక్తివిశ్వాసములు స్పష్టమగుచున్నవి. కాని ఆ కాలమందలి ప్రజలలో నొకవిధమగు మార్పు కలిగెనను విషయముగూడ దీనివల్ల ధృవపడుచున్నది. ఆ నాటికి దక్షిణ దేశస్థులగు ద్రవిడులకు ఆర్యులతో సంబంధమేర్పడినది. ఆర్యుల పూజావిధానములు, ఆచారములు మొదలగు వాటిప్రభావము ద్రవిడులపై గనుపించినది. అందువలననే ఆ కాలమందలి స్థానికుల మతవ్యవస్థలందు ఆర్య సంప్రదాయములు ప్రవేశించి, క్రమేపి ఆర్య - ద్రవిడ మిశ్రమ సంప్రదాయములు రూపొందినవి. కాళీపూజ దేశీయమైనది. దానవ నాయకుడగు దారుక శివభక్తుడు. కాళికాదేవి శివుని పుత్రిక. ఇందలి సత్యమును దెలుసుకొనిన పిమ్మట దారుక, కాళికాదేవి వలన మృతినొందుట ముక్తి దాయకమని

యెంచి సంతృప్తితో నసువుల విడిచెను. ఏకకాలమునందే ప్రజలకు శివభక్తి, దేవీపూజ మార్గదర్శకములైనవి. వారు శ్రీరాముని దైవతముగ నెంచి పూజాదికములు ప్రారంభించుటవలన భావికాలమున వైష్ణవారాధనమునకు మార్గము సుగమమైనది. క్రమక్రమముగ కాళికాలయములన్నియును, రామాలయములుగను, విష్ణాలయములుగను పరివర్తనము పొందినవి.

అయ్యప్పన్‌పాట్టు : ప్రాచీన కేరళ దేశమున అమ్మతల్లి పూజ, అయ్యప్పన్, వెట్టకారన్ మొదలగు వారి పూజలు, ప్రాధాన్యత వహించినవి. మలయాళ దైవతమగు 'అయ్యప్పన్, తమిళ దేశమందు "అయ్యనార్" అని వ్యవహరించబడెను. అయ్యప్పన్ ఆరాధనమును రెండు విధములుగ విభజించవచ్చును. మలయాళ దైవతమగు 'అయ్యప్పన్' తమిళదేశమునందు 'అయ్యనార్' యని వ్యవహరించబడెను. అయ్యప్పన్ ఆరాధన రెండు విధములుగ నున్నది. వీటిలో మొదటిది 'తియ్యాట్టు.' దీనికి అగ్ని నాట్యమను పేరుకూడ యున్నది. ఇది స్థూలముగ భగవతి పాట్టును పోలియుండును. అయ్యప్పన్ పాట్టు, వీటిలో రెండవ పద్ధతికి జెందినది. ఇది 'పాన' నాట్యమువలె నుండును. ఈ కథలో గ్రామదేవతయగు అయ్యప్పన్ పులిపాలు దెచ్చుటకు బయలుదేరును. ఆయన మరలివచ్చునపుడు మార్గమధ్యమునందొక మహమ్మదీయ వహాల్వాని గలుసుకొనును. ఈ రెండు పాత్రములను ఇరువురు నటులభినయించెదరు. బలాబలములను నిర్ణయించుకొనుట కిరువురును

పోరు సలుపుదురు. అప్పుడు గాత్రవాద్య గానముల కనుగుణ ముగా వారిద్దరును కత్తి యుద్ధమును జేయుదురు. దైవస్వరూ పుడని విశ్వసించబడిన అయ్యప్పన్ ఖడ్గమును ధరించును. 'వావర్' అను మహమ్మదీయ వజీర్ తన రక్షణకు ఆయుధ మును ధరించును. చిట్టచివర కిరువురును మిత్రులగుదురు. ఈ పరిదర్శనము చారిత్రక ప్రసిద్ధి కలిగియున్నది. దీనివలన హిందు మహమ్మదీయ సౌభ్రాతృత్వమును ఉన్నత స్థాయికి గొని పోవుటకు దోహదము కలుగుచున్నది. హిందూ దేవతారాధ నమునందు మహమ్మదీయ మత ప్రవక్తకు స్థానమును కలిగిం చుట వలన హిందూ మతమందలి ఉదార గుణసంపదయును, పరమత సహిష్ణుతయును వెల్లడి యగుచున్నవి.

పాంపన్ తల్లల్: పుల్లువనుల సర్పారాధనము నుండి ఈ నాట్యము రూపొందినది. నాగదోషము కలిగెనని భావించి నపుడు నాయరులు యీపుల్లువనులనుబిలిపింతురు. వారు సాయం సమయమున వచ్చి పరిశుభ్రము చేసిన యొక గదియందు పెన గొనిన రెండు సర్పముల చిత్రపులను నేలపై గీయుదురు. ఆ రెండు సర్పములును స్త్రీ పురుష భేదములు కలిగియుండును. అప్పుడు నాయర్ కులస్థుడు వచ్చి పూజ చేయును. పూజా సమయమునందు పుల్లువన్ వెలుపలికి వెడలిపోయి దూరముగ నుండును. పూజానంతరము నాయరు ఆప్రదేశము చుట్టును నర్త నముచేయును. ఇది 'పాన'పద్ధతి ననుసరించియుండును. రెండుసర్ప చిత్రపులమీద నిరువురు కన్యకలను కూర్చోనబెట్టుదురు.

పుల్లువన్ గీతములు బాడుచు నర్తనముచేయును. అతనిభార్య యొక విధమగు తంత్రీవాద్యమును ప్రయోగించును. వెంటనే ఆ కన్యకలకు పూనకము కలుగును. అపుడు వారిద్దరును సర్ప ములవలె నాట్యము చేయుదురు. పుల్లువన్ గానమును నిలిపి వారిని కొన్ని ప్రశ్నములు వైచును. వారివలన గృహాయజ మానికి గావలసిన విషయములను దెలుపును. దీనితో పూజా విధానము సమాప్తమగును. ఒక్కొకప్పుడు పుల్లువన్ స్థాన మును, కాళిపూజ లొనర్చు 'కురుప్' నిర్వహించుచుండును.

## లౌకిక నాట్యపద్ధతులు

మతముతో నేదో యొక విధమగు సంబంధముకలిగిన నాట్యపద్ధతులు పైన వివరింపబడినవి. అందువలన కేరళసమాజ మందు దైవప్రేరితముగాని నాట్యపద్ధతులు లేవని భావన జేయ కూడదు. సామాన్య జనవినోదములందు కొన్ని లౌకిక నాట్య పద్ధతులు గూడ యున్నవి. వీటిలో 'పనికలి' యొకటి.

"పనికలి" నాట్యము మలబారులో నివసించుచున్న "పానన్" శాఖయందు గనుపించుచున్నది. ఈ శాఖ సంఘ ములో కడపటి వర్ణములకు జెందినది. దీనికి ఆదరప్రోత్సాహ ములు లేకపోవుటవలన నశించుచున్నది. ఈ నాట్యమునం దొక ఇతివృత్తము యుండవలెననెడి నియమములేదు. దీనిని చాచా ప్రదర్శన మనవచ్చును. ప్రదర్శనము జరిగెడి పల్లెలో, పగటివేళయందు డప్పులతో వెల్లడింతురు. ఇది సాధారణముగా

ఇండ్లముందర దొడ్లలోగాని, బహిరంగ ప్రదేశములలోగాని ప్రదర్శించబడును. దీనియందిరువురు ప్రేమికులు ఆడుచు, అభినయించుచు, దమప్రేమను వెల్లడింతురు. ఒకరినొకరు హేళనము జేసికొందురు. అన్యప్రణయమును గూర్చి యొకరి నొకరు నిష్ఠురోక్తులాడెదరు. వీరి సంభాషణములు గేయరూప మున నుండును. కోమలమగు సుందరనర్తనము జేయుదురు. హాస్యము దీనియందొక విశిష్టాంగమై యుండును. అగ్రవర్ణముల వారి ఆచారవ్యవహారములను అధిక్షేపించుచు సునిశితమగు విమర్శనములు జేయుచు ప్రేక్షకులకు నవ్వు కలిగింతురు. అతడు నాట్యముచేయడు. కాని బాగుగా అభినయించును. ప్రదర్శ నము ముగిసినపిదప ప్రేక్షకులు వారికిదోచిన ద్రవ్యముగు ప్రతి ఫలముగ వారికిచ్చెదరు.

"కొరాటియాట్టం" కొరవన్ శాఖకు జెందిన స్త్రీలకు కొరాటీలను పేరున్నది. వీరు చేయునాట్యము "కొరాటి యాట్టం" అనబడుచున్నది. హస్తసాముద్రికమును జూచుట, భవిష్యత్తు దెలుపుట వీరివృత్తి. వీరు తరుచుగా గ్రామములందు దిరుగుచుందురు. దీనియందిరువురు స్త్రీ పాత్రధారులు నాట్య మును జేయుదురు. వారిరువురును శివ విష్ణుదైవముల ప్రియ కాంతలని విశ్వాసము. జంత్రవాద్యముల కనుగుణముగా వారు భావమును అభినయింతురు. వారివారి భర్తల గొప్పదనమును ప్రశంస చేయుచుండగా రెండవవారు అవహేళనము జేయు

డును. ఇందలి పదములు సులభముగ నర్థమగు వ్యావహారిక మలయాళ భాషయందుండును.

కైకొట్టికళి : నాయకులలోను, నంబూద్రీలలోను ప్రచారమందున్నదీనాట్యము. చేతులతో చప్పట్లు చరుచుచు స్త్రీలు, పురుషులుగలిసి ఈ నాట్యమును జేయుదురు. చప్పట్లతో తాళము వేయుచు కుండలి యాకారమున నిలిచి తాళమునకు అనుగుణముగా అడుగులు వేయుచు, పదములుపాడుచు, నర్తనము జేయుట వారి యాచారము. శ్రీకృష్ణుడు గోపకన్యకలతో జేసిన నర్తనముగూడ నిట్టిదేనని దెలియవచ్చుచున్నది. కాని రెంటికిని పదములందును, తాళమందును భేదమున్నది. 'కుమ్మి' యను నాట్యపద్ధతినుండి కథాకలి నాట్యమందు కొన్ని పద్ధతులు యేర్పరచబడినవి.

ఇజముట్టి: ఒకనాడు అంబలవాసీలలో బహుళముగ వ్యాప్తిగాంచిన ఈనాట్యపద్ధతి కాలక్రమమున విస్మృతమైపోయినది. ఇది యొకవిధమగు గృహవినోదము. వెలుగుచున్న జ్యోతి చుట్టును కొందరు కూర్చొని యుండగా వారిలో యొకరు తంత్రీ వాద్యమును ప్రయోగించుచు ప్రశ్నములరూపమందున్న గీతమును బాడుదురు. ప్రేక్షకులందొకొక్కరు ప్రశ్నము లడుగుదురు. అట్టి ప్రశ్నములకు సరియైన ప్రత్యుత్తరమును జెప్పలేనివారు, వారు విధించెడి శిక్షకు గురికావలయును. ఇట్లోటమి జెందినవారు వారికిగల కళాభి నివేశమునుబట్టి యొక కళాప్రదర్శనము గావింపవలెను. క్లిష్టమగు షరతులు కలిగిన ఈ వినో

దమందలి ప్రశ్నలుపజ్ఞాసహితము లైనవి. ప్రశ్నలకుదగిన సమాధానముల నొసగుటకుగూడ ప్రాజ్ఞత గావలయును. అందువలన నీ వినోదమందు విజ్ఞానవతులగు యువతులు మాత్రమే పాల్గొనెదరని దెలియుచున్నది.

మోహినియాట్టం: ఈ నాట్యమొకనాడు విశేషముగ ప్రసిద్ధి గాంచియుండెను. శృంగారయుతమగు రూప సౌందర్యముతోడను, నృత్యగానాభినయకౌశలముతోడను, నర్తకి సామాజికులనురంజించును. దీనియందు ఆంగికాభినయము ప్రధానమైనది ఇందొక నర్తకిమాత్రమే అభినయ పురస్సరముగ నాట్యము జేయును. సదాశివుని వేసటబెట్టిన దానవుని వశీకృతుని చేసికొనుటకు మహావిష్ణువు మోహినీరూపమును ధరించిన గాథ ఈ నాట్యమునకు ప్రేరణ కలిగించినది. కాని నాట్యమందలి గీతములు ఇందలి కథావృత్తమునకు సంబంధించినవి గావు. ఈ నాట్యమును అభ్యసించిన స్త్రీలు క్రమేపి నైతికముగ బతనము జెందిరి. వారితోబాటు ఈ నాట్యముగూడ కాలగర్భమునందు మరుగుపడి పోయినది.

మలబారులోని భిన్న నాట్యపద్ధతులను తుల్లల్, పాట్టు, ఆట్టం, కలియను శబ్దములు సూచించుచున్నవి. వీటియందలి పాట్టుయను శబ్దము గీతమను యర్థమును తెలుపుచున్నది. మిగిలిన శబ్దములన్నియును అభినయమునకు వర్తించుచున్నవి. మలబారు నాట్యకళయందు భిన్న నాట్యపద్ధతులను సూచించెడి నామములన్నియును దేశ భాషనుండి బుట్టినవి. ఆధునిక

తమిళ భాషయందలి కూత్తు, ఆట్టం అను శబ్దములు నాటకము నకుపయోగింపబడుచున్నవి. దేశి నాట్యపద్ధతులు విరివిగ ప్రచారమందున్న దినములలోగూడ భరత సంప్రదాయము ననుసరించిన మార్గపద్ధతి ప్రజల యాదరాభిమానములు బొందినది. ఆర్యానార్యజాతుల సంసర్గప్రభావము మత, సాంఘిక, విజ్ఞానరంగములందే గాక నాట్యకళయందుగూడ ముద్రాపితమైనది. సంస్కృత వాఙ్మయము నుండియు, పురాణగాథల నుండియు, గ్రహించబడిన కొన్ని నాట్యపద్ధతులుగూడ నీ కాలమందు ప్రసిద్ధిగాంచినవి.

యాత్రక్కలి: కాలక్రమమున బురాణపురుషులగు శ్రీరాముడు, కృష్ణుడు మున్నగువారు దైవస్థానముల నలంకరించిరి. ఈ నాట్యపద్ధతులను కొన్ని సంఘముల వారవలంబించుటవలన వారికి ప్రత్యేకముగ సంఘకలి, యాత్రక్కలియను పేర్లు కలిగినవి. నంబూద్రిలు మాత్రమే ఈ నాట్యమును అభ్యసించిరి. దీనియందు కలి, నాలుపదం, వెక్కల్, పాన, అంగ్యంగల్, హాస్యంగల్ ప్రధానమైనది. నాలుపదం వెక్కల్ అను నాట్యమున, ఒక దీపము జుట్టును దిరుగుచు మలయాళ భాషలో గీతములుబాడుచు నర్తనము జేయుదురు కత్తి యుద్ధమునకు 'అంగ్యంగల్' అనుపేరు కలిగినది. నాయరు శాఖకు చెందినవారీ నాట్యమును జేయుదురు. వారు సైనిక దుస్తులతో నీ నాట్యమును జేయుదురు. సహజముగ ధైర్య సాహసాది గుణములు గలిగిన నాయరుశాఖవారు సైనికశాఖ

యందు జేరి తమ పరాక్రమమును నిత్యజీవితమును గూడ ప్రదర్శించుచుండిరి.

పతాకం, నంగ్యార్ కూత్తు అని మరి రెండు నాట్యపద్ధతులు దేవాలయమునందేగాక ఇతరప్రదేశములందుగూడ నంబియారు లచేత ప్రదర్శింపబడుచున్నవని తెలియుచున్నది. వీటియందు నాట్యముగాని, గానముగాని యుండదు. దీనియందొక కథను వ్యంగ్యముగను, విమర్శనాపూర్వకముగను వివరింతురు. ఇందలి కథను జెప్పునపుడు వారిస్త్రీలు నృత్యగానములు జేయుదురు.

కృష్ణాట్టం, అష్టపదియాట్టం, అను ముఖ్యనాట్య పద్ధతులు రెండును, మలబారునందు అభినయప్రాధాన్యతను కలిగి వర్ధిల్లిన కథాకలి తోబాటు ప్రత్యేక విశిష్టతను కలిగియున్నవి. కృష్ణాట్టమునందు కృష్ణుని జీవితము కథావస్తువుగా గ్రహించబడినది. కాని దీనిలో రాధాకృష్ణుల వృత్తాంతములేదు. వారు దీనిని భాగవత పురాణమునుండి గ్రహించిరి. ఇందులో నాలుగు చరణములు కలిగిన శ్లోకములును వాటి పిమ్మట గీతములును ఉన్నవి. శ్రీకృష్ణుని జీవితమును ఎనిమిదిభాగములుగ విభజించి దీని నెనిమిది దినములు ప్రదర్శింతురు. ఇది సంస్కృతభాష యందుండును. నాట్యపద్ధతులు, అంగహారములు భరతుని నాట్యశాస్త్రముననుసరించి జెప్పబడియున్నవి. దీనియందు పాల్గొనెడి పాత్రధారులుఆయాపాత్రములకుచితమగు దుస్తులనుధరించి ముఖములకు రంగుల నుపయోగింతురు. తెలుగు దేశమందలి రాసక్రీడయను నాట్యవృత్తివలె కృష్ణుడు గోపికలతో గలిసి

జేయునాట్యము యుండును. పూర్వము వివరించిన కుండలి యను నాట్యమును రాసక్రీడయును రెంకెభావార్థమును కలిగి యున్నవి. ఇందలి అభినయము కథాకలియందలి అభినయము వలె క్లిష్టమైనది గాదు.

అష్టపదియాట్టం: జయదేవ కవి వ్రాసినగీత గోవిందమును వీరు నాటకరూపమున ప్రదర్శింతురు. జయదేవకవికృతియగు గీతగోవిందం నాటకరూపమున దేశమునందెచ్చటను ప్రదర్శింపబడలేదు. ఆయన వంగదేశమునందు జన్మించెను. వంగ దేశమునందు వికసించిన కవితా ప్రసూనము సుదూరమందున్న కేరళదేశమందు పరిమళించినది. కావ్య, కళాసృష్టులు రెండును మానవకుటుంబవ్యవస్థనే ఏకైక లక్ష్యముగా గలిగియున్నవి. వీటి ప్రభావము విశ్వజనీనమైనది. అట్టియెడ గుణగరిష్టమైన జయదేవుని కావ్యశిల్పము కేరళదేశీయులనే తొలుత నాకర్షించి వినూత్నసృష్టికి ప్రేరణ కలిగించుటయందబ్బురము లేదు. వీరు ప్రదర్శించెడి రూపకమునందు అష్టపదులను కవి భాషయందే గానము జేయుదురు. నర్తనము, అభినయము జేయునపుడు వాద్యగానమనుసరించును. గీత గోవిందము రాధాకృష్ణుల శృంగారలీలలు వర్ణించుచున్నది. ఇందలికథయందు జయదేవ కవియొక దూతికను ప్రవేశపెట్టెను. ముక్తిపథమును జేరుటకు భక్తిమార్గమొక తరణియనియు, అట్టి భక్తిని సేవక సేవ్యభావమున, ప్రేమవలన బొందవచ్చుననియు రాధాకృష్ణుల దైతిహ్యము బోధించుచున్నది.

# దక్షిణాంధ్రనాయక రాజుల కళాపోషణము

హిందూరాజులు నెలకొల్పినవిజయనగర సామ్రాజ్యము తల్లికోటయుద్ధానంతరము పూర్వవైభవమును గోల్పోయి క్రమేపి అంతరించినది. దక్కను దేశమున బహమనీ వంశస్థులు మహమ్మదీయరాజ్యముల నేర్పరచుకొని వారిలోవారు తగవులాడుకొనుచు దేశమునందు అశాంతిని గలిగించిరి. అప్పుడనేక మంది మొగలువంశపురాజులు ఢిల్లీనగరమును రాజధానిగా జేసుకొని ఉత్తరదేశమును బరిపాలించుచుండిరి. హిందూమతము, విగ్రహారాధనము, వారికి గంటకప్రాయముగ గన్పట్టినవి, ఇస్లాం మతమును వ్యాపింపజేయుట, ముస్లిమేతరులను వధించుట అల్లాకు బ్రీతికరమని వారు విశ్వసించిరి. హిందువుల పుణ్య క్షేత్రములందలి దేవాలయములలోని విగ్రహములను బగుల గొట్టుట, అచ్చటి నిధినిక్షేపములను దోచుకొనుట, విజ్ఞాననిలయములగు గ్రంథాగారములను దగులబెట్టుట, వారి పైశాచికోల్లాసము లైనవి. మహమ్మదీయులదండయాత్రలవలన దేశమందలి యనేక పుణ్యక్షేత్రములందలి శిల్పకళా విజ్ఞానము రూపహీనమైనశించినది. అనేక ప్రాచీన శాస్త్రగ్రంథములు అగ్నికాహుతి యైనవి. వారి పిమ్మట దేశమును బాలించిన మొగలురాజులకు మహమ్మదీయ సామ్రాజ్యమును నెలకొల్పవలెననెడి కాంక్ష

ప్రబలముగ గలిగినది. కాగా వారు సమీపమందలి చిన్న రాజ్యములపైన తరుచుగా యుద్ధములు జేయుచుండిరి. అందు వలననే దక్కనులోని బహమినీ రాజ్యముల అంతఃకలహముల పట్ల ఢిల్లీ సుల్తానులు శ్రద్ధవహించుచుండిరి. బహమినీరాజ్యములు అంతరించుటకు పూర్వమే వరంగలులోని కాకతీయరాజ్యము మహమ్మదీయుల యనాదరణమునకు గురియై కాలక్రమము నందది అంతరించినది. కాని, నేటికిని అచ్చట సజీవమైనిలచి యున్న వరంగలు కోటలోని సహస్రమంటపమును, అజంతా గుహాలలోని చిత్రకళా సముచ్చయమును, ప్రాచీన విభవమును కళావిజ్ఞానమును జాటుచున్నవి. వీటియందలి కొన్ని చిత్తరువులు ప్రాచీననాట్యకళా సంప్రదాయములను, అంగికాభినయమందలి కొన్ని ముద్రలనుదెలుపుచు, నాట్యకళాసాధకునకును, పరిశోధకు నకును అత్యంతప్రయోజనకరముగ నున్నవి.

దక్షిణాంధ్రదేశమునందు ఆంధ్రనాయకరాజులు క్రీ. వె. 16 వ శతాబ్దారంభమునుండియు పరిపాలనము జేసిరి. వీరి ముఖ్యపట్టణము తంజావూరు. పదహారవ శతాబ్దకాలమున తంజావూరు నాయకులు స్వాతంత్రపరిపాలనము జేయుచుండినప్ప టికిని వారు విజయనగర రాజులకు గప్పములు జెల్లించుచుండిరి. తమిళదేశమంతయును క్రీ. వె. 14వ శతాబ్దమధ్యమున రాయలు వంశ ప్రభువుల పరిపాలనము క్రిందకువచ్చినది. కొన్ని శాసన ములవలన గ్రంథముల వలన అప్పుడప్పుడు స్థానికనాయకులగు మండలేశ్వరులు తిరుగుబాట్లు జరిపినట్లు తెలియుచున్నది. కృష్ణ

దేవరాయలు కాలమునాటికి పరిపాలనా సౌలభ్యతకొరకు మండలములు పునర్విభజనము జేయబడినవి. ఆ కాలమునందు కేంద్ర ప్రభుత్వాధికారులే మండలాధికారమును నిర్వహించుచుండిరి. అచ్యుతరాయలు దక్షిణ దండయాత్రానంతరము తంజావూరు ప్రాంతములందలి పరిపాలక యంత్రాంగమును పటిష్ఠముగావించి, ఆమరుసటి సంవత్సరమున శ్రీరంగముపైన దాడివెడలినట్లు చరిత్రవలన దెలియుచున్నది.

దక్షిణదేశ చరిత్రయందు తంజావూరు ఆంధ్రనాయక రాజుల చరిత్రమిక్కిలి ప్రసిద్ధివహించినది. నాయకరాజుల కాలమునందుగూడరాయలుయుగమునవలె తెలుగుసాహిత్యము, శాస్త్రములు, కళలు, సంస్కృతి మహోన్నతస్థితియందుండెను. నాయకరాజ్యస్థాపనము జేసిన మూల పురుషుడు సేవప్ప నాయకుడు. ఆయన క్రీ. వె 1532 వ సంవత్సరమున నాయక వంశమునకు అంకురార్పణము జేసెను. ఆ వెనుక నాయకవంశ రాజులలో ప్రసిద్ధిగాంచిన రఘునాధనాయకుడు క్రీ. వె. 1600 నుండి 1634 వరకు దేశమును పాలించెను. గోవిందదీక్షితుడు ఆయనకు మంత్రిగనుండెను. రఘునాధనాయకుడు దానశీలి. ఆయన పరమతసహిష్ణతగలిగియుండెను. గానకళయందాయన ప్రవీణుడు. కర్ణాటకసంగీత శాస్త్రమునకాయన ప్రామాణికుడని చెప్పబడుచున్నది. జయంత మొదలగు కొన్ని స్వతంత్ర రాగములను. రామానంద మొదలగు దాళములను, ఆయన కల్పన జేసినట్లు దెలిపెడి నిదర్శనములున్నవి. "సంగీతసుధ"యను

గాన శాస్త్రమునుగూడ ఆయన రచించెనని చరిత్రాకారులు నుడువుచుండిరి. కాని సంగీతశాస్త్రపారంగదుడు, అమాత్యు డగు గోవింద దీక్షితుని ద్వితీయపుత్రుడు వెంకటమఖి, సంగీత సుధయను శాస్త్రగ్రంధమును రఘునాధుని కోరికపై గోవింద దీక్షితుడే వ్రాసెనని, వేరొకచోట దెలిపియుండెను. రఘునాధుడు సంగీతశాస్త్రపోషకుడు గనుకనే కొన్ని స్వతంత్రరాగములను గల్పించెను. ఆయనవద్ద అమాత్యుడగు గోవిందదీక్షితుడును సంగీత విద్యాపారంగదుడే అయియుండెను. ఉభయులును సంప్రదించుకొనిన పిదప రఘునాధుడు " సంగీతసుధ " ను రచించుట యసంభవముగాదు. రఘునాధనాయకుని ఆస్తానము కవిగాయక పండిత ప్రకాండులకు నెలవైనది. ఆయాస్తానమందు గోవిందదీక్షితుడు, ఆయన యిరువురు పుత్రులు రాజచూడా మణి దీక్షితుడు, భాస్కరదీక్షితుడు మున్నగువారుండిరి. రాయలు పాలనమున రాజాస్తానమునందుండిన లక్ష్మికుమార తాతాచార్యులు గూడ రఘునాధనాయకుని యాస్థానము నందుండినట్లు తెలియుచున్నది. నృత్తగానాభినయకళలయందు ప్రవీణురాలగు రామభద్రాంబయును రఘునాధనాయకుని సభాగౌరవమునంది బహుళ ఖ్యాతిగాంచినది. ఆంధ్రసాహి త్యాభివృద్ధికి ఆకాలమందే అవిరళమగు కృషిజరిగినది. యక్ష గానములు నాటకరూపమున ప్రదర్శింపబెడి యాచారమేర్పడినది. ఆయన తమిళ సాహిత్యమును గూడ ప్రోత్సహించెను. "తిరువ య్యార్ మహాత్మ్యం" అను గ్రంథము ఆయన ఆదరణము

వలననే వెలువడెనని తెలియుచున్నది. ఆయన అప్పయ్యదీక్షితుని అద్వైత సిద్ధాంతమును బరిష్కరించెను. అందువలననే, ఆయనకు గల విద్యావదాన్యతను గణనచేసి "అద్వైతవిద్యాచార్య" యను బిరుదమునుగూడ యొసగియుండవచ్చును. నాయక రాజులు వైష్ణవ భక్తులు. కాని వారికిగలయుదార గుణసంపద వలననే వైష్ణవమతముతోబాటు శైవమతముగూడ రాజాదరణమునుబొంది యభివృద్ధిగాంచినది. శైవదేవాలయములు బహుళముగా రూపొందుటకు గోవిందదీక్షితుడు లెస్సగ తోడ్పడియుండుట యొక కారణముగావచ్చును.

రఘునాధనాయకుని యనంతరమువిజయరాఘువనాయకుడు నాయక రాజ్యమును క్రీ. వె. 1663 నుండి క్రీ. వె. 1673 వరకును పరిపాలించెను.

విజయరాఘవ నాయకుడు రాజ్యాధిపత్యము స్వీకరించిన కాలమునుగురించి చరిత్రకారులు భిన్నాభిప్రాయములు కలిగి యుండిరి. అట్టినిర్ణయ బాధ్యతను చరిత్రకారులకే విడచి విజయ రాఘవనాయకుని కాలమునందు జరిగిన కళాభివృద్దిని గురించి దెలుసుకొనుట ప్రకృతకర్తవ్యము. ఆయన యాస్థానమునందు వైష్ణవాచార్యుడగు కుమార తాతాచార్యులు యుండెను. తెలుగు పదకర్తలలో ప్రసిద్ధుడు, నాట్యాభినయము లక్షప్రాయమగు "మువ్వగోపాల" పదములు రచించిన క్షేత్రయ్య, విజయరాఘవనాయకుని యాస్థానమునందు సన్మానితులైరి. నేటికిని తంజావూరు, మధుర, మున్నగు ప్రాంతములందలి

న ర్తకులును, తెలుగు దేశమందలి భాగవతులును ఆయన రచించిన పదములనే పాడుచు, అభినయము చేయుచుండిరి. రంగ రాజమ్మ మొదలగు కవయిత్రులును, సంగీత శాస్త్రకోవిదు లును గూడ ఆయన ఆస్థానము నలంకరించినట్లు తెలియు చున్నది. విజయరాఘవ నాయకుడును ఆయన పుత్రుడగు మన్నారుదాసయును ప్రసిద్ధ గ్రంథకర్తలైయుండిరి. తెలుగు వాఙ్మయమునందు ప్రబంధసాహిత్యమున అలసాని పెద్దన ఘంటాపథములగు మార్గములనేర్పరచి వరవళ్ళుబెట్టెను. నాటి నాటక సంగీతలక్షణ గ్రంథములు భావికాలమునకు ప్రామాణి కములైనవి.

నాయక రాజులలో చంగమలదాసు కడపటివాడు. ఆయన క్రీ. వె. 1674 నుండి 1675 వరకు రాజ్యమును పాలిం చెను. ఆకాలమున మహారాష్ట్రులు తంజావూరు సింహాసనము నాక్రమించవలెనని కృషిచేయుచుండిరి. తంజావూరు పతనానంత రము విజయరాఘవనాయకుడు ఆయన కుమారుడగు మన్నారు దాస మరణించిరి. మధుర దళవాయియగు చొక్కనాథ నాయ కుడు, తన సవతితమ్ముడగు అలగిరి నాయకుని తంజావూరునకు మండలాధి కారిగ నియమించెను. అలగిరి తంజా వూరు మండలాధికారమును స్వీకరించి శాంతిభద్రతలు నెలగొల్పెను. అధికారమువహించిన మొదటి సంవత్సరము నందు మాత్రము ఆయన వసూలు చేసిన, ప్రభుత్వ శిస్తులను మధుర నాయకులకు జెల్లించెను. ఆయన రెండవ సంవత్సరము

నాటికి బలమును జేకూర్చుకొని నాయకులను ధిక్కరించెను. విజయరాఘవనాయకునివద్ద లేఖకుడుగనున్న వెంకన్నయను నియోగి బ్రాహ్మణుని ఆంతరంగికోద్యోగిగా అలగిరి నియమించెనని కొన్నినిదర్శనములవలన తెలియుచున్నది. చొక్కనాథనాయకుడు అలగిరిపై యాగ్రహము వహించలేదు. కొంత కాలము గడచినపిమ్మట నాయకవంశము బూర్తిగ నశింపలేదనియు, వారి వారసులొకనిని నాగపట్టణమందలి యొక వైశ్యుడు బెంచుచుండెననియు దెలిసినది. తంజావూరు సింహాసనమునకు వారసుడుండుట, అలగిరి చొక్కనాథ నాయకుల మధ్యనేర్పడిన కలతలు మొదలగువాటి నవకాశములుగా గ్రహించి వెంకన్న అలగిరిపతనమున కొక వ్యూహమును పన్నెనని జెప్పబడుచున్నది. తంజావూరు సింహాసనమున నాయకవంశపు వారసుని నిలుపవలెనని వెంకన్న నాగపట్టణమునకు వెళ్లెను. అక్కడ వెంకన్న, చెంగమలదాసుతో జేరి, బీజపూరు సుల్తాను సహాయమర్థించెను. సుల్తానునకు, చెంగమలదాసు నాయకవంశపు వారసుడని జెప్పి వెంకన్న యాతనికి నమ్మకముగలిగించెను. అలగిరిని తంజావూరు నుండి తరిమివేయుటకు బీజపూరు సుల్తాను ఏకోజీనాయకత్వము క్రింద కొంత సైన్యమునుబంపెను. మార్గమధ్యమునందాతడు ఆరణి కోటను ముట్టడించెను. శత్రుదాడి నెరింగి అలగిరి చొక్కనాధునిసహాయమునర్థించెను.కాని యాతడు అలగిరికిసహాయము జేయ నిరాకరించెను. అలగిరి అయ్యంపేటవద్ద ఏకోజీసైన్య

ములతో బోరుసరిపెను. అప్పుడు ఏకోజి చెంగమలదాసును తంజావూరు సింహాసనమునకు పట్టాభిషిక్తునిగా జేసెను. చంగమలదాసు ఏకోజీకి కొన్ని పట్టణములను బహుమానముగ నిచ్చెను. వెంకన్న ఏదేని యొక గొప్పపదవి తనకు లభించునని ఆశించెను. కాని చెంగమలదాసు అట్టిపదవిని నాగపట్టణములోని వైశ్యునకిచ్చెను. వెంకన్న కినుకవహించి, ఏకోజీకి యదార్థస్థితి నెరింగించి తనకు సహాయము జేయవలెననికోరెను. ఏకోజీ తిరిగి తంజావూరుపై దాడిజేసెను. ఏకోజీ దక్షిణదేశ తంజావూరు నాక్రమించుకొనుటతో, దేశమునందు మహారాష్ట్రాధికారమునకు అంకురార్పణము జరిగినది.

నాయకరాజుల కాలమునందు 54 మంది కవులు ప్రసిద్ధులైయుండిరని తెలియుచున్నది. సంస్కృత, ఆంధ్ర తమిళభాషల వ్యాప్తికి వారు విశేషముగ దోడ్పడిరి. దేవాలయములకు, మఠములకు వారు మాన్యములిచ్చిరి. యక్షగానములు వీరి కాలమునందే ప్రసిద్ధివహించినవి. రఘునాథ నాయకుని కాలమున రాజప్రాసాదమునందు నిర్మించిన నాట్యమంటమునందు నృత్యగాన ప్రదర్శనములు రాజసన్నిధిని జరుపబడెనని దెలియుచున్నది. అప్పుడు స్త్రీలు మృదంగము, వీణ మొదలగు సంగీత నాట్యములందు సిద్ధహస్తులైయుండిరి. విజయరాఘవనాయకుడు రచించిన "రఘునాథాభ్యుదయం" అను నాటకమునందు రాజప్రసాదములోని గోడలపై చిత్రించిన మనోహర దృశ్యములు, చారిత్రకఘట్టములు దర్బారులు

వర్ణించబడినవి. వెంకటమఖి 'చతుర్దండి ప్రకాశిక' యను ఒక సంగీతశాస్త్ర గ్రంథమును వ్రాసెను. సంగీతమునందు కర్ణాటక సంప్రదాయ పునరుద్ధరణమునకు ఆయన అమూల్యమగు కృషి జేసెను. ప్రస్తుతము తంజావూరునందున్న తంజావూరు రాజప్రాసాద గ్రంథాలయము, పూర్వకాలమున నాయకరాజులకు జెందియుండెను.

తమిళ దేశమున ఆంధ్రనాయక రాజులు నెలగొల్పిన రాజ్యమునందు తెలుగు తమిళ భాషలు రెండును అభివృద్ధిపొందినవి. రెండు భాషలందును యనేక దేశిపదములు ప్రవేశించి భాషావికాసమునకు దోడ్పడినవి. ఆంధ్ర నాయకరాజుల యాస్థానములందు తెలుగు కవులు, గాయకులు, విలసిల్లిరి తెలుగు రాజుల యాదరణమువలన తెలుగుదేశమందలి భాగవతులు, భరతశాస్త్రకోవిదులు అచ్చటికేగి తమ వైదుష్యమును ప్రకటించి ప్రఖ్యాతులైరి. స్థానిక పరిజనులును భరతశాస్త్రములు వీరి వద్దనే యభ్యసించి, వీరి సంప్రదాయములను అనుసరించి ప్రచారముగావించిరి

ఆంధ్రనాయక రాజ్యమందు ఆంధ్ర తమిళ ప్రజలకేర్పడిన సన్నిహితత్వమువలన ఆంధ్రుల భరతనాట్య శాస్త్ర విజ్ఞానమచ్చట సుప్రతిష్ఠితమైనది. ఉదాత్తమగు నీ కళావిజ్ఞానము, తెలుగు భాషయందలి వివిధ మధురపద కవితాసముచ్చయము, రసజ్ఞలోకముపై తమ ప్రభావమునుజూపినవి. రెండుభిన్న భాషా సంప్రదాయములును స్వీయవ్యక్తిత్వముతో, విశిష్టతతో

స్వక్రమాభివృద్ధిని గాంచి గుణాధిక్యతను ముద్రాపితము చేసి నాయకరాజుల కాలమును దక్షిణ దేశ చరిత్రయందొక యుజ్వల ఘట్టముగ నలరించినవి.

## మధుర - ఆంధ్రనాయక రాజులు

విజయనగర సామ్రాజ్యమందు మండలేశ్వరుల వంశము నకు జెందిన ఆంధ్రనాయక రాజులు మధురను ముఖ్యపట్టణ ముగ జేసికొని రమారమి 335 సంవత్సరములు పాలించిరి. విజయనగర పతనానంతరము దేశముపై దండయాత్రలు జేసిన మహమ్మదీయుల విజృంభణము నెదుర్కొనుచు, హిందూ రాజ్యస్థాపనమునకు జేసిన కృషియొక్క ఫలితమే మధు నాయకరాజుల చరిత్రయనవచ్చును. వీరి పరిపాలనాకాలమందే ఆంగ్లేయులు కర్ణాటక దేశము నాక్రమించుకొనుట జరిగినది. కృష్ణ దేవరాయలు యొక్క ఆంతరంగికోద్యోగులలో నొకరగు విశ్వనాథ నాయకుడు క్రీ. శ. 1529 లో మధురయందు నాయక రాజ్యమును స్థాపించి క్రీ. శ. 1564 వరకును బరి పాలించెను. నాయకరాజుల నాటి చరిత్రనుగురించి, తంజా వూరు నాయకరాజుల కాలమునందు వెలువడిన "సాహిత్య రత్నాకరం," "రుక్మిణీపరిణయం" అను సంస్కృత గ్రంథములం దును, మధురను గురించిచేసిన వర్ణనలందును తెలియుచున్నది. తిరుమల నాయకుని కాలమున వారి ముఖ్యపట్టణము మధురనుండి తిరుచినాపల్లికి మార్చబడెను.

మధుర నాయకరాజుల పరిపాలనమునందు విశేష భాగము యుద్ధములతో గడచినది. తరుచుగా దేశమందు క్షామదుర్భిక్షములు ప్రబలుటవలన సాంఘికజీవితము యొుడుదుడుకులకు గురియైనది. నాయకరాజులు దైవభక్తిపరులై యుండిరి.వారు అనేక దేవాలయములను గట్టించి వాటిపోషణాదికములకు మాన్యముల నిచ్చిరి. పరమతసహనమును వారు కలిగి యుండిరి. కొన్ని మసీదులకును, మతసంస్థలకును వార్షికముల నిచ్చిరి. మహమ్మదీయులతో నాయకరాజుల కేర్పడిన పరిచయమువలన, మహమ్మదీయ సుల్తానులవలె నాయకరాజులును అంతఃపుర పరివారమును యుంచిరి. తిరుమల నాయకునకు 200మంది భార్యలుండిరని విదేశయాత్రికుల రచనలవలన తెలియుచున్నది. మధుర నాయకరాజులు సంస్కృతాంధ్ర తమిళ భాషల యభివృద్ధికి దోడ్పడిరి. వారిలో ముఖ్యముగ తిరుమల, విజయరంగ చొక్కనాధనాయకులు తెలుగు భాషావికాసమునకు లెస్సగ కృషి జేసిరి. కాని వారి కాలమునందు నాట్య కళా వ్యాప్తికి అధికముగ తోడ్పడినట్లు గనుపించదు. మధురను పాలించిన నాయకరాజుల యనంతరము మహారాష్ట్రులు దేశమును బరిపాలించిరి.

మహారాష్ట్ర రాజులలో శహజీ తులజాజీ, శరభోజీ రాజులు ముఖ్యులు. వీరి పరిపాలనాకాలమునందు నాట్యాభివృద్ధికి సముచితమగు కృషి జరిగినది. తులజాజీ కాలమునందు తంజావూరు జిల్లాయందు యువరంగయను జమీందారొక్క

రుండెను. దక్షిణాపథమునందు ఆయనకు అభినవ భోజుడన్న ప్రసిద్ధి కలిగినట్లు తెలియుచున్నది. ఆయన యాస్థానమునందు గోపాలశాస్త్రియను నొక యుద్దండ కవి యుండెనని జెప్పబడు చున్నది. ప్రసిద్ధకవి, పదరక్తయగు మేలటూరు వెంకటరామ శాస్త్రి, శరభోజీ సమకాలికుడై యుండినట్లు తెలియుచున్నది. ఈకాలమునందే నాట్యోపయుక్తములగు కీర్తనలకుపదముల నెడి నామము కలిగినది. ఈకాలమునందుపదరచన విరివిగసాగుట వారి వలన మహారాష్ట్రుల కాలములోగూడ నృత్యగీతాభినయములు అభ్యున్నతస్థితియందే యుండెనని స్పష్టమగుచున్నది.



# నాట్యపద కర్తలు - భిన్న పదములు

గానమునకు, అభినయమునకు నాట్యమునందు గీతములు ప్రధానమైనవి. ప్రాచీనకాలమునందు నాట్యాభినయములకు కృష్ణకర్ణామృతమునందు కొన్ని శ్లోకములు, శృంగార తిలక, శృంగారభూషణ, పుష్పబాణ విలాసమునందలి శృంగార పద్యములు, జతిస్వరములలో కొన్ని తెగలు ఉపయోగించిరి. జయదేవకవి గీతగోవిందం, తీర్థనారాయణస్వామి యతి రచించిన కృష్ణలీలాతరంగిణి, తాళ్ళపాక అన్నమాచార్యులు వ్రాసిన ఆధ్యాత్మ సంకీర్తనలు మున్నగునవి గూడ అభినయమునకు దోడ్పడినవి. ఈ కాలమునందు నాట్యమునకుపకరించెడి గీతములకు పదములను నామము రూఢియైనది. తెలుగు కన్నడ దేశములందు క్రీ. వె. 17,18, శతాబ్దులయందు విరివిగ సాగిన పదరచనకు నాటి గానకళ యాలంబనమైనది. నాట్యము శృంగారరస భూయిష్టమగుటజేసి అభినయమునకు శృంగార పదములు గ్రహించబడినవి.

సుబ్రహ్మణ్యదీక్షితుడు కొందరు ప్రాచీన పదకర్తలను వారి మకుటములను దెలిపెను.

ఘటపల్లివారు : కైలాసపతి
జటపల్లివారు : జటపల్లి గోపాల
శోభనగిరి : శోభనగిరి
బొల్లాపురమువారు : బొల్లవరము

వినుకొండవారు : వినుకొండ విజయరామ
వేనంగివారు : వేనంగి
మల్లికార్జునుడు : మల్లికార్జున: కృష్ణ
క్షేత్రయ్య : మువ్వగోపాల
మొవ్వలూరి సేనాపతిఅయ్య : రాజగోపాల
వీరభద్రయ్య : వరద వెంకటేశ్వర
తాళ్ళపాకవారు : శ్రీ వెంకటేశ
మాతృబుద్ధేశ్వరవారు: దామెరకుమార వేంకటభూపాల
యువరంగ : యువరంగ
ముత్తుతాండవర్ : నటరాజ
పాపవినాశ మొదలియార్ : నిందాస్తుతి
సారంగపాణి : వేణుగోపాల
పరిమళరంగ : పరిమళ రంగ
ఘనం సీనయ్య : మన్నారు రంగ
కస్తూరిరంగ : రంగేశ.
మేలటూరు వెంకటరామశాస్త్రి : మల్లజేంద్ర

వీరి పదములకు స్వరకల్పనలో నీ దిగువ రాగము లుపయోగించబడినవి. సురటి, శంకరాభరణము, రీతిగౌళ, ఎరుకుల కాంభోజి, అఠాణా, కాంభోజి, నీలాంబరి, ఆహిరి, ఆనందభైరవి, వారళి, గౌరి, కురంజి, ఆసావేరి, సౌరాష్ట్రి, జయవంత్, నాదనామక్రియ, కామవర్ధిని, శహాన, కేదారగౌళ,

సైంధవి, బేహాగ్, మాలవశ్రీ, పున్నాగవరళి, ఘంట, తోడి, పూర్వకాంభోజి పూర్వి, భూపాల, ధన్యాసి మొదలగునవి.

క్షేత్రయ్య: వీరు కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామవాసి యని భాషాశాస్త్రవేత్తలు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుదృఢముగ నిరూపించిరి. గురూపదేశమువలన క్షేత్రయ్య జీవితము సార్థకత బొందినది. తెలుగు పద కర్తలలో వీరు ప్రసిద్ధులు. వీరు రమారమి 4500 పదములు రచించిరని తెలియుచున్నది. సారస్వతార్చకులు, నాట్య కళాభిమానులునగు శ్రీయుతులు గిడుగు వెంకట సీతాపతి, విస్సా అప్పారావు ప్రభృతులు క్షేత్రయ్య పదములు కొన్నింటిని సంకలనముజేసి వేరువేరుగా గ్రంథరూపమున ప్రకటించిరి. నాట్యాభినయమునకు అత్యంతోపయుక్తములగు వీరి పదములు మరి కొన్నింటిని నాట్యలోకమున కందీయుటవలన తెలుగునుడికారము లోని సొంపు, లాలిత్యము, మధురగానమునందంతర్లీనమై శృంగారాభినయము నందు ప్రస్ఫుటమై రసజ్ఞుల కవిరళానందమును గలిగించగలవు. క్షేత్రయ్య నివసించిన మొవ్వగ్రామమునకు సమీపమందున్న కూచిపూడి యను గ్రామము భరతశాస్త్ర కోవిదులకు నిలయమైనది. అచ్చటి భాగవతులు వీరి పదములుపాడి, అభినయించి నాట్యమునందొక శిష్టసంప్రదాయమును నెలగొల్పిరి. క్షేత్రయ్య తంజావూరు రాజా స్థానసభాగారములందు వీరిచ్చట యుండిన కాలమునందనేక పదములు రచించి యుండవచ్చును. తెలుగు తమిళదేశముల లోని భాగవతులు వీరి పదములను గానముచేసి

అభినయించి వాటికనన్య ప్రచారము కలిగించిరి. వీరి పదములు 'మువ్వ గోపాల' మకుటమును కలిగియున్నవి.

శ్రీనివాసయ్య : మధురను విజయచొక్కరంగ నాయకుడు పరిపాలించిన కాలమునందు వీరు జీవించిరి. వీరు మధుర గాయకులు. భావపూరితములగు పదములను వీరు రచించిరి.

తాళ్ళపాక చిన్నయ : వీరు శ్రీ వెంకటేశ్వరుని సాన్నిధ్యము నందు జీవితమును గడిపిన భక్తులు. 'శ్రీహరి పాదతీర్థము' అను కీర్తనను వీరు త్రిపుట తాళమున గానము జేసిరి. ఆయన పద కర్త మాత్రమేగాదు. రాగయుక్తముగా ఆ పదములను బాడ గలిగిన రాగజ్ఞాన సంపన్నుడు.

తాళ్ళపాక అన్నమాచార్యులు: వీరు వ్రాసిన ఆధ్యాత్మ సంకీర్తనలు నోటబలుకని భాగవతులుండరు. సాహితీ ప్రియు లగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వీరి కీర్తనలు సంకలనము జేసి గాయకలోకమునకు మహోపకారము గావించిరి. తాళ్ళపాక కవులు రచించిన కీర్తనలు 14000 వరకును యున్నవని తెలియు చున్నది. వీరి కీర్తనలు భక్తి శృంగారరసములు ప్రధానముగా గలిగియున్నవి.

తీర్థ నారాయణస్వామి: వీరు కృష్ణామండలవాసి. ఆయన క్రీ. వె. 16వ శతాబ్దమునందు జీవించియుండెను. వీరు రచించిన 'కృష్ణలీలాతరంగిణి' భక్తిరస ప్రధానమైనది. తెలుగు దేశమందలి భాగవతులు, దక్షిణ దేశమందలి భాగవతారులు వీటిని గానము జేయుచుందురు.

సోమనాథ పండితుడు: వీరి నివాసము గోదావరి మండలము నందున్నది. వీరు క్రీ. శ. 15. 16 శతాబ్దుల మధ్యకాలమున జీవించిరి. 'రాగవిబోధ' యను సంగీతలక్షణ గ్రంథమును వీరు రచించిరని తెలియుచున్నది. దీనియందు రమారమి 60 మేళములున్నవి.

ఘనం కృష్ణయ్యర్: వీరు ఘన, న్యాయ, దేశిపద్ధతులందు పదరచన గావించిరి.

సంగీతకుల సార్వభౌముడగు త్యాగరాజయ్య క్రీ. శ. 17, 18, శతాబ్దుల మధ్యకాలమున జీవించియుండిరి. వీరి పూర్వీకులు తెలుగుదేశమునుండి దక్షిణదేశమునకేగి యచ్చట నివాస మేర్పరచుకొనిరి. వీరు తంజావూరు జిల్లాలోని తిరువానూరు గ్రామమున జన్మించిరి. సంస్కృతాంధ్ర వేద జ్యోతిష సంగీత శాస్త్రములందు వీరు ప్రతిభావంతులు. వీరు శ్రీరామ భక్తులై మంత్రసిద్ధి బొంది భక్తి ప్రధానములగు అనేక కీర్తనలు రచించిరి. వీణావాదనమందు వీరు సిద్ధహస్తులు. రమారమి 2400 కృతులు వీరు రచించినట్లు తెలియుచున్నది.

నాట్యాభినయమునందు స్వరజతులు, పదవర్ణములు, కృతులు, కీర్తనలు, పదములు, జావళీలు, తరంగములు, అష్టపదులు, దరువులు, తిల్లానాలు, శబ్దములు ఉపకరించుచున్నవి. స్వరజతియందు పల్లవి, అనుపల్లవి చరణములుయుండును. శ్యామశాస్త్రి మొదలగువారు స్వరజతులను వ్రాసిరి.

పదవర్ణము : పదవర్ణమునకు చౌకవర్ణమనుపేరుగూడ యున్నది. దీనికి గూడ పల్లవి, అనుపల్లవి, చరణములుండును. ఇది శృంగారరస ప్రధానమైనది. దీనిని సాధారణముగ వేశ్యలు జేయు మేళములం దుపయోగింతురు.

కృతులు : ఇవి దైవకృతమైనవి. వీటియందు భక్తిరసము ప్రధానమైనది.వీటికిగూడ పల్లవి, అనుపల్లవి,చరణములుండును. త్యాగరాజయ్య రచించిన కృతులు వీటికి ప్రామాణికములు.

కీర్తన : దీనియందు గూడ పల్లవి, అనుపల్లవి, చరణములు యుండును. కాని వీటియందు సంగీతము ప్రాధాన్యత వహించుచున్నది. కీర్తనలు భక్తిరస ప్రధానమైయుండును.

పదము : ఇది దైవసంబంధమైనది. శృంగార రసాలంబన కారులగు నాయికా నాయకులు ఇష్టభావములను అభినయ పురస్సరముగ బ్రకటించుటకివి ప్రధానమైనవి. వీటికిని పల్లవి, అనుపల్లవి, చరణములు యుండును. క్షేత్రయ్య, ఘనం సీనయ్య మున్నగువారు పదకర్తలందు ప్రముఖులు.

జావళీ: ఇదిగూడ శృంగార రసాభినయమునకుపరించును. రచన వ్యావహారిక భాషయందుండును. ధర్మపురి సుబ్బారావు పెక్కుజావళీలు రచించెను.

## భి న్న ప ద ము లు

అభినయోపయుక్తమగు పదములు, భిన్నగీతారూపములు వివిధకవి కృతులనుండి కొన్ని మాత్రమువిచ్చుట పొందుబరచబడినవి.

క్షేత్రయ్య          పదవర్ణము          భైరవి-రూపకము

ప. నీసాటి ధొర నీవని నెరనమ్మి నాను
నెనరుంచ యీ వేళ నాసామి.

అ. బోసకుల విజయతుళజేంద్రుని తనయా శ్రీభోగ
దేవేంద్రుడౌ శరభోజ మహారాజేంద్ర.

చ. నీకు తగుసతి నేనని నీసముఖమునవచ్చితి నన్ను పరిపాలనము
సేయవలెరా యిపుడు వలపు నిలుపదగవికమ రికలియువలెను.
నిముసంబున మదన శాస్త్రమును దెలుపవచ్చితిని.
సరసుడంచు మదిని ॥నీసాటి॥

*          *          *

పదములు          మోహన-త్రిపుట

ప. తగిలితివిక నిన్ను - తరల నీయ నోయి!

అ. వగకాడా! మా మువ్వగో-పాలా! నాసామి! ॥తగిలి॥

1. గంధము చాటున - ఘనమైన జడవేటు
కందియున్న సొగసు - కనుగొంటినోయి!
సందిటనున్న యీ - చందురు పిల్లలు
అందమాయెనోయీ - యిందుకేమోయి! ॥తగిలి॥

2. తావిమించిన నీ - మోవిపై కెంపు
దేవునాన నినుజూడ - దృష్టయ్యెనోయీ!
దేవరచిత్తను తెలియనిదానినా నీ
పీవేళకైన నా - యిల్లు చేరితివోయీ! ॥తగిలి॥

3. కళలంటి వేమారు - ఘనుడ ! మువ్వగోపాల
కలిసితివందుకు - కాదననోయీ !
చెలిని నేటినుండి - తలచనంటు నాతో
పలికితేకాని యీ - పనికొల్లనోయి ! ॥తగిలి॥

తోడిరాగము - ఆదితాళము

ప. ఎచ్చట నున్నాడో ? చెలియా ! వా -
డే మనుచున్నాడో ?

అ. విచ్చలవిడి గాను - వెరపింతైన లేక
ముచ్చట లాడుచు - మువ్వగోపాలుడు. ॥ఎచ్చోట॥

1. వారిజాక్షి ! యనుచు తన - వద్దకిరమ్మని
తీరుగ నుదుట - తిలకము దిద్దుచు
జారుకొప్పున సన్న - జాజులు ముడచుచు
గారవమున పక్కచేరి ముద్దుపెట్టుచు. ॥ఎచ్చోట॥

2. చాల నను దూరుచు తన - సాటిలేదనుచు
పాలుగారు చెక్కిలి - బాగుగా గీరుచు
వాలాయముగాను - వా తెరయానుచు
ఏలపదము పాడుచు - నెలమి సొక్కించుచు ॥ఎచ్చోట॥

3. బాలరో ! మువ్వగో - పాలుడైన వరదుడు
కోలాహలముగ - కొసరి కొసరి వేడుచు
నీలవేణిని రతి - లీలశయ్య నను
కూలముగ రతికేళి - గూడిలాలింపుచు. ॥ఎచ్చోట॥

కళ్యాణిరాగం - త్రిపుటతాళము

ప. చిన్నదాననే నేమెఱుగ సిగ్గయ్యీనమ్మా!

అ. కన్నులెల్ల కంచివరదుని కౌగిట నుండమనేరు ॥చిన్న॥

చ. వద్దకి బొమ్మని చాల - సుద్దులు చెప్పేరు
ముద్దుబెట్ట బొమ్మనేరు-ముదముతో లాలించుమనేరు ॥చిన్న॥
మదనశాస్త్రము నేను - జదివిన దానగాను
సదయుడని వానితోను - సరసము లాడమనేరు ॥చిన్న॥
మల్లెపూల పాన్పుపైని - మనసు నెమ్మదితోను
ఉల్లము రంజిల్లచేసి - ఒమ్మికతో నన్నుండమనేరు ॥చిన్న॥
పల్లవాధరి! వినవే - పణతులందరు నన్ను
వల్లభుడా మువ్వగో - పాలుని తోగూడుమనేరు ॥చిన్న॥

* * *

ఆనందభైరవి - ఆదితాళము

ప. రేపువత్తువు గాని పోర నేటికితాళి - రేపువత్తువుగాని

అ. రాపుచేయుట మేలా? రేపువత్తువుగాని గోపాలనాసామి

1. రాతిరి పగలొక్కతీరు నిన్ను
రమ్మంటే మా యింటివారు
మాతులు దిప్పేరు - మొన్నవచ్చితివని
వాదేల తడవాయె వద్దు నేటికితాళి ॥రేపు॥

2. మరునాడె నను గూడితివి నన్ను
మరుకేళి గెలిచి మెప్పించితివి

మరియాద గలిగిన - దొరబిడడ వైతె
తెరచి చూడుర తలుపు - తెల్లవారె తూరుపు ॥రేపు॥

3. రాపుసేయకు నాతో పోరా నన్నే - రతినేలిన మువ్వ (గోపాలా)
కోపగించి పోయేవు - కొన్ని నాళ్ళాయె నీవు
తాప మణచవేరా - దయతో కలసిపోరా ! ॥రేపు॥

ఘంటారవము - ఝంప తాళము

ప. ఈమేను జీవ్రునకు - ఎంత ప్రియామాయెన్
అ. భామ ! మామువ్వ - గోపాలు కౌగిటలేని ॥ఈమేను॥

1. పడతి ! నేనొక చోట - ప్రాణేశుడొక చోట
ఎడబాసి మరునిచే - ఇడుమలకులోనై
కడలేని విరహాగ్ని - క్రాగియున్నది బాల
పుడమిలో వెతె జ - న్మములేదె సదతికి ॥ఈమేను॥

2. మోము జూడమన సై - మోవియాన నోరూరి
యామ కొన్న ప్రేమచే - నసురుసు రనుచు
సోముకాకల జిక్కి - సొమ్మసిల్లి యీవేళ
కామినిరో ! ఎడతెగని - కన్నీట నిటులున్న ॥ఈమేను॥

3. కంతుకేళి మువ్వగోపాలు - కలసియున్నది తలచి
వింత తోచి నామనసు - వేవిధము లాయెన్
ఇంతరో ! విభుసేమ - మీావరకు విననైతి
ఎంతవ్రాత వ్రాసియున్నదో-ఇంతకు తాళియున్న ॥ఈమేను॥

శంకరాభరణం - ఆది

రారా ! నాసామి రారా !
రార ! రావేల జేవేవు - రార ! నాసామి ॥రారా॥

ముందునను గూడి నీ - విందురా కిపుడు వచ్చి
సుందరాంగ నన్నేచు - టందమా ? ఇందరిలో ॥రారా॥
ఎంతసేపని తాళుదానరా - యింతపరాకు చేసితే
సుంతైన దయజూడవా - సుదతిబోధనగాబోలు ॥రారా॥
పంతమేల నాతో - కంతుకేళి గూడరా
వంతలబెట్టకిక ము - వ్వ గోపాలసామి ॥రారా॥

మోహన - ఆదితాళము

ఒకేసారికే యిలాగైతే - నోహో ! ఇదేమిటి రతిరా ?
మక్కువ దీర్చరా ! మువ్వగోపాల !
సొక్కియున్నది నీ సొగసది యేమిర ?
నీటుకాడ రొమ్మదర దేమిర !
కమ్మని వాతెరకందె నదేమిర !
కాళ్ళను చేతులు తడబడు టేమిర?
కన్నుల నిద్దుర గమ్మె దేమిర !
గళమున జెమటలు గారే దేమిర !
తిన్నని పలుకులు పలుక వదేమిర !
తెలిసి తెలియకున్నావ దేమిర !
ఇనపురి ముద్దుల మువ్వగోపాల

యేపున నను గలసితి వీవేళ !
మనమున నిన్నే నమ్మితి జాల !
మారు బల్కకున్నావది యేల.

*  *  *

క్షేత్రయ్య రచించిన పదములకు కాంభోజి, ముఖారి, భైరవి, కల్యాణి, సావేరి, తోడి, కేదారగౌళ, పంతువరాళి, ఘంటారవము, మోహన, యదుకుల కాంభోంజి, బిళహరి, ఆనంద భైరివి, మధ్యమావతి, శంకరా భరణము, ఆహిరి, ఉసేని, పున్నాగవరాళి, సౌరాష్ట్రి, బేగడ, నవరోజు, సైంధవి, నీలాంబరి, కన్నడ, ధన్యాసి, సురట, అఠాణా, కాపీ, ఆసావేరి, సారంగ, శ్రీరాగము, నాదనామక్రియ, వసంతభైరవి, బారువ, వరాళి, ఘండె, గౌళి పంతు, కేదార, గౌరి మున్నగు రాగముల నుపయోగించెనని తెలియుచున్నది.

త్యాగరాజయ్య కృతి　　　　మోహన - ఆది

ప. నన్ను పాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథా ॥నన్ను॥

అ. వనజన యన మోమును జూచుటె జీ
　వనమని నెనరున మనసు మర్మము దెలసి.

చ. సురపతి నీలమణి నిభ తనువుతో
　నురమున ముత్యపుసరుల చయముతో కరమున
　శరకోదండ - కాంతితో
　ధరణి తనయతో త్యాగరాజార్చిత　　　　॥నన్ను॥

నారాయణ తీర్థయతి.     తరంగములు     భైరవి-రూపక

ప. జయజయ గోకుల బాల! జయ సకలాగమమూల!
దయయా పాహి గోపాల! - దీనం పాలయబాల! ॥జయ॥

అ. దేవమయా చరితమిదం! దీన ధియా అపరాధం
శ్రీ వసుధాధిప కృపయా - కేవల మిహాధూనిహి. ॥జయ॥

చ. ఈశ్వేత్రావక దేహే - యీశజగంతి నిలీహే -
పీతా శిక్షిత మోహే - వేదాంతాగమగేహే? ॥జయ॥

2. జగదండ కోటి తనో - జగదుదారాంత సుతనో -
అగణిత సంజాతమనో - అపరి మితాశ్రితధేనో. ॥జయ॥

4. ఇతివిధి నావరిగీతం - శృతవచసా హరి చరితం
యతి నారాయణ కథితం - యదుకుల భూషణముదితం
॥జయ॥

*     *     *

జయదేవరకవి.     అష్టపదులు     ఘూర్జరం-ఏకతాళం

రతి సుఖసారే గతమభిసారే మదన మనోహర వేశం
నకురునితంబిని! గమన విళంబన మనుసరతం హృదయేశం
ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలీ

1. గోపీపీన పయోధరమర్ధన చంచల కర యుగశాలీ ధ్రువం
నామసమేతం కృత సంకేతం వాదయతే మృదు వేణుం
బహుమను తేనమ తే తను సంగతపవన చలిత మపిరేణం

ధీరసమీరే ,, ,, యుగశాలీ.

2. పతతి పతత్రే విచలితపత్రే శంకిత భవ దుపయానం
రచయతి శయనం సచకితనయనం పశ్యతి తవపంథానం
ధీరసమీరే ,, ,, యుగశాలీ.

3. ముఖర మధీరం త్యజమంజీరం రిపుమివ కేళిషులోలం
చలసఖి ! కుంజం సతిమిరపుంజం శీలయనీల నిచోళం.
ధీరసమీరే ,, ,, యుగశాలీ.

4. ఉరసిమురారే రుపహిత హారే ఘన ఇవ తరళబలాకే
తటిదివపీతే ! రతి విపరీతే రాజసి సుకృతవిపాకే.
ధీరసమీరే ,, ,, యుగశాలీ.

5. విగళితవసనం పరిహృద రసనం ఘటయ జఘనమపిధానం
కిసలయశయనే పంకజనయనే ! నిధిమివహర్ష నిదానం
ధీరసమీరే ,, ,, యుగశాలీ.

6. హరిరభిమానీ రజనిరిదానీ మియమపి యాతి విరామం
కురుమమవచనం సత్వరరచనం పూరయ మధురిపుకామం
ధీరసమీరే ,, ,, యుగశాలి.

7. శ్రీ జయదేవేకృత హరిసేవే భరతి పరమ రమణీయం
ప్రముదిత హృదయం హరిమతి సదయం సమతసుకృత
కమనీయం

8. ధీరసమీరే ,, ,, యుగశాలీ.

* * *

తాళ్ళపాక అన్నమాచార్యులు. రాగం : వరాళి

ఏమిచేయు వార మింకను
ఆమనిచేల పచ్చలాయ బ్రతుకు ॥ఏమి॥

జీవనమనియెడి తీరనియాస
రేపుమాపుఁ బెడరేఁచగా
తోపుసేయఁగ రాక దురితపు తరవుల
కాపదలకులో నాయ బ్రతుకు. ॥ఏమి॥

వేడుక నెడి పెద్ద విడువని తరవు
వోడకెపుడు వొద్దనుండఁగా
జోడువిడువరాక చులకఁ దనంబున
కాడికెలకులో నాయ బ్రతుకు ॥ఏమి॥

మమకార మనియెడి మాయతరవు
తిమిరమొక్కించుక తియ్యగా
విమల మూరితియైన వెంకటగిరి పతి
అమర జేరగ యరవాయ బ్రతుకు ॥ఏమి॥

* * *

ధర్మపురి సుబ్బారావు జావళి కాంభోజి-ఆదితాళం

ప. నిను నమ్మినారా - నీరజ నయనా -
అ. నన్ను విడనాడ న్యాయమా - నాసామి.
చ. కమ్మని మోవిచ్చి కౌగిలియ్య వేరా -
నమ్మిన దానరా నాసామీ యీవేళ. ॥నిను॥

2. ఎంత వేడినను పంతమా నాపైని -
 సంతతంబు నిన్నే చింతించుచున్నార. ॥నిను॥

3. మరుని బాలిరికి ఓర్వఁ జాలని -
 మర్మమెల్ల తెలిసె - శ్రీ ధర్మపురినివాస ॥నిను॥

ఆనందభైరవి జావళి ఆదితాళము

ప. మధురానగరిలో చల్లనమ్మబోను దారి విడువుకృష్ణా॥మధు॥

అ. మాపటివేళకు - తప్పక వచ్చెద - పట్టుకుకొంగు గట్టి
 గాను కృష్ణా

చ. కొసరి - కొసరి నాతో - సరసములాడకు రాజమార్గమిది
 కృష్ణా ! కృష్ణా !
 వ్రజవనితలు నను జేరవత్తురిక - విడు విడు నాచేయి
 కృష్ణా ! కృష్ణా !

* * *

ఘనం సీనయ్య పదము కురంజి-ఆది

ప. శివదీక్షాపరురాలనురా ! నే
 శీలమింతైన విడువ జాలనురా -

అ. శివశివ గురునాజ్ఞ మీరనురా -
 శ్రీవైష్ణవుడంటే చేరనురా ! ॥శివ॥

చ. వడిగావచ్చి మఠము జొరవకురా !
 మడుగుకావి చెరగు దీయకురా !
 నీవు మాటిమాటికి నోరుమూయకురా ! ॥శివ॥

2. పంచాక్షరీ జపశీలనురా !
కాకి పలుకులను వినజాలనురా !
కొంచెపు వగలు నే నెంచనురా !
మ్రొక్కెదరుద్రాక్షసరులు ద్రెంచకురా ! ॥శివ॥

3. అట్టుచూచి చన్ను లదుమకురా !
వాసెజ్జ గొలుసు బట్టి కదియకురా !
బుజ్జగించుమ పసికోలనురా !
కెమ్మోవి నొక్కకు భక్తురాలనురా ! ॥శివ॥

4. మోముబట్టి చేర్చకురా !
నీ నామముతోడి బూతి గూర్చకురా !
వేమరు తోడ భిక్ష వేడకురా !
బోపోరా మన్నారురంగ మల్లాడకురా ! ॥శివ॥

తిల్లానా చతురశ్రజాతి త్రిపుట

తానుం తనత దిరన దృగ్గ
రామనాథపుర పాలకుడా
ముద్దురామలింగ రాజేంద్ర విభుని
అభిమాని వైరయముగ రక్షించువారాహి
రాజరాజేశ్వరి శంకరి.
తాం తకిట నిరశని తకధిమితక ఝుం
గమదగ తకిట ఝుం నిదప తధణ
రిసమగరి సని తదిగిణత

జతిస్వరము : తాం తకిట గిరిశని తకధిమి తకఝుం గమదగ తకితఝుం నిదప తదణరిసమగిరిసని తదిగిణక.

శబ్దము : నాట్యాభినయన కుపయుక్తమగు పదసాహిత్యము నందు శబ్దమను జాతియొకటి యున్నది. వీటిని తెలుగు దేశమునందు శబ్దములనియు, తమిళ దేశమునందు కౌతము లనియు వ్యవహరించుబడుచున్నవి. ఇట్టి శబ్దములను యనే కము క్రీ. వె. 17,18 వ శతాబ్దములో తెలుగుదేశము నుండి దక్షిణ దేశమునకు వెళ్ళిన ఆంధ్రకవులు రచించిరి. వీటియందు కొన్ని దైవవర్ణనమునకు సంబంధించియున్నవి. మరికొన్ని రాజు సందర్శనమును పురస్కరించుకొని రచించ బడినవి. నేటికిని దక్షిణదేశమందలి భాగవతులు తెలుగు కవులు రచించిన శబ్దములనే పాడుచు అభినయించు చుండిరి. కూచిపూడి భరతనాట్య సంప్రదాయమునకు జెందిన శ్రీ వెంపటి సత్యనారాయణగారు దక్షిణదేశమందలి సేలంజిల్లాయందు నాట్య ప్రయోగములు గావించుట కేగి నపుడు అచ్చటవారికి యొకరివద్ద లిఖితప్రతియందున్న కొన్ని శబ్దములు గనుపించినవి. వారు వాటిని సంతరించి నాటి నుండియు నృత్యాభినయములం దుపయోగించుచుండిరి. శబ్దప్రయోగమునకు, సాహిత్యమునకు, రసమునకు అను కూలమగు నే రాగమునైనను గ్రహించవచ్చును. ఇట్టి శబ్దములు యనేకము అముద్రితావస్థయందున్నవి. గావున వాటి కర్తలు, వారు జీవించిన కాలము, కొన్ని పట్ల నిర్ధా



★

సరస్వతీమూర్తి
(12 వ శతాబ్దం)

★



నటేశుడు (వెలంగాని)

( మద్రాసు పురాతత్వశాఖవారి సౌజన్యముతో )

రింపబడవలసియున్నది. వ్రాతప్రతి నుండి యుదాహరించిన కొన్ని శబ్దములు.

శివకౌత్వము - త్రిపుట

తక్కిట కిటతక - ధిక్కిట కిటతక - తాండవ వినోది -
ధికిటకిటతక ధరికిటకిటతక - త్రి శూలడమర -
ధిమి - ధిమిత ధిమిత - త్రినేత్ర శంకర, త్రిపురసంహారా!
దృగ్డ - దృగ్డ దృగ్డవాం - నందివాహనా, నాగభూషణా!
ఝకకు - ఝకకు - ఝకకుకుకు - ఢింకుకు -
పార్వతి రమణా! భక్తవత్సలా!
పరమ పురుష గంగాధర శంకర,
తక్కిట కిటతక - ధిక్కటకిటతక - తాకిణ్ణఝుకిణ్ణతక్క -
ముగురు రాజులపూజ లింగమా! మల్లికార్జునా!
తక్కిటకిటతక - ధికిటకిటతక - తోం గిటకిటతట -
నంగిటకిటతక: (పై తాళము) - తాకు ధీకు తక్కిట -
తోంగిటకిటతక (పై తాళము) ఫేణ్ణా - తంఘి కిటతక
(పై తాళము) ధిక్కితా -

* * *

ఆదితాళము

ధాకిటకిట ఝుం - తద్ది తకిట ఝుం
తద్దితకిట ఝుం - తక - ధికి - ఝణు
తాది తాది - ఝుం తరికిటతక

తాధికిటతక - తదికిణతోం (పైతాళము)

తెహేంవ త త్తాం
రాజశ్రీ భోసలకులచంద్రా!
రతిపతి సుందర రాజనరేంద్రా!
రాజ తుళజ మహారాజ తనుజ
ప్రతాపశింహ సుమిత్రా! సలాము!

ఆదితాళము

తద్ది తకతధిమిత కిటతక - ఝొంత
జగ తతొంగ దృగ్డు తక - ఝంత
దృగ్డు ఝు ఝు కిణ కిణ జగ - ణంనిత
జగణంతక - తకఝంతక
తకఝొంతక - కిట తక
తగఝొం తగణం - తకుందరికిటతక
తరిత తరిత ధిమిథా ధాకిటతక కిటతకిటతకతా (ప్రైతాళం)
తెహిం ద త్తాం -
నీవురారా! దామెర తిమ్మేంద్ర కుమారా -
భాసుర భుజ బల రణ శూరా -
నారీజన మానస చోరా -
మహాన్మేరు సమానాధీరా!
కవిజన పోషకమందారా!
పరరాజశత్రు సంహారా!
భరతశాస్త్రనిధి నీవేరా!

పెదవేంకటేంద్ర హం వీరా !
సరసతగల దొర నీవేరా -
ననుకరుణ జూచుటకు, వేళ్ళరా -
ఇది వేళ్ళర
చలమేలర
మది బూనర
నీదానర
నన్నేలుపోర.
దాన రాధేయ రాజబహద్దర్ శభాష్ సలాము !

ఆదితాళము

అదిరా జాల మదంచి - నీ
శత్రుల బట్టి వధించి - నీ
మిక్కిలి కీర్తి వహించి - నలు
దిక్కులు నెల్లవధించి - నెన
రుంచి దయ యుంచి, వివరించి
భువిలో నెంతటి జాణవు.
అంగజరూపా ! తందాందం దీంది దీం
.................................
అతిశయమున జనులందరు బొగడగ
ప్రతాపరాముని కరుణను వెలయుచు
ధర్మము జయమని తప్పక యెప్పుడు
నడిచేవట్టి వీరరాఘువ సన్నుత

తో ద్దిమి ధిమిధిమి - ధిమితాకిట తరి
భోసలకుల చంద్రుడవై వెలసిన
భోగసురేంద్రా! బుధజన చంద్రా!
భళిర, భళిర, తులజేంద్రుని తనయా
ప్రతాపసింహంపు బాలా సలాము
తాంగుడు తాంగుడు - తాంకిట కిట తక (పై తాళము)
ధీ - ధీ - నంగిట కిటతక - తాంగిట కిటతక
కిట తక తా (పై తాళము) తకతధీం గిణతోం.

నాట్యాభినయనమునకు పైన నుదహరించిన పదములేగాక సింహపురి పదములు, మండూకపదములు యనునవి గూడ ప్రసిద్ధిగాంచియున్నది. అభినయనమునకు శృంగార పదములే లెస్సగ నుపకరించుచున్నవి. శృంగారము దూష్యముగాదు. శృంగారముఅభినయనమునకునిషేధముకాదు. అట్టిఅభినయమునకు స్వీకరించెడి పదములు అభినయోపయుక్తములు గావలయును. భరతమతము ననుసరించి అభినయమును ప్రదర్శించుటకు, శృంగారాది రసభావములు కలిగిన నాయికా నాయక భేదములు నిరూపించుటకు శబ్దములు ప్రామాణికములై యున్నవి. నాట్యాభినయముల లక్ష్యము సామాజికులయందు రసోద్భవముగావించుటేయని నిర్ద్వంద్వముగ యంగీకరించబడుచున్నది. అట్టియెడ శృంగారాభినయమందలి యౌచితి, సభ్యత, నటకుల యుపజ్ఞమీదను,సామాజికుల సరసత్వము సంభావనీయ గుణసంపదమీదను ఆధారపడియుండును.

# అభినయము

తొలి నాట్య శాస్త్రకారుడగు భరతముని రచించిన 'నాట్యశాస్త్రము'నకు బిమ్మట దేశమునం దప్పుడప్పుడు వెలువడిన నాట్యాలంకార గ్రంథములు, గానాభినయ శాస్త్ర గ్రంథములు పరిశీలించుటవలన ఆయాకాలములందు లాక్షిణికులు అవలంబించి స్వీకరించిన నవ్యమార్గములు దెలిసినవి. క్రీస్తుశకము 18వ శతాబ్దమున తిరుచినాపల్లి జిల్లా వాసియగు లింగంగుంట మాతృభూతయ్య, నందికేశ్వరుని సంస్కృత నాట్యశాస్త్రమును ♦ "అభినయదర్పణం"అను పేర మూడాశ్వాసములలో తెలుగుభాషయందు ప్రబంధమును రచించెను. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథ శాఖవారు దీనిని ముద్రించిరి.

మాతృభూతయ్య కాశ్యపగోత్రీకుడు ఆయన, లోకేశ్వరుడగు సదాశివ వరప్రసాదుడని తెలియుచున్నది. భరత శాస్త్రమునందును, సంగీత శాస్త్రమునందును ఆయన శేముషీధురంధరుడు. ఆయన రచించిన ప్రబంధమునందు పోతన కవిని నుతించెను. యాజ్ఞవల్క్యాచార్యుని శిష్యుడని ఆయిన జెప్పుకొనెను. కుంతలాంబ మకుటముగా గలిగిన కొన్ని నాట్య పదములుగూడ ఆయన రచించెనని తెలియుచున్నది. కుంత

---

♦ అభినయ దర్పణం - మాతృభూతయ్య.
Madras Govt. Oiental Series ix

రాంబ, తిరుచినాపల్లిలో ప్రసిద్ధిగాంచిన దైవతము. శ్రీరంగము తిరుచినాపల్లికి ప్రక్క గున్నమగుటవలన ఆయన 18వ శతాబ్దాంతమునుండి 19వ శతాబ్దారంభమునరకును శ్రీరంగక్షేత్రము నందు జీవించి యుండవచ్చునని చెప్పబడుచున్నది.

నందికేశ్వరుని అభినయ దర్పణమునకును, మాతృభూతయ్య తెలుగుసేతకును భేదము గనుపించుచున్నది. దీనిలో సుకవిస్తుతి. షష్ట్యంతములు మొదలగు ప్రబంధలక్షణము లున్నవి. ఆయన దీనిని శ్రీరంగధామున కంకితము జేసెను. దీనియందు మూడాశ్వాసము లున్నవి.

భరతమతము ననుసరించి రంగపూజ, రంగస్థలనటన, పాత్రాది లక్షణములు, సభాసప్తాంగ లక్షణములు, నాట్యప్రశంశ, నాట్య వినియోగము మున్నగువాటిని ఆయన మొదటి యాశ్వాసమునందు దెలిపెను. రంగపూజ యంత్రాధిదేవతలగు దిక్పాలకులు, నాందిదేవతలు, సప్తమాతృకలు బేర్కొనెను. గరిక, అక్షితలు, జాజులు, తిలలు, జపాకుసుమములు, మల్లెలు, మొల్లలు, ఫలములు, నైవేద్యములు పూజా ద్రవ్యములుగా నిర్ణయించబడినవి.

ఆయన తాళలక్షణమును, తకార ళకారములకు స్వరూపదేవతలను సుబోధకమగునట్లు తెలిపెను.

గీ. అంబరమున నలత కారంబుపుట్టె
ధారణి నుద్భవించె ళకారమెలమిఁ

దనరి యీ రెండునుంగూడి దాళమయ్యె
రాక్షస విరామ! కస్తురి రంగధామ.

కం. పరఁగఁదకారమె యీశుం
డరయ శకారంబె శక్తి యాశివశక్తుల్
పరగఁగ, వారలకూటమి
గరిమను దాళంబులయ్యెఁ గస్తురిరంగా"

తాండవ నృత్యలక్షణము నిట్లు దెలిపెను.

గీ. అల తకారంబె తాండవమయ్యె మిగుల
మరి శకారంబె నృత్యమై మహిని వెలగఁ
దనర నీ రెండుఁగూడినఁ దాళమయ్యె
రాక్షస విరామ! కస్తురి రంగధామ.

భరతశాస్త్ర కోవిదుడగు మాతృభూతయ్య అభినయ లక్షణములు దెలిపెను. ఆయన తొమ్మిది శిరోభేదములు, అష్టవింశతి అసంయుత హస్తములు, సప్తవింశతి సంయుతహస్తములు వాటి భేదములు వివరించెను. నాట్యశాస్త్ర రచనము జేసిన భరత శాస్త్రజ్ఞులు నాట్యశాస్త్రమునందేగాక యపారమగు లౌకిక విజ్ఞాన సంపన్నులై నాట్యవిజ్ఞానము విస్తృతము జేయుటయందు శ్రద్ధాళువులై యుండిరి.

## నాయికా నాయక లక్షణములు

విభావాను భావ వ్యభిచారీ భావముల చేరికవలన రసము కలుగుచున్నదని భరతముని సూత్రము నిర్వచించు

చున్నది. ఇట్టి రసోదయమునకు గల హేతువు విభావమగు చున్నది. హృదయమునం దుద్భవమగు రతిని సూచెంచెడి భ్రూభేదములు, దృష్టిభేదములు, అను భావములగును. మానసిక తన్మయ స్థితి సత్వమగుచున్నది. వీటివలన కలిగెడి రసాలంబన హేతువులు వ్యభిచారి భావము లనబడుచున్నది.

కావ్య నాట్యములందు రసము ప్రధానమైనది. రసాలంబనకారులగు స్త్రీ పురుషులు, నాయికా నాయకులగు చుండిరి. నాయిక స్వీయ, పరకీయ, సామాన్యయని మూడు విధములు, స్వీయమగు నాయిక పరిణయమాడిన పతియందే అనురాగము కలిగియుండును. ఆమెకు క్షమ, పతి సేవాసక్తి మున్నగు గుణములు సహజముగనుండును. స్వీయనాయిక తిరిగి మూడు విధములుగ నున్నది. ముగ్ధ - యవ్వనము అంకురించనది: మధ్య - లజ్జ కలిగినది: ప్రౌఢ - రతికేళి యందు ప్రవీణురాలు, లజ్జ, రతికేళి రెంటియందును సమానాసక్తి గలిగిన నాయిక మధ్యా ప్రౌఢ యనబడుచున్నది. మధ్యా ప్రౌఢ మరల ధీర, అధీర, జేష్ఠ కనిష్ఠ, ధీరాధీరయను నాలుగు విధములుగ నున్నది.

మధ్యధీర : అన్య స్త్రీ సంభోగము జేసిన పతిని వ్యంగ్యముగ దూరునది.

మధ్యాధీర : అన్యస్త్రీ సంభోగము జేసిన పతిని బరుషముగ దూరునది.



నటరాజు (కుర్రం)

( మద్రాసు పురాతత్వశాఖవారి సౌజన్యముతో )

మధ్యధీరాధీర : పై జెప్పిన రెండు లక్షణములును కలిగినది.

జేష్ఠకనిష్ఠ : ఇరువురి భార్యలందు పతి యనురాగము అధికముగా బొందునది జేష్ఠయనియు, తక్కువగా గలది కనిష్ఠయనియు వ్యవహరించబడుచున్నది.

ప్రగల్భ, రతి కేళీ ప్రావీణ్యమునుకలిగి, లజ్జను పూర్తిగా జయించి అధికముగా గామేచ్ఛ కలిగియుండును. వీరుగాక ప్రగల్భధీరలని, ప్రగల్భాధీరలని, ప్రగల్భధీరాధీరలని, జ్యేష్ఠ కనిష్ఠలని, భేదములున్నవి. తల్లి దండ్రుల యధీనమందుండి పరపురుషుని ప్రేమించుచు పెండ్లి కాని కన్య పరకీయయగును. పెండ్లియై పరుని ప్రేమించునది పరోఢ, వీరియందు వారివారి స్వభావములను బట్టి గుప్త, లక్షిత, కులట, అనుశయాన, ముదిత, విదగ్ధ, సాహసిక, ప్రతిభాచతుర, అపలాచతుర యను భేదములున్నవి. ద్రవ్యమున కాసించి యందరిని ప్రేమించునది సామాన్య నాయిక యగుచున్నది.

స్వీయ, పరకీయ, సామాన్య నాయకులు, ఉత్తమ, మధ్యమ, అధమ శ్రేణులుగ విభజింపబడిరి. ప్రియుడు అవహితము జేసినను తాను హితమొనర్చునది ఉత్తమనాయిక. ప్రియుడు జేసెడి మంచిచెడుగుల కనుగుణముగా ప్రవర్తించునది మధ్యమ. బుద్ధిపూర్వకముగా ప్రియున కెగ్గుజేయునది అధమ. ఇట్లు నాయికలలోని అవస్థాభేదములనుబట్టి, ఉత్తమ మధ్యమాధమ భేదములను బట్టి నాయికలు 384 విధములుగ

నుండెదరు. స్త్రీ జాతులలోని భేదముల ననుసరించి పునర్విభజన జేసినయెడల వీరి భేదములింకను బహుళమగును.

ప్రాచీన ఆలంకారికులు నాయికలు అష్టవిధములని దెలిపిరి. వారి లక్షణములనుబట్టి వారివారి భేదములను గ్రహింపవచ్చును.

ప్రోషిత పతిక : పతి దేశాంతరమున కేగునపుడును, అనంతరమును శోకించునది.

అభిసారిక : ప్రియుడుగల సంకేత స్థలమునకు బోవునది,

కలహాంతరిత : పతి నవమానించి పిమ్మట శోకించునది.

స్వాధీనపతిక : అనుకూల వర్తనుడగు పతిగలది.

వాసకసజ్జిక : శయ్యారచనము జేసి, సురత సంచారములను జేర్చి పతిరాక కెదురుజూచునది.

ఖండిత : పరస్త్రీ సంభోగచిహ్నములు గలిగి వచ్చిన పతినిజూచి కోపించి, విచారించునది.

విప్రలబ్ధ : సంకేత స్థలమునకు పతి రానందున వంచన జేయబడినందుకు శోకించునది.

విరహోత్కంఠిత : పతి రానందున విచారించునది.

మరి రెండు విధములగు నాయికలనుగూడ కొందరాలంకారికులు చేర్కొనిరి.

ప్రవత్స్యత్పతిక : గ్రామాంతర మేగెడి పతినిగురించి విరహవేదన బొందునది.

సమాగ మిష్యత్పతిక : పతి గ్రామాంతరమునుండి రాగ లడని విని సంతసించునది.

నాయికలందు మానవతులు, లఘుమానలు, మధ్య మానలు, గురుమానలు, గర్వితలు యను భేదములున్నవి. ఈ భిన్న భేదములు సర్వసాధారణముగ గోచరించుచుండును. స్త్రీలు దివ్యస్త్రీలని, దేవతాస్త్రీలని, అదివ్య స్త్రీలని మూడు విధములు. ఇందు మనుష్య స్త్రీలకు అదివ్య స్త్రీలని పేరుయున్నది.

నా య కు డు.

నాయకుడు, పతి, ఉపపతి, వైశికుడు యని మూడు విదములు.

పతి: శాస్త్రోక్తముగా బరిణయ మాడిన భర్త.

ఉపపతి: పరసతి ప్రేమను పొందినవాడు.

వైశికుడు: రసజ్ఞుడగు వేశ్యాలోలుడు.

పతి, అనుకూలుడు, దృష్టుడు, శఠుడు, దక్షిణుడు అని నాలుగు విధములుగ నుండును.

అనుకూలుడు: స్వకాంతలయందు ప్రేమకలిగి, అన్య కాంతలను గోరనివాడు.

దృష్టుడు: నాయికయెడల అపరాధమును జేసి బొంకి, ప్రియవచనములతో బ్రతిమాలి ఆమె కోపము నుపశమింప జేయువాడు.

శఠుడు : నాయికయందు కాపట్యము గలవాడు.

దక్షిణుడు : సతులందరిని సమముగా జూచువాడు.

నాయకులకు సహాయకులుగ పీఠమర్దుడు, విటుడు, చేటుడు, విదూషకుడు దెలుపబడిరి. వీరిలో పీఠమర్దుడు, కోపించిన నాయికకు నాయకుని యం దనురాగమును గలిగించును. విటుడు, కామకలా ప్రవీణుడై యుండును. చేటుడు నాయికా నాయక సమాగమమునకు దోడ్పడును. విదూషకుడు, అంగ వికారములజేత పరిహాసము జేయును.

నాయికా సహాయలుగ దూతి, దాసి, సఖి, చేటి దెలుపబడిరి. నాయికా నాయకులకు సందేశములను గొనిపోవునది దూతి. పరిచారిక దాసియని వ్యవహరించబడుచున్నది. నాయికకు విశ్వాసపాత్రమైన చెలికత్తె సఖి. నాయికానాయకుల సమావేశ సంధాన చతురచేటి యనబడుచున్నది.

నవరసములు వాటి యనుభావ విభావములు, సాత్వికాభినయమందు ఏయే సంచారీ భావముల కలయికవలన ఏయే రసములు కలుచున్నదియు దెలుసుకొనుట అభినయమునందు ప్రధానమగుచున్నది. సంచారీ భావముల భేదము లెరిగిన పిమ్మట వాటిని అభినయించుట ప్రధానమైన చేష్టలు దెలుసు కొనవలయును. ప్రాచీనాలంకారికులు 33 సంచారీ భావములను దెలిపి యుండిరి.

నిర్వేదము, జడత, శ్రమము, దైన్యము, గ్లాని, భయము, సంశయము, ఆర్తి, క్రోధము, ఆవేగము, గర్వము, ధృతి,

స్మృతి, చపలత్వము, ఉగ్రత, అవహిత్థ, లజ్జ, విషాదము, ఉత్సాహము, మదము, రతి, నిద్ర, మోహము, బోధము, మరణము, హర్షము, మాంద్యము, వితర్కరము, సుప్తి, ఈర్ష్య, ఉన్మాదము, అపస్మారము లేక మూర్ఛ, మున్నగునవి సంచారీభావము లనబడుచున్నవి.

నవరసములలో మొదటిది శృంగారరసము. ఇందలి సంభోగ శృంగారము సంక్షిప్త, సంపన్న యను రెండు విధములుగ నున్నది. స్త్రీ పురుషులు లజ్జవలన సంక్షిప్తోపచారములు బొందునది సంక్షిప్త యగును. ఎడబాటు జెందిన యనంతరము కలిగెడి స్త్రీ పురుషుల సంయోగము సంపన్న శృంగార మనబడును. పైన దెలిపిన ద్వివిధమగు శృంగారముల సంసర్గము సంభోగ శృంగారమగుచున్నది. సంభోగ శృంగార రసములో దైన్యము, గ్లాని,జడత,త్రాసము, శంక, ఆవేగము, ధృతి, చాపలము, గర్వము, ఉగ్రత, అవహిత్థ, వ్రీడ, ఔత్సుకత రతి, మోహము మున్నగునవి సంచారులుగా గ్రహించవలెను. ఇట్లే తదితర రసములు, వాటిభేదములు, ఆయారసముల నభినయించుటకు యుపయుక్తములగు సహాయకారులను దెలుసుకొనవలెను.

నాయిక లష్టవిధములని దెలిపితిమి. వారిచేష్టలు, స్వభావములు అవగతము జేసుకొని అభినయించవలెను. నాయికా లక్షణముల ననుసరించి వారి చేష్టలు వేరువేరుగనుండును.

ప్రోషితపతిక : ఈమెకు దశావస్థలు జెప్పబడినవి. సంకల్పము. అరుచి, కృశత, లజ్జాహీనయగుట, ఉన్మాదము, మూర్ఛ, మనస్సంగము, దృక్సంగము, మరణము మొదలగునవి.

అభిసారిక : ఈమెకు అయిదు అవస్థా భేదములున్నవి. బుద్ధిమతి, సాహసి, సంశయాస్పదురాలు, మాయలు నేర్చినది శరీరదుకూలల, ఆభరణయలంకరణ యందు నిపుణురాలు. సముయోచితమగు భూషణములు. పుష్పములు. చీరలు ధరించి సుగంధాది ద్రవ్యముల నుపయోగించును.

కలహాంతరిత : పతిని నిందించిపిదప శోకించునది. ఈమెకు ఆరు అవస్థా భేదములున్నవి. వేగిరపాటు, నిట్టూర్పు విచారము మోహము, దుఃఖము, నిరంతర సంభాషణము నందిచ్ఛ కలిగి యుండును.

ఖండిత : అన్య స్త్రీ సంభోగ చిహ్నములు గలిగి తన వద్దకు వచ్చిన పతినిజూచి అసూయ జెందును. ఈమెకు కోపము విచారము, నిట్టూర్పు, కన్నీరు, మౌనము మొదలగు చేష్టలు సహజములు.

విహారోత్కంఠిత : సంకేత స్థలమునందు పతిని గానక విరహశోకము జెందునది. శరీరము కృశించుట, వణుకుట, తాపము, శోకము, తన దైన్యమును చెలులతో జెప్పుకొనుట నీమెకు యవస్థాభేదము లగుచున్నవి.

స్వాధీనపతిక : పతి యనురాగము కలిగినవి. మదము, విలాసము, ఉత్సవములు జూచుటయందు కోరిక, కోపము, వనవిహారము మొదలగునవి ఈమె గుణములు.

వాసకసజ్జక ; నాయకుని రాక కెదురు జూచుచు తాన లంకరించుకుని శయ్యారచన జేయును. నిరీక్షణము, సురతసామగ్రిని గూర్చుటయందు శ్రద్ధ, కోరికలు, చెలికత్తెల యపహాస్యములు ఈమెకు సహజలక్షణములై యుండును.

ఇట్లే ప్రవత్స్యత్పతికకు, సమాగమచ్ఛ్యుత్పతికకు, యవస్థాభేదములున్నవి. ఇదేవిధముగ నాయక లక్షణములందు జెప్పబడిన భేదములు, వారిచేష్టలు, నాయికా నాయక సహాయలు మొదలగువారు వారివారి యవస్థాభేదములను గుర్తించి అభినయించవలెను.

నాట్యమునందు, అభినయమునందు నాయికా నాయక భేదములు, విభావానుభావసాత్త్విక భావములు, హస్త విన్యాసములు, దృష్టిభేదములు, భ్రూవిక్షేపములు, అంగ ఉపాంగ ప్రత్యంగ చాలనములు, భరతశాస్త్ర నియమాను గుణముగ, లోకవృత్తమును సమన్వించుట నాట్యాభినయ మనకు వన్నెదెచ్చును. భిన్నముద్రలు, నాయికా నాయకుల చేష్టలు. వీటి యభినయము, పాదగతులు, భరత శాస్త్రాచార్యులయొద్ద నభ్యసించుటవలన యాలవడగలవు.

జయదేవకవి యష్టపదులలో నొక యష్టపదియందలి తొలిచరణము మాత్రము నిచ్చుట అభినయప్రస్తారమున కుదాహరణముగ దెలుపబడినది.

అష్టపది: ఝూర్జరీరాగము ఏకతాళము

రతిసుఖసారే గతమభిసారే మదనమనోహర వేశం
నకుర నితంబిని : గమనవిళంబన మనుసరతం హృదయేశం
ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలీ
గోపీపీన పయోధర మర్ధన కరచంచల కరయుగశాలీ.

—ధృవం

దీనిలో మధురదూతిక, ప్రసాదోన్ముఖురాలగు రాధను శీఘ్రముగా శ్రీకృష్ణుని చెంతకు బొమ్మని వేగిరించుచున్నది. నాయకుడు కృష్ణుడు. నాయిక రాధ. ఇందు మధురదూతిక ప్రధానము శృంగారరసము. విరహావిప్రలంబ శృంగారము. "రతి సుఖసారే" యను భావము నభినయించుటకు, కేళీగృహమునకు బోవుటకుముందు నాయికాలంకరణ, శయ్యారచన, చుంబనలు, బంధనలు, వీటివలన జనించు కళాస్థానములు అసంయుత సంయుతాది ముద్రలతో అభినయించవలెను. అట్లే "ధీరసమీరే యమునాతీరే" యను భావమును అభినయించునపుడు "ధీర, యమునాతీరే" యను భావమును అభినయించునపుడు ధీర, యమునాతీరే, వనే, యను శబ్దము లన్వయించు మాంద్య, శైత్య, సౌగంధాధి గుణములను, యమునా సైకత

ములందలి పిల్ల తెమ్మెరలు, గోబృందములు పక్షిసంతానములు కోకిలా విహంగ కూచితములు మొదలగువాటిని యభినయము నందు ప్రదర్శించవలెను.

ఏ పదమునైనను శబ్దమునైనను నాయికానాయక లక్షణానుగుణముగ, విభావానుభావ సంచారీభావము నెరిగి, స్థాయీ రసమును గుర్తించి, నాయికానాయక దూతికాదులు వారివారి చేష్టలను, స్వభావగుణములను, అవస్థాభేదములను ఆయా హస్తములతో నభినయించవలెను.



# కూచిపూడి భరతనాట్యము

పూర్వము కొన్ని శతాబ్దములనుండియు కృష్ణామండలములోని కూచిపూడియను గ్రామమునందు బ్రాహ్మణకుటుంబములవారు నృత్యగీతాభినయములందు నిష్ణాతులైన భరతశాస్త్రకోవిదులు, భాగవతులనుపేర బ్రసిద్ధివహించి యుండిరి. ఆ బ్రాహ్మణ కుటుంబములవారు అనుశ్రుతముగా వంశపారంపర్యముగా సంప్రదాయ సిద్ధమగు నాట్యాభినయాలంకారశాస్త్రము లభ్యసించి, క్షేత్రయ్య పదములనుపాడి, అభినయించి యందలి గుణసంపదకు వన్నె గలిగించిరి. క్షేత్రయ్య జన్మస్థానమగు మువ్వ గ్రామకంఠమందున్న "సాలెపేట" యందలి దేవదాసీలు కూచిపూడి భాగవతులయొద్ద సంగీత నాట్యాలంకారశాస్త్రము లభ్యసించిరని దెలియుచున్నది. వారు నాట్యమునందును, నాటక ప్రదర్శనములందును బ్రత్యేక విశిష్టతను కలిగియుండిరి. నేటికిని కూచిగ్రామమందు వారి సంతతికిజెందిన కొన్ని కుటుంబములవారు నివసించుచు నాట్యకళోపాసన జేయుచుండిరి.

కూచిపూడి వాసులకు కూచిపూడిభాగవతులని యనాదిసిద్ధమగు పేరుయున్నది. కూచిపూడి భాగవతులను గురించి చరిత్రయందు వెలువడిన యంశమును మొట్టమొదట డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు గుర్తించియుండిరి. వారు

క్రీ. వె. 1502 వ సంవత్సరమునాటి మాచుపల్లి కైఫియతు నం దుదాహరించబడినట్లు నిరూపించబడినది. అందలి వివరము లిచ్చట సంగ్రహముగ పొందుపరచబడినవి. ఆనాడు శిద్ధవటం సీమను సమ్మెట గురవరాజు పాలించుచుండెను.

'ఆయన ప్రజలవద్ద ద్రవ్యాకర్షణ జేసేయెడల త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసుకువచ్చి స్తనాలకు చిరుతలు పట్టించేవాడు. ఆలాంటి దినములలో వినుకొండ, బెల్లంకొండ తట్టున కూచిపూడి అనే గ్రామంనుంచి బ్రాహ్మణులు, భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థలమునకువచ్చి యుండి, సమ్మెట గురవరాజుయొక్క దారుణ ప్రభుత్వం చూచి అక్కడనుంచి లేచిపోయి, అక్కడ వీరనరసింహ రాయలు రాజ్యం చేస్తుండగా, భాగవతులు దర్శనం అయి కేళిక అడుగగా శెలవు ఇచ్చినారు.

కూచిపూడివాండ్లు చాలా విద్యావంతులని ప్రసిద్ధిగా ఉన్నందున, రాయలువారు స్త్రీలు సహా చూడవలెనని నగర్ల వద్ద దివాణములో కీర్తనకు శెలవు ఇచ్చినారు. అక్కడ కీర్తన చేసేటప్పుడు ఒకడు సమ్మెట గురవరాజు వేషము వేసుకుని, సమ్మెట గురవరాజువలెనే ఆ వేషగాడు కూర్చుండి రాయల సమక్షమందు ఆ స్త్రీయొక్క స్తనాలకు చిరుతలు పట్టించి సొమ్ము ఇవ్వమని తహశ్శీలు చేసినట్లు వినికిచేసినారు. అప్పుడు రాయలువారు అదేమని అడిగి, భాగవతుల ముఖతః వర్తమానము తెలిసి, ఆ రాత్రి కీర్తనసాంతమై తెల్లవారిన పిదప

ఆస్థానమునకు వచ్చి, ప్రధానులను సేనానాయకులను పిలిపించి మొహీంకు సైన్యంను సిద్ధం చేయించవలసిందని సెలవు ఇచ్చి నపుడు...ఆ మొహీం "గురవరాజు తల తెస్తున్నా"నని ప్రతిన చేసి సైన్యముతోడ వెళ్ళి కోట ముట్టడించి ప్రతిజ్ఞ చెల్లించు కొనెను. కూచిపూడి భాగవతులు వారి విద్యాసామర్థ్యముచేత దేశమందలి దుస్థితిని రాయలుకు నాటకమాడి చూపి దేశక్షేమ మునకు తోడ్పడిరి."

ఈ చారిత్రకయుదంతము వలన కూచిపూడి భాగవతు లను గురించి కొన్ని ముఖ్యవిషయములు దెలియుచున్నవి. రాయలు కాలమందే కూచిపూడి భాగవతులు నాట్య నాటక కలాపములందు కీర్తివిస్తారులైయుండిరి. వారి నటనాకౌశలమును ప్రాజ్ఞులను రంజించుటకేగాక, దేశక్షేమమునకు వినియోగించి, వాస్తవిక జీవన పరిస్థితులను ప్రభువుల కెరింగించుటయందు ప్రజలకును ప్రభుత్వమునకును మధ్య వారు ప్రజా వ్యహార శాఖోద్యోగులుగ నుండి ప్రజాక్షేమమునకు దోడ్పడిరి. వారికి గల దేశాభిమానమును శీలమునుగూడ పై యుదంతము ప్రక టించుచున్నది.

కూచిపూడి గ్రామమునందు నాట్య కళావతరణము జరుగుటకు గల హేతువును గురించి స్థానికులొక గాధను తెలుపుదురు. "కృష్ణలీలా తరంగిణి" రచించిన నారాయణ తీర్థులవారి శిష్యుడగు సిద్ధేంద్రుడు (యోగి) "పారిజాతాప హరణ" ఘట్టమును వ్రాసెననియు, దానిని నృత్యగానాభినయ

యుక్తముగ ప్రదర్శించుటకు అర్హమగు పాత్రధారుల కొరక న్వేషించుచు కూచిపూడి గ్రామము వెళ్ళినపుడు, ఊరిచివర నొకచెట్టుపై కూర్చుని రాగములు దీయుచున్న యిరువురు బాలురను జూచి వారి తల్లిదండ్రుల కడకేగి, వారి యనుమతిని బొంది యా బాలురను దోడ్కొనివచ్చి వారికి నాట్యాభినయములను నేర్పెను. వారాకళను వంశ పారంపర్యముగ నభ్యసించి నాట్య గీతాభినయములకు వారి జీవితముల నంకితము గావించిన యెడల శుభమగునని దీవించెనట.

అందువలననే యీ గడ్డమీద బుట్టిన ప్రతి బ్రాహ్మణ బాలునకును పిన్నవయసుననే ముక్కులు, చెవులు కుట్టించి, కాలికి గజ్జె గట్టించి నాట్యదైవతమగు నటరాజాలయమునకు గొనివెళ్లి, భక్త్యంజలి ఘటించి నాట్యాభ్యాసమున కుపక్రమించుట వారికి యాచారమైనదని కొందరు జెప్పుచుందురు. పారిజాతాపహరణము, వారి నాట్యకళోపాసనమునకు నాంది యైనది. కూచిపూడి భాగవతులందరును ఒకనాడు సత్యభామ వేషమూనుగట్టి భామకలాపమును అభినయించియుందురు.

కూచిపూడి గ్రామముననే నాట్యకళా లక్ష్మి తాండవించుటకు కొందరు మరికొన్ని గాధలు నుడువుచుందురు. కాని ఇట్టి గాధలలో దేనికిని చారిత్రకాధారములు గనుపడవు. మాచుపల్లి కైఫీయతువలన కూచిపూడి భాగవతులు క్రీస్తు శకము 15 వ శతాబ్దారంభమునాటికే నాట్యకళా ప్రవీణులై దేశసంచారము జేయుచునాటక ప్రదర్శనములుగావించుటయందు

ప్రఖ్యాతులై యుండిరని రూఢియగుచున్నది. తెలుగు పదకర్త యైన నారాయణేంద్రయతి 16 వ శతాబ్దాంతమున పారిజాతాపహరణమును తెలుగుభాషయందు వ్రాసెనని తెలియుచున్నది. నారాయణ యతీంద్రుని శిష్యుడగు సిద్ధేంద్రయోగి కూడ పారిజాతాపహరణమును వ్రాయుట, దానిని కూచిపూడి గ్రామమందలి బాలురకు నేర్పుట మొదలైన అంశములను సమర్థించెడి చారిత్రకాధారములు గనుపించవు. సిద్ధేంద్రయోగి వరుని గురుపాదుడగు నారాయణ యతీశ్వరుడు పారిజాతాపహరణమును వ్రాసినపుడు, కూచిపూడివారు మొదట వ్రాయబడిన పారిజాతాపహరణమును వర్జించి, ఆ గ్రంథకర్త శిష్యుని పాఠము నెట్లు స్వీకరించుట సంభవించెనో దురూహ్యముగ నున్నది.

రెడ్డిరాజుల కాలమునను, విజయనగరమును పరిపాలించిన రాయలు కాలమునను, ఆ వెనుక క్రీస్తు శకము 16 వ శతాబ్దారంభమునం దేర్పడిన ఆంధ్రనాయక రాజుల కాలమునను, తెలుగుదేశమందు దేశి నాట్యపద్ధతులకు చిందు, కుండలి తోలుబొమ్మలాట, యక్షగానములు మొదలగునవిజనసామాన్యమునకు ప్రధాన వినోదములుగా నుండెనని బూర్వవిషయ పరిశీలనమువలన నిర్ధారణయైనది. భరతుని నాట్యశాస్త్రము ననుసరించి మార్గపద్ధతిగూడ యీ కాలమున రాజాదరణము బొందినది.

దక్షిణదేశమందలి తంజాపూరు, ఊత్తుకాడు, ఛూల

మంగళం మొదలగు ప్రాంతములందు పదహారవ శతాబ్దము నాటికే ఆంధ్రుల నాట్య సంప్రదాయమును స్వీకరించి, తెలుగు పదములను అభినయించినట్లు కొన్ని సాహిత్యాధారములవల్ల ధృవపడుచున్నది. అట్లగుటచేసి కూచిపూడి భాగవతులు క్రీ. వె. 15 వ శతాబ్దారంభమునకే నాట్యకళయందు దాక విశిష్ట సంప్రదాయము నేర్పరచినట్లు నిర్ధారణ యగుచున్నది. ఇదే వర్తమాన కాలమునందు కూచిపూడి భరతనాట్యమని, ప్రసిద్ధి వహించి, భారతీయ నాట్యకళయందు దాక విశిష్టాంగమై వర్ధిల్లు చున్నది.

మువ్వ గోపాలపద కర్తయగు క్షేత్రయ్య తంజావూరు ఆంధ్రనాయక రాజులలో విజయరాఘవ నాయకుని కాలము నందు తంజావూరు ఆస్థాన గౌరవము నందెనని తెలుసుకొంటిమి. ఆయన రచించిన పదములనే తమిళదేశమందలి భాగవతులు గూడ నభినయించి పాడుచుండిరని తెలుపుట కనేక నిదర్శనము లున్నవి. నేటికిని ఆయా ప్రాంతములందు తెలుగుశబ్దముల నుపయోగించుచుండిరనియు తెలియుచున్నది. క్షేత్రయ్య పద ముల వ్యాప్తికి కూచిపూడి భాగవతులు దోహదము గావించి రను విషయమున సందియము లేదు.

భారతీయ నాట్యకళ కొక ప్రత్యేక సంప్రదాయమును తమపేర యర్పణము గావించిన కూచిపూడి భాగవతుల నాట్య ప్రయోగములను గురించియు, నాటకములను గురించియు, వారి ఆహార్య విధానమును గురించియు తెలుసుకొనుట, నాట్య

కళా పరిణామ చరిత్రను దెలియగోరు వారికి ప్రధాన మగుచున్నది. భారతీయ నాట్యకళాపరిణామమునందు కూచిపూడి భరతనాట్య మొక యుజ్జ్వలఘట్టము. మార్గ దేశి పద్ధతియందభివృద్ధిగాంచిన భరతుని నాట్యాభినయ సిద్ధాంతముల ననుసరించి కూచిపూడి భరతనాట్య సంప్రదాయ మొక ప్రత్యేక విశిష్టతను కలిగియున్నది. కూచిపూడి భాగవతులు కొన్ని దేశి నాట్యపద్ధతులందుగూడ ప్రసిద్ధులైయుండిరి

భాగవత నాటకములు, యక్షగానములు ఆంధ్ర కర్ణాటక తమిళ దేశములందు సామాన్య ప్రజావినోదములం దగ్రస్థానము వహించి ప్రజాదరణము పొందినవి. వీటిలో యక్షగానములు వేరొకచోట బరిశీలింపబడినవి, కూచిపూడి భాగవతులు యక్షగాన సంప్రదాయమునకు జెందినవారని జెప్పవచ్చును. వీరి వివిధ ప్రయోగములలో ప్రధానమైనది భామకలాపము. ఇది పారిజాత కథావృత్తమునుండి గ్రహించబడినది. భాగవతమను నీ భామకలాపమును వారాడుటవలన భాగవతులనబడిరి. ఇట్టి భాగవతుల సంఘమునకు బెద్దయగువానిని ఆచార్యుడందురు. వీరివద్ద నాట్యశిక్షణము బొందువారు నృత్త, నృత్య, అభినయములందు కనీసము రెండు సంవత్సరములు కృషి చేయవలెను. అభినయమున ముఖాభినయము, హస్తాభినయము ప్రధానములు. వీరు హస్తాభినయమునందు నందికేశ్వరుని అభినయ దర్పణ శాస్త్రము ననుసరింతురు. వీరికి విశిష్ట గౌరవమును, ప్రత్యేకతను కలిగించిన నాట్యప్రయోగములు

భామకలాపము, గొల్లకలాపము, దశావతార నృత్యము, క్షేత్రయ్య పదాభినయము, గీతగోవిందము, కృష్ణలీలాతరంగిణి మొదలగునవి, వీటియందు భాగవతులు గానము చేయుచు అభినయింతురు. వీరికి పగటివేషములు వేయుటయందుగూడ యభినివేశమున్నది.

కూచిపూడి వారి భరతనాట్య శిక్షణావిధానము బాలునకు శరీర వ్యాయామముతో ప్రారంభమగును. మొదటవారు విద్యార్థిచేత దండెములు, బస్కీలు తీయించి అవయవ పాటవమునకు దోహదమును కలిగింతురు. పిమ్మట అభినయమందును నర్తనమునందును ఏకకాలమునందే బాలునకు ప్రాథమిక శిక్షణ మొసగుదురు. అభినయవిన్యాసములు అభినయాభ్యాసమునందు తొలిదశ. నర్తనమునందు అడవ (పాదగతులు) అళి, ప్రచాళి మొదలగునవి ప్రారంభింతురు. అభినయమునందు అసంయుత సంయుతహస్తములను ప్రారంభించుట రెండవదశ. నర్తనమునందు ద్వితీయదశయందు అడుగులు త్రికాలమున ప్రారంభింతురు. అభినయమున విన్యాసములు, నర్తనమున 'తీరికలు' (తీరుమానములు) తృతీయ దశయందు బాలునకు నేర్పుదురు.

నాల్గవ దశయందు రసాభినయము, నర్తనమున ముక్తాయిలు, పల్లవియందు ప్రస్తారమును నేర్పుదురు. పిమ్మట అభినయమునందు కీర్తనలో భావప్రస్తారము (మార్గదేశి, దేశి పద్ధతులు) నృత్తమునందు శబ్దములు ప్రదర్శించు నప్పటికి

బాలుడు నృత్త, నృత్యాభినయములందు సుశిక్షితుడగును. వీరికి గానమునందుగూడ శిక్షణ మొసగుదురు.

కూచిపూడి భాగవతులు రుక్మిణీ పరిణయం, శశిరేఖా పరిణయం, ఉష మున్నగు నాటకములు ప్రదర్శింతురు. వీరు ప్రదర్శించెడి 'భామకలాపము' నందు సత్యభామ నాయిక. ఈ ప్రదర్శనములలో వీరొక హాస్యగానినిగూడ ప్రవేశ పెట్టుదురు. హాస్యగాడగు విదూషకుడు దీనియందు గురువుగా అన్వయించబడెను. అతను శిష్యురాలగు నాయికను పాపపంకిలమున బడకుండగా దన విపరీత వాదములతో గాపాడును. కూచిపూడి వారి విద్యలలో "గొల్లకలాపము" గూడ ప్రసిద్ధిజెందినది. దీనిలో పిండోత్పత్తి వృత్తాంతము చర్చించబడినది. నాయిక గోపకన్య. ఆమె బ్రాహ్మణ గోపజన్మలయందేది శ్రేష్టతరమని బ్రాహ్మణునితో వాదించును. కర్మప్రాశస్త్యమువలన బ్రాహ్మణజన్మ యుత్తమమైనదని యంగీకరించును.

కూచిపూడి భాగవతులు మార్గదేశి పద్ధతియందేగాక కొన్ని దేశిపద్ధతులందుగూడ వారు స్థిత ప్రజ్ఞులైరి. పగటివేషములలో వారు బుడబుక్కల వేషము, కాశీకావిళ్ళు, జంగం వేషము మొదలగునవి యిప్పటికిని నిలచియున్నవి. ఇవిగాక "దాదిర మంచం" అను మరియొక పద్ధతిగూడ పూర్వమాచారమందుండినట్లు దెలియుచున్నది.

ఆహార్య నిర్మాణమునందుగూడ కూచిపూడి భాగవతులందు శాస్త్రవిహితమైన పూర్వసంప్రదాయములు గోచరించు

చున్నవి. నాయిక వేషధారి ధరించవలసిన దుస్తులు, శరీరాలంకరణములు, కంఠాభరణములు, శిరోభూషణములు మొదలగు వాటియందు ప్రత్యేకతయున్నది. వారిలో స్త్రీ వేషమగు "భామ"కు ఆ కాలమున స్త్రీలుధరించెడి యాభరణము లన్నిటి నుపయోగించిరి.

పెద్దజడ, చిన్నజడ, శిఖ, రాగిడి, చంద్రవంక, సూర్యుడు తమలపాకులు, మొగలిరేకులు, కేతకి, తురాయి, పాపటపిండీలు కమ్మలు, చేర్లు, జూకాలు, కర్ణపత్రములు, తాయెత్తులు, తాజుబందులు, దండకడియములు, ముత్యములు, పోచీలు, కంకణములు, కడియములు, చిన్నపతకము, పెద్దపతకము, పెద్దపతకము పట్టెడ, బిళ్ళల మొలత్రాడు, అడ్డబాస, కట్టడబులాకి, ముక్కుపుడక మొదలగునవి వారి స్త్రీ వేషముల కుపయోగించిన యాభరణములు. వీటిలో శిరోభూషమణగు పెద్దజడలోని బిళ్ళలు భూగోళ ఖగోళశాస్త్రముల ననుసరించి సూర్యచంద్రులను నక్షత్ర సముదాయమును సూచించుచున్నవి. పురుషవేషమగు రాజునకు కిరీటము, శంఖచక్రములు, భుజకీర్తులు, కర్ణపత్రములు, గండభేరుండ పతకము, ప్రధాన భూషణములుగా గ్రహించిరి. వారు స్త్రీ వేషములకు లంగాలు, పురుష వేషములకు ఆయా పాత్రముల స్వభావము ననుసరించి కోట్లు, కండువాలు మొదలగు వాటి నుపయోగించిరి. నరసింహావతారము, చతుర్ముఖ బ్రహ్మ, శక్తి, దితి, హనుమంతుడు మున్నగు వేష

ములను రంగస్థలములపై ప్రవేశపెట్టునపుడు ముసుగుల నుప యోగించిరి. వీటికి కరాళములను నామమున్నది.

కూచిపూడి భాగవతుల నాటకమునందు వంతపాటకులు, తాళము వేయువారు, శృతిపోయువారు, మార్దంగికులు నుందురు. వీరికి నృత్య నాట్యాభినయములలో, ప్రయోగములలో కలిగిన ప్రత్యేక విశిష్టత యొక్క సంప్రదాయమని పరిగణన చేయబడినది. ఇది కూచిపూడి భరతనాట్యమని వ్యవహరించ బడుచున్నది. వీరి నాటక సంఘములకు మేళములను ప్రసిద్ధ నామము కలిగినది.

దక్షిణదేశమందలి కొన్ని గ్రామములందు కొన్ని బ్రాహ్మణ కుటుంబములవారు కూచిపూడి భరతనాట్య సంప్రదాయములనే యనుసరించుచుండినట్లు తెలిపెడి నిదర్శనము లున్నవి. వారును తెలుగుపదములనే పాడుట, అభినయించుట, తెలుగు సంప్రదాయమునే యనుసరించుట గనుపడుచున్నది. తెలుగు తమిళ సంప్రదాయములకు మాతృక యొకటేననికూడ తెలియవచ్చుచున్నది. ఆయా ప్రాంతములందు బర్యటనము గావించి, తమిళదేశమందలి భాగవత మేళకర్తలలో వృద్ధులగు మానవల్లూరు నారాయణస్వామి అయ్యరుగారితో సంభాషించిన శ్రీ విస్సా అప్పారావుగారు, రెండు ప్రాంతములవారును యొకే ప్రమాణ శ్లోకములను జదువుచు క్షేత్రయ్య పదములనే బాడుచు, అభినయించుచుండిరని దెలిపిరి.

తమిళ దేశమందలి భాగవత మేళకర్తలు క్రీ. శ. 1550 సంవత్సర ప్రాంతమునందు సంస్కృతభాషలో భానుదత్తమిశ్ర వ్రాసిన "రసమంజరి" యను అలంకార శాస్త్రమును లక్షణ గ్రంథముగ గ్రహించి అనుసరించిరి. ఇందలి కొన్ని శ్లోకములను కూచిపూడి భాగవతులుగూడ బాడుచుండిరి. అంతేగాక కృష్ణ కర్ణామృతమందలి కొన్ని శ్లోకములను బాడి అభినయించుచుండిరి. తమిళ భాగవతులుగూడ వీటినే అనుసరించుట, అభినయమునకు లక్ష్యప్రాయమైన క్షేత్రయ్య పదములనే వారునుబాడి అభినయించి ప్రచారము గావించుటవలన తమిళ భాగవత మేళకర్తలు గూడ వంశపారంపర్యముగ కూచిపూడి భరత నాట్య సంప్రదాయమునే యనుసరించిరను విషయము ధృవపడుచున్నది. క్షేత్రయ్య పదముల ప్రభావము దక్షిణదేశమునందు వ్యాపించుటకు కూచిపూడి భాగవతులు కారకులై యుందురు. అట్టియెడ కూచిపూడి భరతనాట్యము తంజావూరు ఆంధ్రనాయక రాజుల యాదరణమువలన ఆయా ప్రాంతములందు వ్యాపించి, తమిళ భాగవత మేళకర్తలచేత యనేక తరములనుండియు నభ్యసించబడుట హేతుయుక్తమగును. ఆంధ్ర తమిళదేశములందలి నాట్యసంప్రదాయము లొక్కటేయని నిరూపించుటకు, ఆయా పాటలు, ఆటలు, నృత్యములు నొకే పోలిక నుండుటవలన, సుకరమగుచున్నది నాయిక ప్రవేశించునపుడు ఆమె తనకు దానే జెప్పుకొనుట కూచిపూడి భాగవ

తుల యాచారము. తంజావూరునందు గూడ ఇట్టి యాచారమే యున్నదని తెలియుచున్నది.

ఇట్టి సాదృశ్యము కూచిపూడి భాగవతుల నాటకము లోని "విదూషక" పాత్రనుబోలిన తమిళ భాగవత మేళములలో "కోణంగి" పాత్రను ప్రవేశపెట్టి హాస్యరసమును బోషించుట యందుగూడ గనుపడుచున్నది. భరతనాట్యమునకు దేశము నందు మహత్తరకీర్తిని దెచ్చి భారతీయ నాట్యకళకొక మేలుజాతి రత్నమును ప్రసాదించినమహనీయులు కూచిపూడిభాగవతులు.



# యక్షగానములు

నాట్య రంగమునకు తెలుగుదేశ మర్పించిన దేశికళా సంపదలో యక్షగానములు గౌరవస్థాన మలంకరించుచున్నవి. ఇట్టి రూపకములు తమిళదేశమున భాగవత మేళనాటకము లనబడుచున్నవి. * యక్షగానములు మొట్టమొదట దక్షిణ కన్నడ దేశమందు రూపొందినవని, ఇట్టి నాటక ప్రదర్శనములు తెలుగు తమిళ భాషాప్రాంతములందు ప్రచారమందుండెనని కొందరు జెప్పుచుండిరి. కాని భాషా శాస్త్రవేత్తలు వేటూరి ప్రభాకరశాస్త్రి పండితులు, యక్షులను నొకజాతి ప్రజలు బూర్వము గుంటూరు మండలమునందు నివసించుచుండి రనియు, వారు నృత్యగానములతో నాటక ప్రదర్శనములు జేయుట కులవిద్యగా గలిగియుండిరనియు దెలిపిరి. యక్షులు ప్రదర్శించెడి నాటకములు యక్షగానము లనబడుట సమంజస ముగ గన్పట్టుచున్నది. యక్షగానములుగూడ,ఇతర కళాసంప్ర దాయములవలె దేశావృతమగుట సహజపరిణామమేయగును. యక్షగానములు మలబారుదేశమునందుగాక తదితర భాషా ప్రాంతములన్నిటియందును వ్యాపించినవని తెలియుచున్నది. కాలక్రమానుగుణముగ రూపసిద్ధి గాంచిన నాటకరంగము నకు, యక్షగాన యుగమును ప్రారంభదశయని జెప్పవచ్చును.

---

* Prof V. Raghavan.

భిన్న భాషా ప్రాంతములలోని యక్ష గానములు సంస్కృత నాట్యగాన శాస్త్రముల నాధారముగ జేసుకొని రచించబడినట్లు తెలియుచున్నది. వీటియందు భరతశాస్త్ర మార్గ దేశి పద్ధతి యనుసరించబడినది. సంస్కృత నాటక ప్రదర్శనములందు సంస్కృత నాటకలక్షణములు, భరతుని రంగస్థల నాట్యసూత్రములు మున్నగువాటిని ప్రయోగములం దనుసరించిరి. గనుకనే నృత్య, నాట్య, గీతాగానములతో బాటు అభినయముగూడ ప్రాధాన్యత వహించినది.

సంస్కృత నాటక సార్వభౌముడనదగు కాళిదాసకవి రచించిన "విక్రమోర్వశీయం" అను సంస్కృత నాటకము నందు, నాలుగవ అంకములో సంస్కృత నాటకమును ప్రదర్శించవలసిన పద్ధతి వర్ణించబడినది. ఆ వెనుక కాలమున సంస్కృత భాషయందు నాటకలక్షణములు ప్రయోగములు మున్నగు వాటినిగురించి లక్షణ లక్ష్యగ్రంథములపారముగ వెలువడినవి. సంస్కృత నాటకలక్షణ గ్రంథములవలన కలిగిన ఉత్తేజము, ఆంధ్రతమిళ కర్ణాటక దేశములందు నాటకసాహిత్య సృష్టికి దోహదము కలిగించినది. తెలుగు దేశమునందు రూపొందిన నాటకములు యక్షగానము లనబడుచున్నవి. తమిళ కర్ణాటక దేశములందవి నాటకములని వ్యవహరించబడు చున్నవి.

ఆకాలమునందాంధ్ర తమిళ కర్ణాటక దేశములందలి యక్షగానములు, నాటకములు మున్నగు వాటి రూపములే

యీనాటి దేశీయ నాట్యకళా సంపదయని స్పష్టమగుచున్నది. కాని మలబారు దేశమునందు మాత్రమిట్టి యక్షగానములు గాని, నాటకములుగాని యుండినట్లు గనుపడదు. తంజావూరు, మద్రాసు నగరములలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము లందు తెలుగు తమిళ భాషలయందలి యక్షగానములు లిఖిత ప్రతులం దనేకములున్నవి. వీటి పరిశీలన వలన క్రీ. శె. 18 వ శతాబ్దమునందు మాత్రమే యక్షగానములు ప్రారంభమైనట్లు తెలియుచున్నది.

యక్షగానములు సులభ గ్రాహ్యములుగా నుండి సామాన్య ప్రజావినోదములం దుత్తమస్థానము నలంకరించినవి. ఈ నాటక ప్రదర్శనములందు బాల్గొనెడి నటులు, వేషధార ణమును జీవితాలంబనముగా గ్రహించియుండిరి. నటకవృత్తి నవలంబింపక పోయినప్పటికిని నృత్త, నాట్య, నాటకములం దభిరుచిగలవారు కూడ నైచ్ఛికముగ నీ నాటకములందు బాల్గొని పాత్రధారణము గావించిరి. యక్షగానముల పుట్టుకను గురించి వేరొకగాథ గూడ జెప్పబడుచున్నది యక్షులను నొక గంధర్వజాతివారికి యనాదిసిద్ధముగా ఒక గానసంప్రదాయ మున్నది. ఈ నాటకములం దుపయోగించిన గానము వారి సంప్రదాయము ననుసరించి యుండుటజేత నివి యక్షగానము లనబడుచుండెనని కొందరు దెలుపుచుండిరి.

యక్షుల గాన సంప్రదాయమునుండియే క్రమేపి తమిళ పద సాహిత్యమునందు కీర్తనలు వెలువడెనని వారు దెలుపు

చుండిరి. గోవింద దీక్షితుడు వ్రాసెనని చెప్పబడుచుండిన "రాగసుధ" యను సంగీతశాస్త్రమునందు, యక్షులుపాడిన గానము సంగీతశాస్త్రమునందొక సంప్రదాయమని వర్ణించబడి యున్నది. తమిళనాట్య సాహిత్యమునం దెచ్చటను యక్షగాన మను శబ్దమును ప్రయోగించబడినట్లు గనపడదు. దివాకర,పింగ లాండై,చూడామణి మున్నగు తమిళశబ్దకోశములందు యక్షులు యనుశబ్దమునకు, ఒకజాతి గంధర్వులనియు,వారు వీణ వాయిం తురనియు కొంత దైవాంశము కలిగినవారనియు వివర్ణింపబడి నది. యక్షగానము సంగీతశాస్త్రమునందొక సంప్రదాయము నకు నామముగా పేర్కొనబడి యుండుటవలనను, యక్షశబ్దము శబ్దకోశములందు జాతిపరముగ దెలుపబడి యుండుటవలనను, యక్షులను నొక జాతిప్రజలు ప్రదర్శించిన నాటకములు యక్ష గానము లనబడుట సముచితముగ నున్నది.

ఆ కాలమున గ్రామములందు ప్రజలకు గ్రామదేవత లను బూజించుట యాచారముగ నుండెను. అప్పుడే జానపద గీతములు, నృత్యములు, నాట్యములు విరివిగ ప్రచారమునం దుండి, సామాన్య ప్రజావినోదములుగ బరిగణింప బడుచుండె నని చరిత్ర పరిశీలన దెలియుచున్నది. ఏల పాటలను, ఊయల పాటలను, జోలపాటలను అప్పటి ప్రజ లానందోత్సాహము లతో బాడియుండిరి. తెలుగు దేశమందలి యక్షగానములలోని పదములకు దరువులనునామము ఆకాలమునందే వచ్చియుండెనని తెలియుచున్నది. వీటికి నిర్ణయించిన రాగ,తాళములు ప్రత్యేక

ముగ నున్నవి. క్రీ. శ. 17 వ శతాబ్దమున అప్పకవి రచించిన ఛందశ్శాస్త్రమునందు యక్షగాన పదముల కన్వయించెడి ఛందస్సును దెలిపెను. వాటి గతులు, తాళములు, యక్ష గానముల కనుగుణముగా నున్నవి.

కన్నడ దేశమందలి యక్షగానములందు నాట్యమున కవ కాశము లేదనియు, నాట్యము ఆంధ్రతమిళ దేశములందలి యక్షగానములందు మాత్రమే ప్రాధాన్యత వహించి నాట్య వికాసమునకు దోడ్పడెననియు స్పష్టమగుచున్నది. దాక్షి ణాత్య సంగీతమునకు కర్ణాటక సంగీతమనెడి శాస్వత సంప్రదా యమును, పేరును నెలకొల్పిన కీర్తి ప్రతిష్టలు కర్ణాటక దేశ మునకే దక్కినవి. దక్షిణ కర్ణాటక దేశమందలి సామాన్యప్రజా వినోదములలో యక్షగానములు, తోలుబొమ్మలాటలు ప్రధాన మైనవి. తమిళ దేశమునందు వీటిని బయల్ ఆట్టం, పావైకూత్తు యని వ్యవహరించిరి. దక్షిణ దేశమందలి తంజావూరు జిల్లాలోని ఊత్తుకాడు గ్రామములోని దేవాలయములందు భాగవత మేళ నాటకములను అచ్చటి బ్రాహ్మణ కుటుంబములవారు తరతర ములుగా ప్రదర్శించుచుండిరని దెలియుచున్నది.

యక్షగానములందలి కథావస్తువును పురాణగాధలనుండి గ్రహించిరి. వీటియందు రౌద్ర, వీరరసములు ప్రధానముగా నున్నవి. వీరు నాటక ప్రదర్శనములందు యుద్ధములను గూడ రంగస్థలముపై జూపిరి. ఇట్టి యక్షగాన నాటకములందు గిరిజా కళ్యాణము ప్రధానమైనది. వీరు వాచికాంగికాభి నయములకు

ప్రాధాన్యత నొసగిరి. కథాకలి నాట్యము, అభినయము ప్రధానముగా గలిగియున్నది. నాటకమందలి సంభాషణాదికముల సారాంశమును గాయకులు గీతారూపమున గానము జేయుదురు. అటుపిమ్మట పాత్రధారులు సంభాషణము గావింతురు. సంస్కృత పదములతోడను, లోకోక్తులతోడను వీరి సంభాషణములు పటిష్ఠమై యుండును. యక్షగానములు లోకవృత్తమును, ఉన్నతాదర్శములను, ఉదాత్తమగు నాధ్యాత్మిక విజ్ఞానమును సామాన్యజనులకు ప్రబోధించుటయందు యొజ్జలగుచున్నవి. సత్వసంపన్నులగు ఋషిపుంగవులజేత అభ్యసించబడిన వేదవిజ్ఞానమును, జీవితలక్ష్యమును, పరమార్థమును ప్రజలయందు ప్రచారముగావించి వారికివివేకోదయములు కలిగించుటయందు యక్షగానములు అమూల్యమగు సేవజేసినవి.

ప్రాచీన నాటక లక్షణమును, నాట్యశాస్త్రమును, వాటి పూర్వరూపములను దెలుసుకొన గోరెడు వారికియక్షగానములు అత్యంతోపయుక్తములై యున్నవి.

వీటిలో ప్రధానమైన గిరిజా కళ్యాణమునందు కథను దక్షయజ్ఞ ధ్వంసముతో ప్రారంభించి తారకాసంహారముతో ముగించి, గిరిజా ప్రణయఘట్టమునకు ప్రాధాన్యత నొసగిరి. రౌద్ర వీరరసములు ప్రధానముగాగల యక్షగానములలో వాలి నిగ్రహము, ద్రౌపతిప్రతాపము, భీష్మ విజయము, విరాట పర్వము (కీచకవధ) కర్ణార్జున యుద్ధము, అతికాయ వధ ముఖ్యమైనవి. ఈ నాటకములు కర్ణాటక దేశములందు మాత్రమే

ప్రచారము గాంచినట్లు దెలియుచున్నది. ఇట్టి సంప్రదాయము మలబారు దేశమునందు ప్రత్యేకతనుగాంచిన కథాకలి నాట్యము నకు సన్నిహితముగ నున్నది. ఇది తాండవ నృత్యమునకుగూడ చేరువగనున్నది. వారు చండి, కాళికాదేవి మున్నగు పాత్రము లను భయంకరమగు నాహార్యములతో నలంకరించి ఋంజా (పెద్దడోలు) నినాదములతో రంగస్థలముపై ప్రవేశ పెట్టు చుండిరి.

యక్షగానములు భావరాగతాళముల యైక్యతను నృత్య గానాభినయములతో సుసంఘటిత మొనర్చుచున్నవి. యక్ష గానము నృత్తనాట్య సంప్రదాయమునకు జెందినది. నృత్తమును వారు మూడు భిన్నదశలందుపయోగించుచుండిరి. కీర్తన పాడునపుడు నృత్తమును మొదటి తాళమందు, గమకముల తోడను ముక్తాయిలతోడను రెండవదశయందు నృత్తమును జేయుదురు. తాళమే ప్రధానముగాగల మూడవ దశయందు ఉద్ధత నృత్తము జేయుదురు. భరతముని సంప్రదాయముననుస రించిన ప్రాచీన తాండవ లక్షణమగు 108 కారణలు 32 అంగ హారములు మున్నగువాటి ననుకరించిరి. తాండవ లక్షణమును లోకవృత్తానుసరముగ పరిష్కృత మొనర్పదలచిన నాట్య శాస్త్రనిపుణులకు, పరిశోధకులకు యక్షగానములు, వాటి పూర్వరూపములు మిక్కిలి ప్రయోజనకరములు. నేటికిని అముద్రితములైయుండిన ప్రాచీన యక్షగానములు మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు తాళపత్రములయందును

లిఖిత ప్రతులయందును యున్నవి. వీటిలో రమారమి 25 యక్ష గానములు తెలుగుభాషయందున్నవి. ఉషాచరిత్రము, ఉషాపరిణయము, ఎరుకల కురవంజి కధ, కాళీయమర్దనము మొదలగునవిగూడ వాటిలోయున్నవి. ఇవిగాక ముద్దుపళని యనెడి వారాంగన రచించిన కీర్తనలు గూడ అముద్రితములైయున్నవి. అచ్చటయున్న మరికొన్ని ప్రాచీన నాట్యాలంకార శాస్త్ర గ్రంధములవలన గూడ పరిశోధనా కృషి సఫలీకృతముగాగలదు. యక్షగానములందు సంభాషణాదికములు లేనియెడల నివి గూడ అభినయ ప్రాశస్త్యమును బొంది కథాకలి నాట్యమువలె గనుపడును. నాటకములందు సంభాషణలు ప్రవేశపెట్టుట వలన క్రమేపి అభినయముయొక్క ప్రాధాన్యత తగ్గియుండవచ్చును.

పూర్వకాలమున నాటక ప్రదర్శనములందు కథాభాగమును వంతపాటకులు గానము చేయునపుడు నటులు నృత్త నాట్యాభినయములతో భావప్రదర్శనము జేసియుండవచ్చును. యక్షగానములు నాట్యసంప్రదాయ పునరుద్ధరణమునకు వలయు విషయ వివరణముతో వివిధావకాశములను సూచించుచున్నవి. నాట్యశాస్త్రవేత్తలయొక్క పండితకవులయొక్క ఆలంకారికుల యొక్క దృష్టి వీటిపై బ్రసరించిననాడు నాట్యప్రపంచమునందొక యుజ్వలశకము ప్రారంభము కాగలదు.

---

# మలబారు కథాకలి నాట్యము

మలబారు దేశమందు నివసించెడి భిన్న జాతులలోను, కులములలోను వారివారి యాచార సంప్రదాయముల ననుస రించి వారియందొక సహజమగు నాట్యాభినివేశముండెనని మనము తెలుసుకొంటిమి. కాలక్రమానుగతమున ప్రజల మత సాంఘికాచారములందును, వైజ్ఞానికసంస్కృతి రంగములందును మార్పు గలిగినది. ప్రజల మతాచారములు, దైవపూజాదిక ములు కాలానుగుణముగ నట్టిమార్పును అనుసరించినవి. అచ్చటి రమణీయమగు ప్రకృతి సంపద, వివిధ నదీనదములతోడను, తరు లతావితానములతోడను పుష్పపరాగములతోడను, మానవుని సౌందర్యపిపాసను ప్రచలితము గావించినది. కాగా అతని దృక్కులలోను, నడకలోను, అవయవ చాలనములోను భావా రములు గోచరించినవి. అతని యిష్టభావ ప్రకటనము అభినయ మైనది. భౌతికప్రపంచ పరిణామములాతని సహజలావణ్య మునకు, స్వీయభావ ప్రకటనమునకు వన్నె దెచ్చినవిగాని యవ రోధములు గల్పించలేదు. అతని అంతర్గత శక్తుల విజృంభణము శాస్త్రవిహితమై, అర్థయుతమై, క్రమబద్ధమైనపుడు, వివిధ దేశి నాట్యపద్ధతులందలి యుత్కృష్ట సుగుణములను సంత రించుకుని కథాకలి నాట్య ముదయించినది.

ఉదాత్తమగు అభినయ పరిజ్ఞానమును మనోజ్ఞగాన

మును కలిగిన కథాకలి నాట్యమును ఒక నృత్తరూపకమని చెప్పుకొనవచ్చును.

* కొత్తరక్కర రాజు (క్రీ. శ. 1575–1650) కథాకలి నాట్యమునకు మూలపురుషుడని చెప్పబడుచున్నది. ఆయన గొప్ప పండితుడు పదకర్తయునై యుండెను. ఆ కాలమునందు జానపద నాటకములను, వాటి ప్రదర్శనములను పునరుద్ధరించవలెననెడి చైతన్యము కలిగినది. అట్టి చైతన్యము కలుగుటకు, నూతన రచనా విధానము సాగుటకు రాజాదరణము లభించియుండుటె కారణమగుచున్నది. వారా కాలమున నాట్యప్రయోగమునకు ప్రాచీనగ్రంథమగు "రామనాట్టం" గ్రహించిరి. దీనియందలి కథ దశరథుని పుత్రకామేష్టితో ప్రారంభమై, మహావిష్ణువుయొక్క అవతారములలో నొకటగు రామావతారచరిత్రమును సంపూర్ణముగ వివరించుచు, రావణుని లంకానగర ధ్వంసముతో పూర్తి యగుచున్నది. కథాకలి నాట్యమునందు కొత్తరక్కర రాజునకు గల ప్రతిభాసంపదను గాంచి, యా కాలమున కాలికట్ జామరిన్ విస్మయ భరితుడయ్యెనట.

ఆయన నాలుగు కథాకలి నాటకములనుగూడ రచించెనని తెలియుచున్నది. నాటక రచనయందేగాక, నాట్యప్రయోగమునందుకూడ ఆయన ప్రజ్ఞావంతుడై యుండెను. భరతముని నాట్య సిద్ధాంతముల ననుసరించి, దేశి సంప్రదాయములలోని విశిష్ట గుణములను సంతరించుకుని రూపొందిన కథాకలి

* The Mime of Kathakali-Rajendra Shankar.

నాట్యము, భారతీయ నాట్యమునందొక విశిష్టభాగమై మలబారు దేశమునకు ప్రత్యేక గౌరవమును గలిగించుచున్నది. కేరళ దేశమందు క్రీ. వె. 1668 నుండి క్రీ. వె. 1743 వరకు కథాకలి నాట్యము ప్రసిద్ధిగాంచి యుండెనని పూర్వ చరిత్రవలన దెలియుచున్నది.

కాలికట్‌ను పరిపాలించిన జామరిన్‌లలో నొకరు "కృష్ణాట్టం" అను నాటకమును, జయదేవకవి గీత గోవిందము ననుసరించి రచించెననియు, ఆ నాటక ప్రదర్శనము నాయన యభిమానించి ప్రోత్సహించెననియు, ప్రొఫెసర్ పిసరోటి జెప్పినట్లు తెలియుచున్నది. "కృష్ణాట్టం" ఇప్పటికిని కొన్ని ప్రాంతములం దక్కడక్కడ ప్రదర్శింపబడు చున్నదని వినికిడి వలన దెలియుచున్నది. జయదేవకవి రచన, కేరళ దేశమందలి సంగీత శాస్త్రముపై క్రీ. వె. 14, 15వ శతాబ్దములందు గొప్ప ప్రభావమును జూపెను. వీర కేరళవర్మ క్రీ. వె. 17 వ శతాబ్దమునందు కథాకలి నాటకములను, కొన్ని పదములను రచించెనని మరికొందరు జెప్పుచుండిరి. ఆ కాలమున "కృష్ణాట్టం" ప్రసిద్ధినొంది యున్నది. జామరిన్ మిత్రుడొకరు, వారి నాటక సంఘమును తన గ్రామమునందు ప్రదర్శనము గావించుటకు బంపవలెనని కోరినపుడు, "ఈ నాట్యము నర్థము చేసుకొనగలిగినవారు మీ గ్రామమునందుండరు" అని సమాధానము జెప్పెనట. అప్పుడాయన మిత్రుడు పట్టుదలతో దన గ్రామమునందొక నాటక సంఘమును నెరకొల్పి "అట్టకథ" యను ప్రద

ర్శనము గావించెనని జెప్పుదురు. "కృష్ణాటము"నకు పూర్వమే కొత్తరక్కర రాజు "చెక్కియార్ కూత్తు" "కూత్తియాట్టం" అను రెండు నాట్యపద్ధతులు నెలగొల్పెనని దెలియుచున్నది. ఈ నాటకములన్నియును ప్రాచీన సంస్కృత నాటక లక్షణములు కలిగియున్నవి. కేరళ దేశమును పాలించిన పెరుమాళ్ళ ప్రభువుల కాలమందు గూడ పైన దెలిపిన నాటక, నాట్యములు ప్రసిద్ధివహించి యుండెను.

వీటినుండియే కథాకలి నాట్యమందలి అభినయము, ముద్రలు, వేషరచన మున్నగునవి గ్రహించిరి. క్రమేపి చెక్కియార్ కూత్తు, కూత్తియాట్టం నాట్యము మొదలగు నాట్యముల కంటె కథాకలి నాట్యప్రాశస్త్యము శిష్టుల యామోదమును బొంది జనాకర్షణ గలిగించినది. పూర్వము దెలిపిన రెండు నాట్యప్రయోగములను దేవాలయములందే జరుపవలెననెడి సంప్రదాయ సిద్ధమగు విశ్వాసమున్నది. కాని కథాకలి నాట్యప్రయోగమున కట్టిసల నిర్ణయములు లేవు. ప్రజల విశ్వాసములందలి పూనికను సడలించుటయందు కాలము గొనివచ్చిన మార్పులలో మలబారుప్రజలు కథాకలి నాట్యప్రయోగమును గూడ దేవాలయములందే జరుపవలెనని నిర్ణయింపకుండుట యొకటై గనుపడుచున్నది.

కథాకలి నాట్యము క్రీ. వె. 17 వ శతాబ్దములోని ప్రథమార్థభాగమునందు ప్రారంభమైనదని జెప్పవచ్చును ఈనాట్యమందలి ముద్రలు, వాటిపేళ్లు, కొన్ని వస్తువులను, జంతువులను

సంజ్ఞాపూర్వకముగ సూచించుచున్నవి. పతాక, కపోత, కర్తరీ ముఖ హస్తముల నామములు ధ్వజమును, గువ్వను, కపోతమును దెలుపుచున్నవి. తాంత్రిక యుగమునందు దేవపూజా విధానము ననుసరించి ముద్రల నుపయోగించినపుడు వాటికీ నామములు వచ్చియుండవచ్చును. కాని భరతముని నాట్యశాస్త్రమునందు బేర్కొనిన అసంయుత సంయుత హస్తములకును నేడు యాచారమందున్న ముద్రలకును భేదము గనుపడుచున్నది. నాటక లక్షణ లక్ష్యములను సంతరించుకొనిన కథాకలి నాట్యము గీతావాద్య నృత్యాభినయములతో గుణవత్తర మగుచున్నది.

నాట్యాభినయమందు భరతుని మతము ననుసరించి సాత్వీక, వాచిక, ఆంగిక, ఆహార్యాభినయములు, చతురశ్ర జాతి లక్షణములు, అసంయుతాది సంయుతముద్రలు మున్నగునవి కథాకలి నాట్యమునందుగూడ ప్రాధాన్యత వహించుచున్నవి. కథాకలి నటునకు అంగ, ఉపాంగ, ప్రత్యంగముల ప్రదర్శనాదికములందు లాఘనముగలిగి యుండవలెను. విభావాను భావముల ననుసరించియు స్థాయీ భేదముల ననుసరించి యూ ముఖాభినయము ప్రధానముగుచున్నది. నటుడు వివిధ హస్తముల నభినయించుటయందు నేర్పరి గావలెను. పాదగతులందు వారికిని తాళము ప్రధానముగుచున్నది. వారి నృత్యమునకు ఆది, చంప, ఆట, త్రిపుట, పంచరి తాళము లుపయోగించబడినవి.

కథాకలి నాట్యము అభినయ ప్రధానమైనది. గనుక కథాకలి నటకుడు అభినయకుశలుడు గావలెను. ఈ నాట్యము అభినయమునకు ప్రాధాన్యత నొసగుచుండినప్పటికిని, దీనియందు నృత్త నాట్యము లంతర్లీనమగు చున్నది. ఇట్టి నాట్యమునందు వాచికమును దొలగించుటవలన సూక్ష్మాతి సూక్ష్మాంశములు, సంజ్ఞలు, స్వరూప విరూపణములు, దృశ్యములు, మనోగత భావములు అభినయమందే ప్రదర్శింపవలెను. అభినయమునందు 64 హస్తములును, 500 శబ్దములును సూచించబడినవి నేత్ర భేదముల వలన మనోగత వ్యాపారమును అభినయించవలెను. కరుణ, శృంగార, భయానక, వీరరసములు ముఖాభినయమునను, భ్రూవిక్షేపములవలన హృదయ రహస్యములను వ్యక్తము జేయవలెను.

కథాకలి నాట్యమునందు గానమునకు గూడ ప్రత్యేకత యున్నది. పాటకుని గానమునకు అనుగుణముగా నటుడభినయ మొనర్పవలెను. ఈ నాట్యమునందు గీతము రసభావములను ప్రస్తరించును. నటుడు వాటి విభావానుభావముల నెరింగి నృత్తముజేయుచు అభినయించును. కథాకలి నటుడు భిన్నాంగ హార కలితమైన కథాకలి నాట్యముచేత సామాజికులను గంటల తరబడి రంజించగలడు. ఈ నాట్యోదయము వలననే, కేరళ దేశ నాటక కళారంగముగూడ సంపద్విలసితమై విశ్రుతఖ్యాతి గాంచినది.

కేరళదేశమందు నాట్యవిద్య నభ్యసించెడి బాలురు

పది పన్నెండు వర్షముల ప్రాయమునందు ఆచార్యునొద్దకేగి దీక్షావస్త్రమును గ్రహించుట వారికొక యాచారమైయున్నది. శిష్యులు గురుకట్నములను సమర్పించుట, వాటిని గురువులు గ్రహించుట వారివారి సాంప్రదాయములు. నాట్యాచార్యుడు 'కలారి నాట్యశిక్షణశాలయందు' విద్యార్థికి ప్రవేశమిచ్చిన పిదప, నాట్యప్రారంభమునకు బూర్వము బాలునకు శరీర వ్యాయామమును నేర్పును. పిమ్మట ఆచార్యుడు బాలునకు అవయవపాటవము చేకూరుటకు శరీరమర్దనము జేయును. విద్యార్థికి రెండవ దశయందు నేత్రాభినయమును నేర్పును.

కనులు, కనుబొమ్మలు, కనుపాపలు, చెక్కిళ్ళు, మెడ, పెదవులు మొదలగు స్థానములం దభివ్యక్తము గావింపవలసిన వివిధరసములను వాటిస్థాయీ భావములను అభినయించుట యందు శిక్షణమిచ్చును. మూడవదశయందు బాలునకు అసం యుతాది సంయుత హస్తముల భేదములను, వాటి నభినయిం చెడి విధానమును నాట్యాచార్యుడు దెలుపును. తుదిదశయం దాయన వారికితాళమును నేర్పును. పాదగతులు, హస్తాభినయ ము రెండును తాళప్రధానమై యుండును. ఈనాలుగు దశలందును నాట్యకళయందలి ప్రాథమిక శిక్షణమును బొందుటకు నాలు గైదు మాసములగును అటుపిమ్మట, గురుసమ్ముఖమునందు నాట్యశిక్షణముబొందిన బాలుడు నాట్యప్రయోగము గావిం చును. కొన్ని వత్సరముల పర్యంతము సాధనము జేసినపిమ్మట కథాకలి నాట్యమునందు శిక్షణము వడసినబాలు డీ నాట్య

ప్రయోగమునందు కుశలుడగును. ఈ నాట్యమునందు ప్రావీణ్యత బొందుటకు ఆరు సంవత్సరములు సాధనము జేయవలెను వివిధహస్తములు అభినయించ గలిగిన శక్తిసామర్థ్యములు కలిగినపుడే యాతడు కథాకలి నటు డనిపించుకొనును.

కథాకలి నాట్యసంప్రదాయము ననుసరించి అభినయము ప్రాకృతమని, ప్రతిరూపియని, ప్రసరితమని మూడు పద్ధతులుగ విభజన చేయబడినది. ప్రాకృతాభినయము స్వాభావికమైనది. ప్రతిరూపి యనుకరణ ప్రధానమైనది. పూజారాధన, వరదానాభినయములు ప్రసరిత మనబడుచున్నవి. ఈ యభినయమును ప్రదర్శించుటకు మూడు ప్రధానభాగములు పేర్కొనబడినవి. వీటియందు మొదటిది శిరస్సు, ద్వితీయ, తృతీయ భాగములుగా అవయవములు, హస్తాభినయము దెలుపబడినవి వీరు 13 శిరోభేదములు పాటించుచుండిరి, అవి అకంపిత, కంపిత, ధుత, విధుత, పరివాహిత, అధుత, అవధుత, అంచిత, నిహంచిత, పరావృత, ఉత్క్షేప, అధోగతి, లోలిత, ప్రకృత యనబడుచున్నవి. ఇవిగాక 8 విధములగు దృక్కులు, 36 దృష్టి భేదములు, 7 భ్రూవిన్యాసములు, 9 కనురెప్ప భేదములు, 9 కనుపాప విన్యాసములు యున్నవి. ఇట్లే చెక్కిళ్లు, ముక్కు, క్రింద పై పెదవులు, గడ్డము, నోరు, ముఖము, కంఠము మొదలగు వాటికి ప్రత్యేకాభినయములు సూచించబడినవి.

హస్తమే భావము నభినయించునో నేత్రమచ్చటనే యుండవలెననియు, నేత్ర మెచ్చటనుండునో మనస్సు యచ్చటనే

లగ్నము గావలయుననియు అభినయ శాస్త్రకోవిదులు దెలిపిరి. దీనివలన నటుడు మానసికముగ జిత్రణ గావించుకొనిన యను భూతిని అభినయమునందు బ్రదర్శించగలడు. కథాకలి నాట్య సంప్రదాయమునందు ప్రాచీనమతము ననుసరించి 64 అసం యుతాది సంయుత ముద్రలు గ్రహించబడినప్పటికిని వారు ఆచరణయందు మాత్రము నాలుగు ముద్రలనే అభినయించు చుండిరని దెలియుచున్నది.

కథాకలి నాట్యమున కెట్టి ప్రత్యేకత యున్నదో యట్లే వీరి యాహార్యమునందుగూడ బ్రత్యేకత పొడగట్టుచున్నది. వీరి స్త్రీ పాత్రలు మహమ్మదీయ స్త్రీ లుపయోగించెడి పైజా మాలు ధరింతురు. పురుష వేషధారులు శిరోవేష్టము లుపయో గింతురు. వీరి స్త్రీలు మురుగులు, భుజకీర్తులు, హారములు, పాదములకు గొలుసులు ధరింతురు. వీరి వేషములు సాత్విక, రాజసిక, తామసికములను మూడు భేదములు కలిగియుండును. వీరి పాత్రల స్వభావములను బట్టి వారికి అయా రంగులుగల దుస్తుల నుపయోగింతురు. సాత్వికగుణమునకు ఆకుపచ్చని రంగును, రాజసిక గుణమునకు ఎరుపురంగును, తామసిక గుణ మునకు నలుపురంగును, సత్వరజోగుణములు రెండును గలసి నపుడు పసుపుపచ్చ రంగును వారు ప్రధానముగా గ్రహింతురు ఆయా పాత్రముల స్వభావముల కనుగుణముగా వారికి ఆయా రంగుల నుపయోగించెదరు.

కథాకలి నాట్యము భారతీయ నాట్యకళ యందొక

విశిష్టస్థానము బొంది ప్రపంచ నాట్య కళాకోవిదుల దృష్టి నాకర్షించి, వారి ప్రశంసలు బడసినది.

భారత దేశమందలి భిన్న నాట్యకళా సంప్రదాయము లలో నొక్క కథాకలి నాట్యమునందే పురుషనాట్యము ప్రాధాన్యతను కలిగియున్నది. ఈ నాట్యసంప్రదాయమును నెల కొల్పిన కేరళ దేశమందలి నాయరుశాఖకు జెందినవారు శరీర పాటవమునుగలిగి అధిక సంఖ్యాకులుగా సైనిక శాఖయందు జేరి దేశసేవ జేయుచుండిరి. వీరికిగల బలపరాక్రమములు, ధైర్య సాహసాదిగుణములు మున్నగు వాటివలన ఉన్నత పదవుల శాఖయందలివారు నేటికినినిర్వహించుచుండిరి. బలసంపన్నులగు నాయరులవలన నేర్పబడిన కథాకలినాట్యము, క్రమేపి నంబూద్రిశాఖ వారిచేత బరిష్కరింపబడి రమణీయమై వారి యాదర ప్రోత్సాహముల నందు పటిష్టమైనది.

దక్షిణ దేశమందలి ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ భాషా ప్రాంతములందు క్రీ. వె. 10 వ శతాబ్దమునుండి క్రీ. వె. 18 వ శతాబ్దా రంభమువరకును గల మధ్యకాలమునందు నాట్యకళ మార్గదేశి, దేశపద్ధతులందు, ప్రాచీన నాట్య సిద్ధాం తములను, దేశీ నాట్యసంప్రదాయములను సక్రమ నిర్మిత విధానములందు సుసంఘటిత మొనర్చుకొనుచు యభివృద్ధి గాంచినది. రాజ సన్మానగౌరవము లందిన నీ నాట్యగాన శాస్త్రములం దనేక లక్షణ లక్ష్యగ్రంథములు వెలువడినవి. ఆ యాకాలములందలి రాజులు సాహిత్యాలంకార శాస్త్రము

లందును, నృత్యగీతాగానాది కళలయందును, స్వతఃసిద్ధముగా ప్రవీణులై యుండుటవలన గ్రంథరచనము తామే గావించిరి. వారు కవులను, పండితులను, నటకులను బోషించి వారా కళల కాలంబనమై వాటి యభివృద్ధికి దోహదము గలిగించిరి రాజ సభాగౌరవము, ప్రజాదరణము గాంచిన నాట్యకళ ఈ. కాలమునందు బహుళ వ్యాప్తిగాంచి చరిత్రాత్మకమైనది. నాట్యకళ మహోన్నతస్థితిగాంచిన నీకాలమునందే సంగీతశాస్త్రములు, అభినయోపయుక్తములగు వివిధ పదములు. నృత్త నాటకములు వెలువడినవి. ఆయాశాస్త్ర గ్రంథములను జదివి, నాట్యాభినయముల నభ్యసించిన భాగవతులు నృత్త, నాట్య, నాటకములను ప్రదర్శించి, వాటి యున్నత లక్ష్యముల నిరూపించిరి. యాకాలమున నాట్యకళా ప్రాభవమునందొక యుజ్వల ఘట్టమనవచ్చును.



# నవాబుల పాలనమందు దక్షిణదేశము

దక్కను దేశమునందలి గోలుకొండ నవాబు అబ్దుల్లా కుతుబ్ షా (క్రీ. వె, 1622 - క్రీ. వె. 1727) పరిపాలన చేయు చుండిన కాలమున తెలుగుపద కర్తయగు క్షేత్రయ్య ఆ నవాబు దర్బారునందు మువ్వగోపాలునిపై పదములు జెప్పి సన్మానమును బొందినట్లు తెలియుచున్నది. దౌలతాబాదు నగర సుల్తాన్ ఆ పట్టణమందలి పణ్యాంగనలు జేసెడి నృత్య నాట్య ప్రదర్శనములను జూచుటయందు కుతూహలముగలిగి వారి నాట్య ప్రదర్శనముకై బ్రత్యేకముగ నిర్మించిన గుడార మునకేగి వారు గావించెడి సత్కారములనంది నాట్యాభినయ ములను గాంచివారిని బహుకరించుచుండెనని విదేశయాత్రికుడగు ఇబిన్ బూటా రచనవలన దెలియుచున్నది. నవాబుల పరిపా లనా కాలమునందు నాట్యకళాభివృద్ధికి కృషి జరుగలేదు. కాని దాక్షిణాత్యులకు మహమ్మదీయులతో నేర్పడిన సాహచర్య ప్రభావమున హిందూరాజులుగూడ అంతఃపురములందు పరి చారికా జనమునేగాక అంతఃపుంతకాంతలనుగూడ నియమించెడి యాచార మేర్పడినది. నాట్యాంగనలు నర్తనము జేయునపుడు మహమ్మదీయ స్త్రీలు ధరించెడి పైజామాల నుపయోగించి నట్లు కొన్ని బాసిన శిల్పములవలన విదితమగుచున్నది. స్త్రీ యాహార్య విధానమునం దిట్టి పరిణామము కలుగుటకు కార

ణము వారికి మహమ్మదీయులతో నేర్పడిన సన్నివేశమైయుండ వచ్చును. తూర్పుచాళుక్యరాజులకాలమునందును, కాకతీయుల కాలమందును, ఆ వెనుక దేశమునుబాలించిన రాయలు యుగ మందును, రెడ్డిరాజుల పాలనమందును నాట్యకళ చిగురించి కొమ్మలెత్తినది. తంజావూరు ఆంధ్ర నాయకరాజుల కాలమున నాట్యకళ మొగ్గదొడిగి, వికసించి సుగంధమును నలుగెలంకుల ప్రసరించినది. అటుపిమ్మట మధురస్మృతి చిహ్నములను నిలిపికాలక్రమమున యీకళ రూపహీనమై పోయినది.

నాట్యకళా పరిణామ చరిత్రయందు నవాబుల పరిపాల నము ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని యెట్టి ప్రాధా న్యతను వహించనప్పటికిని, యప్పటి ఉత్తర దేశమందలి చారి త్రక పరిణామముల ప్రాబల్యము వలన దక్షిణ దేశమం దేర్ప డిన పరిస్థితులను చారిత్రక దృష్టితో యను సంధానము జేయుటకు ఇచ్చట ఉటంకించబడినది.

మొగలు చక్రవర్తులు దక్కను రాజ్యములపై జరిపిన దండయాత్రల ఫలితముగా ఔరంగజేబు యనంతరము మొగలు సామ్రాజ్యము క్షీణించినది. ఆయన యనంతరము ఉత్తర దేశమునందు బలీయమగు మహారాష్ట్ర రాజ్యమేర్పడి నది. మహమ్మద్‌షా కాలమునాటికి మొగలు సామ్రాజ్యము నామమాత్రావశిష్టమైనది. అసఫ్‌జా నిజాం - ముల్క్ - ఉల్ దక్కనులో హైదరాబాదును ముఖ్యపట్టణముగ జేసుకుని స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. కర్ణాటకమునందొక మహమ్మదీయ రాజ్యమేర్పడినది. పీష్వాల యధికారముక్రింద

మహారాష్ట్రులు హైదరాబాదు నవాబుపై దాడి చేయుచుండిరి

రత్నగర్భయని వాసిగాంచిన భారత దేశముతో వ్యాపారము జరుపుటకు బుడతకీచులు, డచ్చివారు, ఫ్రెంచివారు ఆంగ్లేయులు వచ్చిరి. అంగ్లేయులు క్రీ. శె. 1640 సంవత్సరము నందు చంద్రగిరి రాజువద్ద ప్రస్తుతపు చెన్నపట్టణమను స్థలమును గొని యొక ఫ్యాక్టరీని నిర్మించుటకు అనుమతిని బడసిరి. ఆ వెనుక వారు కలకత్తా నగరమును ఢిల్లీ చక్రవర్తులనుండి సంపాదించిరి. వాణిజ్యమునకై వచ్చిన విదేశీయులు భారతదేశమందు దమరాజ్యమును నెలగొల్పవలెనని యత్నించిరి. దక్కను దేశమందలి పోరాటములు, అంతఃకలహములు ఫ్రెంచి వారికిని, ఆంగ్లేయులకును స్వీయరాజ్య స్థాపనమునకవకాశము కలిగించినవి. కర్ణాటక యుద్ధములందును, మహారాష్ట్రులు హైదరాబాదు నవాబుపైన జరిపిన యుద్ధములందును ఫ్రెంచి వారును ఆంగ్లేయులును పక్షములు వహించి పోరాటములం దొకరి నొకరెదుర్కొనిరి. పిమ్మట ఆంగ్లేయులు ఫ్రెంచివారిని యోడించి తమ యధికారమును కొన్ని పట్టణములందు స్థాపించిరి. హైదరాబాదు నవాబునకు యుద్ధమునందు సహాయము జేసినందులకు ప్రతిఫలముగా వారికి ఆయన దత్తమండలమను ఉత్తరసర్కారు జిల్లాలను బహూకరించెను. ఆ వెనుక ఆంగ్లేయులు భారతదేశమందు తమ యధికారమును సుస్థిరముగా నెలగొల్పిరి. ఆంగ్లేయులు రాజ్యపాలనమునకవసరమగు పరిపాలనాయంత్రాంగమును ప్రతిష్ఠించి దమ ప్రభుత్వమును బటిష్టము గావించుకొనిరి.

# ఆంగ్లేయుల కాలమున దేశీయకళలు

ఆంగ్లేయులు దేశమునందు నెలకొల్పిన విద్య, వారి దుస్తులు, యాచారములు, నాగరికత ప్రజల నాకర్షించినది. కాగా పలువురు పాశ్చాత్యవిద్య నభ్యసించి యున్నత పదవుల నలంకరించిరి. ఆనాడు విద్యావంతులకు ప్రభుత్వమందు గౌరవమర్యాదలు లభించినవి. నూతన విద్యాసంస్కారములను బొందినవారు నాగరికతా సంపన్నులుగా పరిగణనచేయబడిరి. భారతీయులకు పాశ్చాత్యులతో నేర్పడిన సన్నిహితత్వము వలన విద్యావంతులగు ప్రజలకు వారి ననుకరింపవలెననెడి యభిలాష కలిగినది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహము దేశమునందు ముమ్మరమైనవి.

భారతదేశమునకు వచ్చిన ఆంగ్లేయ భాషాపండితులు సంస్కృత, ద్రావిడ భాషలను యభ్యసించి వారాయాభాష యందలి యుత్కృష్టశాస్త్రగ్రంథములను, ఆధ్యాత్మిక వేదాంత గ్రంథములను, ఆంగ్లభాషయందు అనువాదము గావించిరి. వీటి వలన భారతీయుల విజ్ఞానము సంస్కృతి, జీవితాదర్శములు వారికి కొంతవరకుగోచరమైనవి. ప్రాచీనకాలమందు సాహిత్య శాస్త్రాలంకారగ్రంథములు ప్రాకృత సంస్కృతభాషలందే రచించబడినవి. ఆయాభాషలతో పరిచయము గోల్పోయిన ఆధునికులకు, పూర్వశాస్త్రగ్రంథములు దెలియగోరువారికి నేడు ఆంగ్లేయానువాదములే శరణ్యములగుచున్నవి.

కాలక్రమమున ప్రజలకుయందును ముఖ్యముగ పాశ్చాత్య విద్యావంతులకు దైవారాధనము పూర్వమతాచార సంప్రదాయములు, దేశీయ కళారూపములు యనాగరిక చిహ్నములై గనుపట్టినవి. పాశ్చాత్య, భారతీయ సంస్కృతుల లోని వైవిధ్యమునవలన, భారతీయ సంస్కృతిపాలకులగు పాశ్చాత్త్యుల యనాదరణమునకు గురియైనది. ప్రభుత్వకరావలంబనమును, ప్రజల యాదరమును గోల్పోయిన దేశీయ కళలగు సంగీతము, నాట్యము, క్రమేపి వాస్తవిక జీవితమునకు దూరస్థమైనవి. కాగా, సంగీత నాట్యకళలు ప్రాచీనౌన్నత్యమును చేజార్చుకొని నామమాత్రావశిష్టమై నిలచినవి. ఈ కళలు తరచుగా పాశ్చాత్య విద్యావంతుల నిశిత విమర్శలకు గురియైనవి.

ఆనంద కాముకుడగు మానవునకు కళలు అవ్యయానందము నొసగుచున్నవి. అట్టి యానందమును బొందుటకు మానవుడను సంధించిన సభ్యతవిఘాతమును కలిగించగూడదు. బ్రహ్మపదార్థమగు యానందమును మానవుని కర్పించుటయందు నాట్యకళ శ్రద్ధాదానమైనది. ఇట్టి దైవకర్తృత్వముగల నాట్యమునకు నీచత్వము నారోపించి యీ కళాభ్యాసము జేసి నృత్యనాట్య ప్రదర్శనలొసగెడి కళావంతులను సంఘమునుండి బహిష్కరింపవలెననెడి సంస్కారోద్యమ మీకాలమునందు ప్రారంభమైనది. పాశ్చాత్యవిద్యావంతులే ఈ యుద్యమమునకు నాయకత్వమును వహించిరి. నాట్యప్రదర్శనములవలన కలిగెడియానందము

సుఖోపభోగములకుద్దీపనము గలిగించుచున్నదనియు, అట్టి యానందము నొసగుటకు కళావంతులాలంబనకారులగు చుండిరనియు విమర్శకులు ప్రచారముగావించిరి. సంఘమును నైతిక పతనమునుండి గాపాడుటకు కళావంతుల నాట్యప్రదర్శనములను బహిష్కరింపవలెననెడి యుద్యమము క్రమేపి దేశమునందు బలీయమైనది. కాగా ధనవంతులు వివాహాది శుభకార్యములందు నాట్యప్రదర్శనములను జరిపించుట మానివైచిరి. కళావంతుల నాట్యప్రదర్శనములను, విద్యావంతులు, సంస్కారప్రియులు బహిష్కరించిరి. గాని వారికి యాశాఖవారితో కలిగిన పరిచయము మాత్రము సన్నగిలలేదు. ఈ సంస్కారోద్యమకర్తలు, నాయకులు లక్షించిన నైతిక పునరుద్ధరణము ఫలప్రదము గాకముందే నాట్యకళమాత్రము క్షీణించినది. కళావంతులు నాట్యవృత్తినుండి విరమించిరి. వారు వివాహములు జేసుకొనిరి. దేశములో నాట్యమును కులవృత్తిగా స్వీకరించిన కళావంతులు నాట్యకళాసేవనుండి విరమించుటవలన యీ కళకు యాలంబనముగాని, యట్టి కళాభిమానులకు సంఘమునందు స్థానముగాని లేకపోయినది. మహోత్కృష్టమైన నాట్యాలంకార శాస్త్ర సంప్రదాయములు నామమాత్రమైయున్న కాలమున దేశమందలి జమీందారులు ఖిలమగుచున్న నాట్యాచార సంప్రదాయములను నిలువబెట్టి తిరిగి ప్రాణప్రతిష్టగావించిరి. వారి గ్రామములందలి దేవాలయములకు ఈనాములను కళావంతుల కిచ్చివారిచేత గుడిసేవ జేయించుచుండిరి.

## జమీందారుల నాట్యకళాపోషణము

విజయనగర సామ్రాజమునందు మండలేశ్వరులుగ నుండినవారు, రాయలు పరిపాలనానంతరము దేశమునం దక్కడక్కడ స్వాంతంత్రాధికారము నెలగొల్పియుండిరి. అట్లే మధుర,తంజావూరు ఆంధ్రనాయక రాజులకాలమునందుకొందరు కప్పములు జెల్లించుచుండియు స్వాతంత్రాధికారమనుభవించు చుండిరి. ఆంగ్లేయుల పరిపాలనాకాలమునాటికి దేశమునందు జమీందారు కుటుంబములవారు కొందరు కొన్ని గ్రామము లందు పరిపాలనము జేయుచు నొకవిధమగు స్వాంతంత్రాధికార మును కలిగియుండిరి. ప్రభుత్వమునకు రైతులు చెల్లింపవలసిన శిస్తులను వసూలుచేసి ప్రభుత్వమునకు జెల్లించుటకు ఆంగ్లేయ ప్రభుత్వకాలమునందు జమీంధారీ వ్యవస్థఏర్పడివది. వీరు ప్రభుత్వము వలన సన్నదులు పొంది ఆ గ్రామములనుండి ప్రభుత్వమునకు చెల్లింపవలసిన శిస్తులు వసూళ్ళు జేసి కొంత కొంత "పేష్కస్" ను ప్రభుత్వమునకు గట్టుచుండిరి. వీరికి యా గ్రామములపై సర్వాధికారములుండెను. వీరి పరిపాలన మందలి గ్రామములకు జమీందారీ గ్రామములనుపేరుకలిగెను. ఈజమీందారులుదమకులభించెడియాదాయం నుండి కొంతభాగ మునుఆయాగ్రామములందు వేదపాఠశాలలు నెలగొల్పుటకును, దేవాలయములకును, యీనాము లొసగి వృత్తులవారి వలన యంగరంగవైభవములతో గుడిసేవ, పూజాకళ్యాణోత్సములు

జరిపించుటకొరకును,బాటసారుల యుపయోగార్థము సత్రములు గట్టించుట కొరకును, వినియోగించుచుండిరి.

జమీందారులు నివసించెడి భవనములు, కొలువు కూటములు హావేళీలనియు, దివాణములనియు బిలువబడు చున్నవి. వీరికి కొన్ని రాజ లాంఛనములు, బిరుదువాద్యములు పూర్వసంప్రదాయములు యున్నవి. వీరిలో కొందరు సాహిత్యాలంకార శాస్త్రమునందు బండితులు. వీరు కవిపోషణమును స్వధర్మముగా నెంచిరి. దేవాలయ ఉత్సవములందును, కళ్యాణ మహోత్సవములందును, నవరాత్రులందును, పట్టాభిషేకదినము లందును నాట్యప్రదర్శనములు జేయించుట వీరిగ్రామములయం దిప్పటికిని యాచారమైయున్నది. దేవాలయములందు నాట్యము జేసెడి దేవదాసీలు కొన్ని జమీందారీ గ్రామములందు నేటికిని దేవాలయ మాన్యముల ననుభవించుచుండిరి. వెంకటగిరి, విజయనగరం, పిఠాపురం, నూజివీడు, కాళహస్తి, పానుగల్, చంద్రగిరి, శివగంగ, ప్రస్తుతపు రామనాథ్, తంజావూరు ప్రాంతములందిట్టి జమీందారు కుటుంబముల వారిప్పటికిని నివసించుచు పూర్వనాట్యసంప్రదాయములను, రాజ సభా గౌరవ సత్కారములను నిలుపుచుండిరి.

ఇట్టి సంస్థానములలో వెంకటగిరి మిక్కిలి పురాతన మైనది. వెలుగోటి వంశమువారీ సంస్థాన పాలకులు. వీరు పద్మ నాయక కులమునకు జెందిన వెలమజాతి వారు. వీరిది రేచర్ల గోత్రము. వీరి పూర్వీకులు రాయలుకాలమునాటినుండియు

స్వాతంత్రాధికారము ననుభవించి బలపరాక్రమ సంపన్నులై యుండిరని ప్రాచీన చరిత్రవలన దెలియుచున్నది. ఆదిలో వీరి ముఖ్యపట్టణమునకు "కలిమిలి"యనెడిపేరుండెను. వీరి వంశము నకుజెందిన అనపోతనాయని జేష్టపుత్రుడు సర్వజ్ఞసింగమ నాయడు నాటకాలంకార శాస్త్రములందు పాండిత్యము గలిగి యుండెను. ఆంధ్రకవి శ్రీనాథుడు రాజు సముఖమునకు పోవుచు శారదాదేవి నిట్లు ప్రార్థించెను.

సీ॥ దీనారటంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుఁ దోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
పగులఁ గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషణ క్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుగొల్పితి సార్వభౌమ బిరుద

తే॥ గీ॥ మెటుల మెప్పించెదో నన్ను నింక మీద
రావుసింగ మహీపాలు దీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణ నికురంబ శారదాంబ.

రాయప్పనాయని కాలమున విష్ణుపరమైన వెంకటగిరి వీరికి ముఖ్యపట్టణమైనది. * వీరు క్రీ. శ. 1601 సంవత్సరం నందు 100 గజములు, 1000 వాహనములు, 10,000 బాణములు, 1000 గుర్రములు, 12,000 తుపాకులు కలిగియుండిరి. వీరికి భేరి, ఢంకా, తమ్మట, కొమ్ములు మొదలగు వీర వాద్యములు గూడ యుండెను. వీరు కదనరంగము నందు నిపుణులైయుండిరని దెలియుచున్నది. వీరి వంశమునకు జెందిన శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్ర బహద్దరు వారు "సభారంజని" యను నృత్యగానాభినయశాస్త్ర గ్రంథమును తెలుగుభాషలో వచన రూపమున వ్రాసిరి. దీనిని భరత శాస్త్రమునకు సంగ్రహటీక యనవచ్చును. ఈ గ్రంధమందు నాయికా నాయకాది భేదములు, రాగాంగములు, దశవిధ గమకములు, వీణాదశప్రాణములు, సుబోధకముగా వివరించబడినవి. ఇందలి విషయ వివరణమువలన శ్రీవారు ఆలంకారిక అభినయ భరతశాస్త్రములందు ప్రవీణులగుటయే గాక గొప్ప వైణిక శిఖామణియని గూడ స్పష్టమగుచున్నది. ఇట్టిరాజుల కొలువు కూటమునందు నృత్యనాట్యాభినయ కోవిదులు, కవి గాయక పండిత శ్రేష్ఠులు, వర్ధిల్లుట సహజమేయగును.

వెలుగోటివారి యాస్థాన ముఖ్యపట్టణమగు వెంకటగిరి యందు ఇప్పటికిని కొందరు దేవదాసీలు దేవాలయ యీనాములు అనుభవించుచు పూజాది పర్వదినములందును, ఉత్సవము

* Local Records X LI. Brown, Madras Govt. Mss. Library.

లందును నాట్యముచేయుచుండిరని తెలియుచున్నది. నవరాత్రు లందు గాన నాట్య ప్రదర్శనాదికములను జరుపుట యీపట్టణ మందొక యాచారముగ గన్పట్టుచున్నది.

## నాట్యకళా పతనము

దేశమునందేకళయైనను యభివృద్ధినొందుటకు దానిని బోషించువారును, యనుసరించెడివారును యుండవలెను. కాల క్రమమున నాట్యకళ రాజసభాగౌరవమును గోల్పోయినది. ధనికులు సామాన్యప్రజలు నాట్యకళయందు నీచకాముకత్వము నారోపించిరి. కాగా యనాదినుండియు నాట్యకళను కులవిద్యగా స్వీకరించి వంశపారంపర్యముగా నాట్యము నభ్యసించిన కళా వంతులు నాట్యమునుండి విరమించిరి. వారిలో సంస్కారాభి లాష గలిగిన వారు నాట్యమనిన నేవగించుకుని వివాహములు జేసికొనిరి. వారు కుల విద్యను పరిత్యజించుటవలన కళాలక్ష్మికి దూరస్థులైరి. నేటి కళావంతులలో భరతనాట్య శాస్త్రమును అభినయమును నేర్చినవారు గనుపించుట దుర్లభమగుచున్నది.

దేశమందలి విద్యావిధానమందు నాట్యకళకు స్థానము లేకపోవుటవలన, ఇతర విద్యలు, శాస్త్రములు, కళలు పొందిన యభివృద్ధిని యీ కళబొందలేకపోయినది. అందువలననే నాట్య శాస్త్రమునకు గౌరవము అతిశయింపలేదు. నాట్యశాస్త్రమును జదివి నాట్యాభినయనముల నభ్యసించి తౌర్యత్రికములందు ప్రతి భావంతులైనవారు దేశమునం దరుదుగనేయుండిరి. భరతనాట్య శాస్త్ర ప్రవీణులవలననే ఈ కళకుగౌరవాభివృద్ధి గలుగగలదు.

కాని దేశమునందందరికిని నందుబాటులోనుండునట్లు భరతనాట్యా చార్యులు నాట్యవిద్యాసంస్థలను నెలకొల్పి సాధకులకు శిక్షణ మిచ్చుచుండినయెడల నాట్యకళ యింతటి దయనీయస్థితికి వచ్చి యుండెడిది గాదు. నాట్య విద్యాసంస్థలు, భరతాచార్యులు దేశమునం దరుదుగా నుండినపుడు సామాన్యముగ నాట్యకళ యందారోపించిన హేయభావమును దొలగించుటకూడ నొక దుర్ఘట కార్యమగును. నాట్యకళ నభ్యసించవలెనని కోర్కె-యుత్సాహముగల యువతీ యువకులం దచ్చటచ్చట కలిగినను అది యీడేరుట ప్రస్తుత పరిస్థితులందు దుర్లభమగుచున్నది.

జనసామాన్యములో నాట్యకళాగౌరవము క్షీణించిన దినములలో, వర్తమానకాలమందలి ప్రజావినోదములలో నొకటగు చలన చిత్రములందు నాట్యమునకు స్థాన మొసగుచుండిరి. వీరి యాశయము మెచ్చదగినది. కాని యాచరణయందు మాత్రము వీరు నాట్యమను పేరును వ్యాపారదృష్టితో నుపయోగించుచు యర్థరహితమగు ఆంగికాభినయమును ప్రదర్శించుచు సామాన్య జనాకర్షణనుమాత్రము గలిగించు చుండిరి. వీటివలన నాట్యకళ యందారోపించబడిన హేయభావమునుదొలగించుటకుమారుగా వారుకామోద్దీపనము చేయుచుండిరి. కొన్ని చిత్రములం దక్కడక్కడ శాస్త్రవిహితమగు నాట్యప్రయోగములు ప్రవేశ పెట్టబడినప్పటికిని వాటిప్రాశస్త్యమును జనసామాన్యము మెచ్చకుండిరి. సక్రమనిర్మితమార్గములలో ప్రజల యభిరుచిని పెంపొందింపవలసిన బాధ్యత, చలన చిత్రములపైన గూడనున్నది.

# నాట్యకళపై జాతీయ చైతన్య ప్రభావము

రమారమి మూడు శతాబ్దములు పారతంత్ర్య జీవితము ననుభవించిన భారతదేశ ప్రజలం దంకురించిన జాతీయభావములు చిగిర్చి, శాఖోపశాఖలైనవి. సత్యము, ధర్మము, అహింస మొదలగు సిద్ధాంతములమీద నాధారపడి ప్రవృద్ధమైన భారతీయ సంస్కృతి కాలప్రభావమున కతీతమై స్వీయశక్తి సంపదలతో ప్రకృష్టస్థాన మలంకరించినది. దేశస్వాతంత్ర్య సముపార్జనాశక్తిని యినుమడింపజేసిన జాతీయోద్యమము పల్లీపట్టణములందు వ్యాపించినది. వివిధ జీవితరంగములందును జాతీయ చైతన్యము తొణికిసలాడినది. కాగా విద్యావంతుల దృష్టి జాతీయ కళలపై బ్రసరించినది. జాతీయోద్యమ నాయకత్వము వహించిన గాంధీజీ తానాచరించి పిమ్మట యాదేశించిన సిద్ధాంతములు ప్రజలకు శిరోధార్యములైనవి. ఆయన సంకల్పించిన గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమము, దేశీయ పరిశ్రమల పునరుద్ధరణము జాతీయాభిమానుల దృష్టి నాకర్షించినవి. ఆయా రంగములందు సముచితమగు పునరుద్ధరణ కృషి జరిగినది. దేశీయ కళలందగ్రస్థానము వహించుచున్న సంగీత,నాట్యకళలువిద్యావంతులను, సంపన్నులను ఆకర్షించినవి. చరిత్రకారుల పరిశోధనలు, ప్రాచీన శిల్పకళా ఖండములు సజీవమూర్తులై యుద్బోధించుచుండిన నాట్యకళా పరిజ్ఞానము విజ్ఞాన ప్రపంచమునందు

చైతన్యము కలిగించినవి. ప్రాచీన నాట్యకోవిదులు, ఆంగ్లేయ విద్యాభ్యాసము గావించి దేశినాట్యకళా పునరుద్ధరణమునకై బూనుకొనిన నవ్యులు దేశమునందు బహుముఖములుగా కృషి జేయ నారంభించిరి.

## కూ చి పూ డి

భాగవతులకు నిలయమైన కూచిపూడి నృత్యగీతా నాదములతో యానందతుందిలమైనది. సంఘమునందొకనాడు హేయముగ జూడబడి, కళావంతులచేత పరిత్యజించబడిన యీ నాట్యకళను, కూచిపూడి భాగవతు లుద్ధరించిరి. వీరి కళాప్రావీణ్యము, శాస్త్ర పాండిత్యము, విశిష్టత, రసజ్ఞ లోకము నుర్రూతలూగించినది. నాట్యకళకు తిరిగి సభాగౌరవ ప్రాప్తి గలిగినది.

కూచిపూడి భాగవతుల నాట్య సంప్రదాయములు, యక్షగానములు తెలుగుదేశమునందే గాక తమిళ దేశమందలి తంజావూరు ప్రాంతములలోని ఊత్తుకాడు, సూలమంగళం మొదలగుచోట్ల వ్యాపించి, స్థానికులచేత వంశపారంపర్యముగ నభ్యసింపబడినవి. అచ్చటి తమిళ భాగవతమేళ నాటకము లందు తెలుగుపదములు పాడి యభినయించబడినవి. క్షేత్రయ్య రచించిన మువ్వగోపాల పదము లాప్రాంతములం దనన్యప్రచారము గాంచినవి.

కూచిపూడి భాగవతులు ప్రదర్శించిన యక్షగానములు నృత్యనాట్య ప్రధానములై, విజ్ఞానప్రచారము గావించి పండిత

పామరులను రంజించినవి. వారు ప్రదర్శించిన యక్షగానములు వ్రాతప్రతులనుండియే గ్రహించబడెనని దెలియుచున్నది. వాటిలో "ఉషాపరిణయము" ప్రధానమైనది. దీనిని శ్రీనివాసకవి, అంక భూపాలుడు, నడిమింటి రామజోగి యను మువ్వురు కవులు వేరువేరుగ వ్రాసిరి. బాణాల వీరశరభకవి కృతమగు 'కాళింగ మర్దనము' జగన్నాధకవి 'ఎరుకల కురవంజి' మండలేముల వెంకట రామకవి "గంగా గౌరీవిలాసము" పెద్దామాత్యుడు 'గౌరీ కల్యాణము,' మర్ల అప్పయ్య 'చంద్రతారా విలాపము,' మల్లయ్యకవి 'రుక్మాంగద' వెంకటకృష్ణయ్య "శారదా కుర వంజి" సుబ్బరాయకవి 'సారంగధర నాటకము' మొదలగు వాటిని వారు ప్రదర్శించి యుండవచ్చును. ఈ యక్షగానము లన్నియును నేటికిని అముద్రితముగనే యున్నవి. ముద్దుపళని రచించిన నాట్యాభినయోపయుక్తమగు 'సప్తపదులు' వారు ప్రయోగించినట్లు తెలియుటలేదు.

కొన్ని తరములు దాటిన పిమ్మట కూచిపూడి గడ్డ మీదనే మరికొందరు భాగవతులుదయించి, యానువంశిక విద్యయందారితేరి కీర్తి విస్తారులైనవారిలో వెంపటి వెంకట నారాయణ, భాగవతుల దశరధరామయ్య, చింతా వెంకట రామయ్య ప్రభృతులు ముఖ్యులు. ఆ కాలమునందే వెంపటి కోదండరామయ్యకు "కలియుగ సత్యభామ" యను బిరుద ముండినట్లు తెలియుచున్నది. ఆయన భామవేషమునం దధిక

ప్రజ్ఞావంతుడు. చింతా వెంకట రామయ్య యక్షగానములందు లందు ప్రసిద్ధుడై యుండెను. వీరందరును కీర్తికాయులైరి.

కూచిపూడి భాగవతులలో నేటికిని యీ భరతనాట్య సంప్రదాయమును నిలువబెట్టుచున్న వృద్ధమూర్తి వేదాంతం లక్ష్మీనారాయణ. వీరు భామ వేషమునందు అందె వేసిన చేయి. భరతనాట్య శాస్త్రమందు సమగ్రమైన కృషిచేసిన వెంపటి సత్యనారాయణ, వేదాంతం రాఘవయ్య, కూచిపూడి భాగవతుల కోవకు చెందినవారు. కాని వీరందరును దమ స్వగ్రామమగు కూచిపూడినుండి చెన్నపట్టణమునకు వెళ్ళి చలన చిత్రములందు కృషి చేయుచుండిరి. ఇప్పటికిని కూచిపూడి గ్రామమునందు ప్రాచీన నాట్య సంప్రదాయానుగుణముగా బాలురకు నాట్యవిద్యను నేర్పుచుండిరి. అనువంశిక ప్రావీణ్యతను గాంచిన చింతా కృష్ణమూర్తి యక్షగాన ప్రయోగములందనుభవ కుశలుడై వెంకటరామ నాట్యమండలి యనుపేర నొక సంస్థను నెలగొల్పి సంప్రదాయసిద్ధ గౌరవమును నిలుపుచుండిరి. కూచిపూడి భరతమునందు ప్రవీణులైన వెంపటి సత్యనారాయణ కథాకలి, ఔత్తరాహుల కథక్ నాట్య సంప్రదాయములందుగూడ యభినివేశము అలవరచుకుని భిన్ననాట్య సంప్రదాయములందలి భేదములను నాట్యప్రయోగములందు జూపగల సమర్థుడు. వేదాంతం లక్ష్మీనారాయణగారివద్ద భరత నాట్యమునందు శిక్షణమునుబొంది, కొందరు కేరళదేశమందలి కథాకలి నాట్యమునుగూడ నభ్యసించిరి. కూచిపూడి గ్రామ

మందిటీవల గలిగిన చైతన్యప్రభావమువలన యచ్చట నొక నాట్యవిద్యాలయము నెలగొల్పబడినది. కాలక్రమమునందది వృద్ధిగాంచి యీ గ్రామమందలి బాలురకేగాక, ప్రఖ్యాతి నొందిన కూచిపూడి భరతనాట్యము నభ్యసింపదలచిన ఇతర ప్రాంతీయులకుగూడ శాస్త్రవిహిత శిక్షణము నీయగల యున్నతస్థితికి రాగలదు. కూచిపూడి గ్రామమందు భరతశాస్త్ర పారంగతులకు కొదువలేదు. సక్రమ నిర్మిత విధానములో కృషి సుసంఘటితము గావించబడి శాస్త్ర ప్రాధాన్యతకు దగిన పరి శ్రమ అనుసంధించబడిననాడు కూచిపూడి భరతనాట్యము మరల పూర్వప్రతిష్ట గాంచగలదు.

## తంజావూరు

తమిళదేశమందలి భాగవతమేళ నాటకములందు ప్రసిద్ధి వహించిన పందనలూరు మీనాక్షిసుందరం పిళ్ళై ఇటీవలి వర కును నివసించి ఆప్రాంతములందు కూచిపూడి భరతనాట్య సంప్రదాయములను, పదాభినయమును విద్యార్థులకు నేర్పు చుండిరి. ప్రస్తుత మీ ప్రాంతములందు భరత శాస్త్రజ్ఞులలో వృద్ధులు వల్లూరు నారాయణస్వామి అయ్యర్. ఆయన పూర్వము మోహిని వేషమునువేసి ప్రజలను రంజనజేసిన అభి నయ కుశలుడు. నేటికిని వారు "మువ్వగోపాల" పదములనే బాడుచు అభినయించుచుండిరి. తెలుగుదేశమందుదయించిన కూచిపూడి భరతము దక్షిణదేశమందు వ్యాప్తి గాంచుటయం

దక్కజములేదు. వంగదేశమునందు క్రీ. శ. 11 వ శతాబ్దమున జయదేవ కవి రచించిన 'గీతగోవిందం' దేశమునందలి మరి యేయితర ప్రాంతములందు వ్యాపించుటకు పూర్వమే కేరళ దేశమునందు అనన్య ఖ్యాతిగాంచినది. సాహిత్యాధారముల వలనను, పూర్వచరిత్రవలనను, తంజావూరు, కూచిపూడి భరత నాట్య సంప్రదాయములు రెండును యొకటే యనియు, తంజా వూరునందు కూచిపూడి నాట్యసంప్రదాయమును ఆంధ్రదేశ మందలి కూచిపూడిభాగవతులు నెలగొల్పిరనియు, అటుపిమ్మట తమిళ భాగవతమేళక ర్తలా సంప్రదాయములను ప్రచారము గావించిరనియు స్పష్టమగుచున్నది.

## చెన్నపట్టణము

శ్రీమతి రుక్మిణీ అరండేలు చెన్నపట్టణమందలి దివ్య జ్ఞాన కేంద్రమునందు "కళాక్షేత్రము"ను నెలగొల్పి, నాట్య విద్యయందు శిక్షణ మిచ్చుచుండిరి. ఈమె ప్రాక్పశ్చిమ నాట్య శాస్త్రములను దరచిచూచిన విదుషీమణి. ఈ కళాక్షేత్రము నందు శిష్ట సంపన్నమగు భరతనాట్యమును, కేరళదేశమందలి కథాకలి నాట్యమును విద్యార్థివిద్యార్థినులకు నేర్పుచుండిరి.

కళాక్షేత్రమునందు తమ బాలికలకు నాట్యవిద్యయందు శిక్షణ మిప్పించుటకు సంపన్నగృహస్థులు, నాట్యకళాభిమానులు నేడుముందడుగు వేయుచుండిరి. ఉత్తమ కులములకుజెందినసంపన్న గృహస్థుల బాలికలు నాట్యశిక్షణమును బడసి, నాట్యప్రయో

గములు గావించుచుండుటవలన పూర్వమునాట్యకళయం దారోపించబడిన న్యూనతా, హేయభావములు నేడు దొలగినవి. నేడు నాట్యమొక శిష్ట సభ్యతగా బరిగణన చేయబడుచున్నది.

శ్రీమతి రుక్మిణీదేవి, కాళిదాస కవి సంస్కృతమున రచించిన 'మాలవికాగ్ని మిత్ర'మను నృత్తరూపకమును భరత నాట్యశాస్త్ర సంప్రదాయానుగుణముగా బ్రదర్శించి ప్రాజ్ఞ లోకమును మెప్పించినది వీరు 'కుమార సంభవము'ను గూడ నృత్తరూపకముగా బ్రదర్శించుచుందురు. కథాకలి నాట్యసంప్రదాయము ననుసరించి వీరభినయింతురు. ఈమె యభినయమునందు 'మువ్వగోపాల' పదములనే బాడుచుండును. గీతానృత్తాభినయములం దీమె బ్రజ్ఞావంతురాలు.

పండనల్లూరు మీనాక్షీ సుందరం పిళ్ళై కొంతకాలము కళాక్షేత్రమునందు నాట్యాచార్యులుగనుండి పలువురకు నాట్యకళయందు శిక్షణ మొసగిరి. వర్తమాన కాలమునందు భరత నాట్యశాస్త్రమున కూలంకష పరిజ్ఞానము కలిగినవారు పండనల్లూరు చొక్కలింగం పిళ్లై. వీరు వయోవృద్ధులు.

భరతనాట్యమునందు శిక్షణా తరగతులను నెలగొల్పి నాట్యపరిజ్ఞానవ్యాప్తికి కృషిచేయుచున్న సంస్థ ది ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫైన్ ఆర్ట్సు. ఈ సంస్థయందు నాట్యాచార్యులుగనుండి పండనల్లూరు చొక్కలింగం పిళ్ళై అపారమైన కృషిచేయుచున్నారు. ఇంద్రాణి, రహమాన్, రీటా చటర్జీ, గీనా మున్నగువారు నాట్యకళయందు కోవిదులైరి.

ఔత్తరాహ నాట్యాంగమైన కథక్, దాక్షిణాత్య సంప్రదాయము లైన భరతనాట్యము, కథాకలి నాట్యములందు సమ్యగ్ప్రతిభ గాంచిన ఉదయశంకర్ నాట్యప్రయోగములందు విలక్షణ ప్రతిభను వ్యక్తము గావించెను. తారాచౌదరి, భిన్న నాట్య సంప్రదాయములందును పరిణత ప్రజ్ఞ గాంచినది. వీరు నవనాట్యకారులకు ఘంటాపథములగు నూతన మార్గములను, ఆదర్శములను నెలగొల్పిరి.

## మలబారు

కేరళ ప్రభువుల ముఖ్యపట్టణమగు తిరువాన్కూరు నందు ఆచార్యవల్లతోల్ 'కేరళ కళామండల'మను నాట్యశిక్షణాలయమును నెలగొల్పి బాల బాలికలకు శిక్షణ మొసగుచున్నారు. కేరళదేశీయుల శాఖాచారముల ననుసరించి వారి బాలబాలికలకు నాట్యమునందు భిన్నపద్ధతులను నేర్పుచు దేశీయనాట్య సంప్రదాయ ప్రతిష్ఠను విస్తృతము జేసెడి యుద్యమమును వీరుబట్టిష్టము గావించిరి.

కథాకలి నాట్యప్రయోగమునందు గోపీనాథ్, నేడు ప్రామాణికుడని జెప్పవచ్చును. కేరళ రాజాస్థాన నటుడై ఈయన సన్మానమును బొందెను.

గోపీనాథ్ రాజాదరణమువలన "గోపీనాథ్-తంగమణి" నాట్యబృందము నేర్పరచి పశ్చిమదేశములందు బర్యటనము గావించి, అచ్చటి కళాకారులకు, తత్వశాస్త్రజ్ఞులకు, పండితు

లకు, విమర్శకులకు కథాకళి నాట్యప్రయోగములు జూపెను. పాశ్చాత్యాలంకార శాస్త్రజ్ఞులు, విమర్శకులు కథాకళి నాట్యము ప్రస్ఫుటము గావించెడి ఉదాత్తాభినయ గుణ విశిష్టతను శ్లాఘించిరి. అంతర్జాతీయ నాట్యరంగమునం దొక విశిష్ట స్థానమును కథాకళి నాట్యమునకు సమకూర్చిన నాట్యాచార్యుడు గోపీనాద్ సుప్రసిద్ధుడు. ఆయన నృత్తరూపకములందు హిరణ్య కశ్యపుడు, రావణుడు మున్నగు పాత్రముల యభినయమునం దద్వితీయ ప్రతిభాసంపన్నుడు. రాజాదరణము బొందుటవలననే కథాకళి నాట్యము స్వీయ విశిష్టతను అంతర్జాతీయ నాట్యరంగమందు గూడ నెలకొల్పి సముచిత స్థానమలంకరించ గలిగినది. కేరళదేశమందలి కథాకళి నాట్యమునందు కుంజకురుప్ గూడ సిద్ధహస్తుడు. కథాకళి నాట్య సంప్రదాయమును విస్తృతము గావింపవలెననెడి కృషి కేరళదేశమం దవిరళముగ సాగుచున్నది.



# స్వతంత్ర భారతదేశమున నాట్యకళ

భారత దేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము సిద్ధించినది. దేశ స్వాతంత్ర్యావతరణమునకు బూర్వమే ప్రజలలో దేశీయ కళల పునరుద్ధరణముపట్ల శ్రద్ధాసక్తులు గలిగినవి. మానవజీవిత మందలి భిన్నరంగములలో, వివిధకళలలో జాతీయాశయముల కనుగుణముగ పునర్నిర్మాణమును కొనసాగింపవలెననెడి సిద్ధ సంకల్పము సర్వేసర్వత్ర గోచరించినది. ఇట్టి సమధికోత్సాహామే నాట్యకళారంగమునందుగూడ బహుముఖవ్యాప్తి గాంచినది. ప్రకృత స్థితిగతుల కారణముల నెరిగి, యుక్తమగు మార్గము లను నిర్ణయించి యనుసరింపగలిగినపుడే ఫలితము కలుగును.

అనాదిసిద్ధముగ "నాట్యకళ" ఉజ్జ్వలమగు పూర్వచరి త్రను గలిగియున్నది. నాట్యకళ మానవజీవితములో అంత ర్లీనమై, అతని సుఖదుఃఖములను, ఖేదమోదములను, విషణ్ణాసన్న త్వములను పాలుపంచుకొని వాస్తవికత్వమునకు ప్రతిబింబమై నది. ఆనందోద్రేకియగు మానవుడు గోరిన యానందమును నాట్యకళ యాతని కొసగినది. అతడి మనస్సును రంజించుచు ఉదాత్తమగు విజ్ఞానము నాతని కుపదేశించినదీ కళ. నాట్యకళా ప్రావీణ్యతను బడయుటకు నటకునకెంతటి శారీరక, మానసిక ధార్ఢ్యముండవలెనో, అట్టి పరిపుష్ట నాట్యప్రయోగమును దిల కించెడి సామాజికునకు గూడ నంతటి పరిపక్వమనస్తత్వము యుండవలెను.

నాట్యకళ తిరిగి పూర్వపు ఔన్నత్యమును గాంచుటకు ఆయా కాలములలోని మానవ జీవితముతో మిళితమై యప్పటి కళాత్మక రూపములకు ప్రతిబింబము గావలెను. వర్తమాన కాలమున గూడ నాట్యకళ, మానవ జీవితములో మేళవించుకుని పోగలిగినపుడే అది వాస్తవిక శక్తిని బొంది సామాజికులలో మంచి యభిరుచిని పెంపొందించ గలదు. ఇతర కళలవలెనే నాట్యకళకుగూడ అలంకార శాస్త్రములతోడను, సమాజ శాస్త్రములతోడను సన్నిహిత సంబంధమున్నది. చక్షుశ్శ్రోత్రేంద్రియ గోచరమగు నీకళ స్వయంసంపూర్ణమైనది. అనన్యమగు నీకకళకు న్యూనతాదిగుణముల నాపాదించుట ధర్మ విహితముగాదు. కళాగ్రహణ, రసానందాది అనుభూతులు మానవునితోడనే ప్రారంభమగుచున్నవి. గావున కళావిషయమున మంచిచెడుగులు నిర్ణయము జేయుటయందు ధర్మప్రసక్తి యుండదనియు, కళాగ్రహణ రసాస్వాదనాదిశక్తులు మానవుని సంభావనీయతపై నాధారపడి యుండుననియు రూఢి యగుచున్నది.

శిల్ప, చిత్రలేఖనాది కళల సాదృశమువలన బరిణామము కళలకు సహమని దెలియుచున్నది. అట్టి పరిణామము అభ్యుదయ కరముగా వచ్చును, లేదా యభ్యుదయ నిరోధకముగా వచ్చును. నాట్యకళబొందిన పరిణామము యభ్యున్నతికి ప్రతిబంధకమైనది. నాట్యకళ యెట్టి కారణములవలన ప్రస్తుత స్థితిగతులకు వచ్చినదియు, ఎట్టి మార్పు జేయుటవలన బ్రియో

జనము కలుగునదియు, నిర్ణయించుట వివేకమగును వివేకోదయమే స్వాతంత్ర్య లక్షణ మగుచున్నది. మనకు లభించిన స్వాతంత్ర్యమును సమగ్రముగను సంపూర్ణముగను రూపొందించుటకు మనల నావరించిన భిన్నసమస్యలతోబాటు నాట్యకళనుగూడ సుసంఘటిత విధానము ననుసరించి ఉన్నతస్థాయి యందు నిలపవలెను.

నాట్యమునకు శరీరవ్యాయామము ప్రాథమిక శిక్షణ మగుచున్నది. నాట్యాభ్యాసమునకు గూడ బాల్యదశయే మంచి తరుణము. అలంకార, సంగీత, శాస్త్రములతో దగ్గర సంబంధముగల నాట్యవిద్యను బాల్యదశనుండియు ప్రారంభించిననే గాని, కొన్ని సంవత్సరముల సక్రమశిక్షణానంతరముగాని, సాధకునకు ప్రావీణ్య మలవడదు. కావున నాట్యవిద్యను గూడ ప్రస్తుత విద్యావిధానమందలి పాఠ్యక్రమముతో ననుసంధానము గావించినపుడు బహుళ ప్రయోజనకారి గాగలదు. ఇట్టి బాధ్యతను సక్రమముగా నిర్వహించుటకు ప్రభుత్వము పూనిక వహించుటవలన నాట్యకళ యచిరకాలమునందే ఫలప్రియము గాగలదు. దేశమునందు కొన్ని పట్టణములలో నాట్య విద్యా సంస్థలు నాట్య కళాభివృద్ధికి యథాశక్తిని దోహదము గలిగించుచున్నవి. కొందరు వ్యక్తిగతముగా నిర్వహించుచుండిన నాట్య విద్యాసంస్థలు సంపన్నుల బాలికల కనువుగ నున్నవి గాని జన సామాన్యము కందుబాటునందు లేవు. ఉదీయమాన యువతీ యువకులందు నాట్యోత్సాహమును ప్రచలితము గావించుటకు

జనబాహుళ్యమునకు తగిన నాట్య విద్యాసంస్థలు దేశమునందు లోపించినవి.

ఇటీవల మద్రాసు విశ్వవిద్యాలయము నారికి నాట్యమును విద్యాప్రణాళికయందొక పాఠ్యభాగముగా ప్రవేశపెట్టవలెనని మద్రాసు ప్రభుత్వమువారు సూచించినట్లు దెలియుచున్నది. విద్యార్థులకు ప్రాథమిక, మాధ్యమిక ఉన్నత కళాశాల తరగతులవరకును నాట్యమునందు శిక్షణము నిచ్చిన యెడల కాలేజి తరగతులందును, పరిశోధనా పట్టపరీక్షలందును, నాట్యాలంకార అభినయ శాస్త్రములు, పదసాహిత్యము, నృత్తరూపకములగు యక్షగానములు అత్యంతోపయుక్తములై యాచరణమునందు క్రమలక్ష్యములై వర్ధిల్లగలవు. విద్యార్థి ఉన్నత పాఠశాలయందలి విద్యను బూర్తిజేయు నప్పటి కాతనికి నాట్యమొక యనుబంధ వృత్తి విద్య గాగలదు. పట్టభద్రులు సాహిత్యాలంకార శాస్త్రములందును, నృత్తరూపకములందును బరిశోధన జరుపుటకు బ్రోత్సహించిన యెడల యమూల్యమగు ప్రాచీననాట్య కళావిజ్ఞానము దేశవ్యాప్తమగుటయేగాక నవ్యరచనా సంగమునకు క్రొత్తతెన్ను లేర్పడగలవు. విద్యార్థులు నాట్యశాస్త్రములందు పట్టభద్రులై యైచ్ఛికముగ గాని, వృత్తిరూపముగ గాని నాట్యమును జీవితాలంబనముగా గ్రహించినయెడల సంఘమునందు నాట్యకళాగౌరవ మతిశయించగలదు.

మద్రాసు విశ్వవిద్యాలయము వారు సత్వరముగా నాట్యమును పాఠ్యభాగముగ నిర్ణయించి యమలు జరిపినయెడల నాట్యశాస్త్రి గౌరవము వినుమడింప జేయుటయేగాక గౌరవోద్దీపమగు యొకవృత్తి విద్యనుగూడ నెలగొల్పిన వారగుదురు.

మద్రాసు విశ్వవిద్యాలయము అభ్యుదయకర పథకముల ననుసరించుటయందగ్రగామియై ఇతర విశ్వవిద్యాలయములకు మార్గదర్శి గాగలదు.



# అనుబంధము ౧

## కొందరు నాట్య ప్రామాణికులు

సదాశివుడు
చతుర్ముఖ బ్రహ్మ
శివుడు
పార్వతి
భరతుడు
కాశ్యపుడు
మాతంగుడు
యష్టికుడు
దుర్గాదేవి
శార్దూల
కోహలుడు
విశాఖ
దత్తిల
కంబల
అశ్వక
వాయు
రంభ
నారదుడు
అర్జునుడు
తుంబురుడు
ఆంజనేయుడు
మాతృగుప్త
రావణుడు
నందికేశ్వరుడు
పార్వతి
గుణ
దేవరాజు
క్షేత్రిరాజు
రుద్రసేనుడు
భోజ భూపల్లభుడు
పరమార్థి
సోమేశుడు
జగదేకుడు
మహోపతి
వ్యాఖ్యాకారుడు
భారతీయుడు
కీర్తిధారుడు

# ప్రాచీన నాట్యలక్షణ గ్రంధములు

కోహలీయం
అర్జునీయం
సోమనాథీయం
స్వర రత్నావళి
కళారత్నాకర
సాహిత్యదర్పణం
హరిపాలీయ షష్ఠి
శృంగారతిలక
రసమంజరి
సంగీత సర్వస్వం
రసకళిక
కార్హాస్పత్యం
మాతంగీయం
సాహిత్య చంద్రోదయం
నందికేశ్వరీయం
సంగీత చూడామణి
సంగదేవ రచన
సంగీత సూర్యోదయం
నందికేశ్వర అభినయ దర్పణం

# BOOKS CONSULTED


1. Abhinayadarpanam — M. Rama Krishnayya
2. „ — Madras Govt. Oriental Series
3. Ancient India and Hindu Civilisation — Paul Masson-oursel
4. Art of Kathakali — Panday
5. Art of Kathakali in Kerala — Dept. of Archealogy Travancore.
6. Abhinaya mukuram — Gopinath
7. Antiquties of India — L. D. Barnet
8. Adhyatma Sankeertanalu — Sri Venkatesa Oriental Series
9. Bharta Natyam — G. Venkatachelam
10. Chera kings of the Sangam — K. G. Sesha-Iyyengar

11. Dance a National Art — R. Dunstan

12. Dance a National Gift — Eleanor Elder

13. Eurythmics — J. Dal Croze

14. Foreign Notices of South India — K. A. Neela kantha Sastry

15. Folk Dances of South India — Spreen

16. History of Nayakas of Madura — R. Sathyanatha Iyyer

17. Hoyasalas in the Tamil Country — K. R. Venkata Ratnam

18. Histrionic Art of Malabar — Dr. C. A. Achuta Menon

19. Hindu Musical Instruments — Sir S M. Tagore

20. History of Reddi Kings — M. Somasekhara Sarma

21. Indian Dance of South & Dravidian Works — C. A. Sreenivasa Iyyer

22. Indian Make-up — S. Mason

23. Kshetrayya Padamulu — Dr. G. V. Sitapati

24. ,, — Vissa Apparao

25. Music and Morals — H. R. Haweis

26. New Light on Pallava Period — K. Subramanyam

27. Nandikeswara Abhinaya Darpanam — C. Ananda Kumara Swami

28. Pandya Kingdom — K. A. Neelakantha Sastri

29. Philosophy of Modernism — C. Scott

30. Ragatala Chintamani — Govt. Oriental Series

31. Some Unrecognised Values of Indian Art — J. H. Cousins

32. Some Contributions of South India to Indian Culture — S. K. Iyyengar

33. Silappadikaram — V. R. Ramachandra deekshitar

34. Vijayanagara Sexcentinary Volume II — Salatore

35. The Language of Gesture — Critchiley